"స్త్రీ సాంప్రదాయసిద్ధమైన వేషభాషలతో, గృహ కృత్యాలను నిర్వహించుకొంటూ, భర్త చాటు భార్యగా ఉండటమే గౌరవప్రదమైంది. అంతేగాని కేవలం ఓ ఆకర్షణ యంత్రంగా తయారై, పెదవికి మించిన పల్లులా బయటపడడం బాగుండదు."

పవని నిర్మల ప్రభావతిగారు (ప్రభావతీ శ్రీధర్) 1939 మార్చి 12-వ తేదీన నెల్లూరుజిల్లా కనిగిరిలో పుట్టారు. కావలి, ఒంగోలుల్లో విద్యాభ్యాసం చేశారు.

చాలా కథలూ, నవలలూ వ్రాశారు. అందులో 'ఉదయ కిరణాలు'(నవల), 'శలభాలు' (నవల), 'స్త్రీ' (కథలసంపుటి), 'అనాథ' (కథలసంపుటి) మొదలైనవి పాఠకుల హృదయాలను బాగా చూరగొన్నాయి. వీరి రచనలు కొన్నికన్నడంలోకి కూడ ఎక్కా యి.




# పవని నిర్మల ప్రభావతి

యమ్. శేషాచలం అండ్ కో
మచిలీపట్నం. మద్రాసు
సికింద్రాబాదు

MANUSHULU, MANASULU
By
PAVANI NIRMALA PRABHAVATI

Published by :
M. SESHACHALAM & CO.

First Edition :
November '68

Printed at :
KRANTI PRESS, MADRAS-1

Cover Design :
BAPU

Distributors :
ANDHRA PRADESH BOOK DISTRIBUTORS
Rashtrapathi Road, Secunderabad

Rs. 2/-




56

ఎల్ల వేళలా నా అభివృద్ధిని కాంక్షిస్తూ, రచనల
విషయంలో తగు సలహాలు ఇచ్చి ఆదరించి,
అభినందించి, ఆశీర్వదించే మేనత్త

**శ్రీమతి అనసూరి విజయలక్ష్మమ్మగారికి**

ప్రేమతో

—నిర్మల

# 1

"కౌసల్యా సుప్రజా రామ పూర్వా సంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్!
ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద, ఉత్తిష్ఠ గరుడధ్వజ
ఉత్తిష్ఠ కమలాకాంత త్రైలోక్యం మంగళం కురు॥"

ఉదయభానుని బంగారు కిరణాలతోబాటు, సర్వభూతకోటినీ రక్షింపమంటూ, సర్వేశ్వరుని మేల్కొలుపుతున్న భక్తకోటి ముక్త కంఠాలు శ్రవణానందకరంగా వినవస్తున్నాయి! సర్వ ప్రాణికోటి శరణ్యమూ, సర్వభూత హితప్రదమూ అయిన శ్రీ వేంకటేశ్వరుని ఆలయంపైనున్న బంగారుకలశాలు బాలభానుని బంగారుకిరణాలతో పోటీపడి, తళతళ కాంతులు వెదజల్లుతున్నాయి!

"వండ్రఫుల్, మార్వెలస్! యీ ప్రశాంత ప్రభాతసమయంలో నువ్వెలా వున్నావో చెప్పనా కల్యాణీ?" అని విమల కిలకిల నవ్వింది.

చదువుతున్న నవల పక్కన పెట్టి విస్మయంగా చూసింది కల్యాణి.

"నువ్వొంతసేపయింది విమలా, వచ్చి?" అంది.

"నా రాకను గమనించే స్థితిలో వున్నావా? నిడుపాటి కురుల చివరల నీళ్ళురాలుతూ, అలా పుస్తకంలోకి తదేకధ్యానంగా చూస్తూ కూర్చునివున్న నిన్నూ, నీ అందాన్నీ చూస్తుంటే, నా మటుకు నాకే పరవశత్వం కలుగుతోంది. ఒక్క మాటలో చెప్పాలంటే 'క్రొంజి గురాకు వ్రేళల కురుల్ తడియార్చుచు గూరుచున్న అభ్యంజన మంగళాంగి'లా వున్నావ్!"

"బావుంది వర్ణన, పొద్దున్నే భట్రాజులా.... ఇంత ఉదయాన్నే వచ్చావ్. ఏం పనిమీదేవిటి?" ముఖం మీద తడితడిగా పరుచుకుని వున్న ముంగురుల్ని అలవోకగా సర్దుకుంది కల్యాణి.

"ఈ రోజు నా పుట్టినరోజు పండగోయ్! సాయంత్రం కాస్త పెందలాడే రావాలి నువ్వు."

"అలాగే!"

"తప్పక రావాలి సుమా! నే వెళ్ళొస్తా!"

విమల వెళ్ళిపోయింది. నవల చేతికి తీసుకుంది కల్యాణి.

"అమ్మగారూ! కాఫీ...." అంటూ వంటావిడ ట్రేలో కాఫీ, టిఫినూ పట్టుకు నిలబడి వుంది ఎదురుగా!

తలెత్తి చిరాగ్గా చూసింది కల్యాణి. కాఫీ మాత్రం తీసుకుని లేచి నిల్చుంది.

"లక్షమ్మగారూ! నేను తోటలో కూర్చుంటాను. అన్నయ్య అడిగితే చెప్పండి!"

గబగబ తోటలోకి నడిచింది కల్యాణి. మాంచి సస్పెన్స్‌తో నడుస్తున్న ఆ నవల పూర్తి చేసేంతవరకూ ఆమెకు తోచేలా లేదు.

రాత్రంతా వెన్నెలతో సరాగమాడిన పూలబాలలను వదిలి పోలేక హిమబిందువు లలాగే అంటిపెట్టుకు వున్నాయి. సూర్య కిరణాలు అది సహించలేనట్టుగా, సూటిగా ఆ బిందువులపై నిలుస్తు న్నాయి. గులాబీల వింతపరిమళం పిల్లగాలిలో నిండి గుబాళిస్తోంది! హృదయాన్నీ, శరీరాన్నీ గిలిగింతలు పెట్టే మనోజ్ఞ వాతావరణమది! చీరె కుచ్చెళ్ళు సర్దుకుని, మల్లెపందిరిక్రింద కూర్చుని పుస్తకపఠనంలో తాదాత్మ్యం చెందిపోయింది కల్యాణి.

"అదుగో! అక్కడ కూర్చుని చిత్తరువులా, నవలాపఠ నంలో మునిగివుందే, ఆమే మా చెల్లెలు కల్యాణి!"

దగ్గరలో రమేష్ కంఠస్వరం విని తలెత్తిచూసింది కల్యాణి. అన్నయ్య పక్కనే మరో యువకుడుకూడా నిల్చునివుండటం చూసి తత్తరపాటుతో సరిగా కూర్చుంది.

"ఇతగాడు డాక్టర్ ఉపేంద్ర. కల్యాణీ! నా ప్రాణస్నేహితుడు. స్కాలర్‌షిప్ మీద విదేశాలలో చదువు పూర్తిచేసుకుని, యీ మధ్యే వచ్చాడు!" అని రమేష్ తన ప్రక్కనున్న యువకుని పరిచయం చేశాడు కల్యాణికి.

నమస్కారాలయ్యాయి. పరీక్షగా ఉపేంద్రవేపు చూసింది కల్యాణి. కొద్దిగా నల్లగా, సన్నగా పొడుగ్గావుండే ఉపేంద్రను చప్పున చూసిన వాళ్ళెవరూ "అందగాడు"గా భావించరు! కాని గమనించి చూస్తే, ఆకర్షణీయమైన అతగాడి కన్నుల్లో కాంతి పుంజాలు నిండి వున్నాయనిపిస్తుంది!

ముగ్గురూ కూర్చున్నారు.

"నీకు మొక్కలంటే చాలా ఇష్టంలావుంది రమేష్! తోటను చాలా అందంగా తయారుచేశావ్!" అన్నాడు ఉపేంద్ర తోటంతా కలయజూస్తూ. అతగాడి మాటలలో మార్దవం ధ్వనిస్తోంది!

కల్యాణి కిలకిల నవ్వింది. "అన్నయ్యకా? పొరబాటు నేదేనా మొక్క కాలికి తగిలినా, వంగి చూడడు! నేనే వేశా నీమొక్కలన్నీ!"

రమేష్ చిరునవ్వు నవ్వాడు. "అవును ఉపేంద్రా! తన సౌందర్యంలానే, పరిసరంకూడా అందంగా వుండాలంటుంది మా కల్యాణి!"

సూర్య కిరణాలు చురచుర శరీరాలను తాకుతున్నాయి. "లోపలికి వెళ్దాం రాండి! ఎండ వస్తోంది!" అని కల్యాణి లేచి అడుగు వేసింది. రమేష్, ఉపేంద్ర అనుసరించారు.

"మా కల్యాణి అద్భుతంగా నాట్యం చేస్తుంది ఉపేంద్రా!" వెనుక వస్తున్న రమేష్‌మాటలు విని, చిరుకోపంతో తిరిగి చూసింది కల్యాణి. ఆ తిరగటంలో, ఓ విధంగా తమాషాగా వూగిన ఆమె తనూవల్లరి తళుక్కున మెరిసి మాయమైన విద్యుల్లతలా తోచింది ఉపేంద్రకు!

"ఆహా!" అన్నాడు.

"కాలేజీలోనే కాకుండా, యెన్నో పబ్లిక్ ఫంక్షన్స్‌లోకూడా బహుమతులు పొందింది! 'అందాల నాట్యరాణి కల్యాణి!' అన్నారోమంత్రి, కల్యాణి నాట్యప్రదర్శనం చూసి ముగ్ధులయిపోయి!"

"అబ్బబ్బ! ఇక ఆపవా అన్నయ్యా!" కల్యాణి చిరుకోపంతో

అలా విసుక్కుంటుంటే, విరిగిన ఆమె పెదవులవంపు ఉపేంద్రలో యేదో గిలిగింతను కలిగించింది!

''హలో! విమలా! ఐయామ్ సో సారీ! ప్లీజ్! ఈ ఒక్క సారికీ క్షమించు....బహుమతి మా నౌకరు వెంకన్నచేత పంపించేను! అది తిప్పి కొట్టకు! ఏం చెయ్యను చెప్పు! మా ఇంటికి, అనుకోకుండా, మా రమేష్ అన్నయ్య ప్రాణస్నేహితుడుగారట.... ఉపేంద్ర....అతిథిదేవుడు వేంచేశారు! రోజంతా ఊపిరిసలపని ప్రోగ్రాం నిర్ణయించేశాడు మా అన్నయ్య....మరి అతిథిని ఇంట్లో కూర్చోబెట్టి, నేను పార్టీకి రావటం సభ్యతగా వుంటుందా? నువ్వే ఆలోచించు....''

''కల్యాణి ముగించకుండానే విమల ఫోనులో కిలకిల నవ్వింది!

ఆశ్చర్యంగా క్షణకాలం మౌనంగా వుండిపోయింది కల్యాణి. అసలు త నీ కబురు చెప్పగానే విమల మండిపడుతుందనుకుంది.

''ఓయ్ కల్యాణీ! అతిథిదేవు లొచ్చారా? అసలు దేవుడేనేమో? మీ రమేష్ అన్నయ్య చెప్పాడులే నా కిందాకా ఫోన్‌లో. బహుమతి తిప్పి పంపడమే? ఊహూఁ పంపించనులే!''

కిలకిల నవ్వుతూనే ఫోన్ పెట్టేసినట్టుంది విమల! తిక్క పిల్ల!'' అని విసుక్కుంటూ ఫోన్ దగ్గర్నుంచి, అవతలికి వెళ్ళి పోయింది కల్యాణి.

రోజంతా కులాసాగా గడిచిపోయింది. రాత్రి భోజనాలు అయ్యాయి. ''నేనీ ట్రెయిన్‌కే వెళ్ళాలి రమేష్!'' అన్నాడు ఉపేంద్ర.

''అదేం కుదరదు. రాకరాక వచ్చావు. నాలుగురోజులుండి వెళ్ళాల్సిందే!'' రమేష్ ఆజ్ఞాపిస్తున్నట్టు అన్నాడు.

''క్షమించు రమేష్. మద్రాసులో కొన్ని ముఖ్యమైన పను లున్నాయ్! మరోమారు వచ్చినప్పుడు....మీరు వెళ్ళమనేంతవరకూ వెళ్ళను!'' ఉపేంద్ర నవ్వుతూ అన్నాడు:

"యీ మారొస్తే, నేను కాదు నీ ప్రోగ్రామ్ నిర్ణయించేది.... మా చెల్లెలు కల్యాణి!" రమేష్ నవ్వుతూ కల్యాణివైపు చూశాడు.

"అంతేనండీ ఉపేంద్రగారూ! నా పర్మిషన్ తీసుకునే మీరు వెళ్ళాలి!" కల్యాణి సహజంగా అంది. రమేష్ మాటలలోని అంతరార్థం ఆమె కవగాహన కాలేదని ఉపేంద్రకు స్పష్టంగా తెలిసిపోయింది.

"కల్యాణీ! కారు నువ్వే డ్రైవ్ చెయ్యి. ఆ విద్యా కూడా చూస్తాడు ఉపేంద్ర." అన్నాడు రమేష్. స్టేషన్‌కు ఉపేంద్రను తీసుకెళ్ళటానికి సిద్ధపడుతూ!

"ఓ! అల్లాగే."

కారు స్టార్ట్ చేసింది కల్యాణి.

వెనకసీట్లో కూర్చొని వున్న మిత్రులిద్దరూ ఆపకుండా మాట్లాడుకుంటున్నారు. "ఎలాగేనా ఉపేంద్ర స్వభావం కాస్త బిడియంతో కూడుకున్నది. ఎక్కువగా మాట్లాడడు. అనుకుంది కల్యాణి.

"నీకు నా పరిస్థితులూ, నన్ను గురించి అంతా తెలుసు! మీ అంతస్తుతో నేను...."ఉపేంద్ర మాటలు అస్పష్టంగా వినిపించాయి.

అంతస్తులూ, గింతస్తులూ కట్టిపెట్టు! అవన్నీ నేనాలోచించుకోవాల్సిన విషయాలు. నీ పనల్లా నేను ఉత్తరం వ్రాసినప్పుడు రావటమే!" అంటున్నాడు రమేష్.

స్టేషన్లో అడుగెట్టారో లేదో ట్రెయిన్ వచ్చేసింది.

"సరిగ్గా టైంకు రాగలిగాం!" కంపార్ట్‌మెంటులో కూర్చుని ఉపేంద్ర 'అమ్మయ్య' అని నిట్టూర్చాడు.

"ఈ నెలలోనే ఏర్పాటు చేస్తాను ఉపేంద్రా!" అన్నాడు రమేష్ ఉపేంద్ర చెయ్యి పట్టుకుని వూపుతూ.

కల్యాణికి మిత్రులిద్దరి సంభాషణా అంతుదొరకటంలేదు.

"సరే నీ యిష్టం. కాని కల్యాణి ఇష్టాన్ని కూడా కనుక్కో!"

ట్రెయిన్ కదులుతూంటే కాస్త గట్టిగానే అన్నాడు ఉపేంద్ర. కల్యాణి వేపు తిరిగి మర్యాదాపురస్సరంగా చేతులుజోడించి, బిడియ

డుతూ, ఏదో, ఒకటో అరో మాట్లాడిన ఉపేంద్ర హఠాత్తుగా "కల్యాణి ఇష్టం కూడా కనుక్కో!" "అంటూ అంత చనువుగా ఎలా పలకగలిగాడో? కాకున్నా ఉపేంద్ర విదేశాలకు వెళ్ళొచ్చిన వ్యక్తిలా లేడు. అలా విదేశాలకు వెళ్లొచ్చినవాళ్ళు ఎంత స్టయిలిష్‌గా వుంటారు? నిరాడంబరంగా, ముక్తసరిగా మాట్లాడే ఉపేంద్ర కొద్దిగా చదువుకున్న సంస్కారిలా మాత్రమే కనిపిస్తాడు" అనుకుంది కల్యాణి.

"కల్యాణీ! ఎలావున్నాడు ఉపేంద్ర?" కారు డ్రైవ్‌చేస్తున్న రమేష్, పక్కనున్న చెల్లెలివేపు చూస్తూ అడిగాడు.

"బాగానే వున్నాడు! చెడుగా లేడు గాబట్టి" అనుకుంది లోలోపల కల్యాణి.

"మనసు వెన్న! ఎవరికి కష్టం కలిగినా చూళ్ళేడు. తన అవసరాలను పక్కకునెట్టినాసరే, ఇతరులను ఆదుకుంటాడు. చిన్న తనం నుంచీ, ఉపేంద్ర స్వభావం అంతే; అందుకే డాక్టరయి ప్రజా సేవ చేయాలనుకున్నాడు. పట్టుదలగా చదివి, మెరిట్ స్కాలర్ షిప్‌తో పైకివచ్చాడు." రమేష్ చెప్పుకు పోతున్నాడు. అతగాడి హృదయింలో మిత్రునిపట్ల అభిమానం పొంగిపొర్లుతోంది.

"ఉపేంద్ర తలిదండ్రులూ వాళ్లు ఎక్కడున్నా రన్నయ్యా" కల్యాణి కుతూహలంగా అడిగింది.

"పేద కుటుంబంలో పుట్టాడు ఉపేంద్ర. చిన్నతనంలోనే తల్లి, తండ్రి చనిపోయారు. మన నాన్నగారు కూడా జాలిపడి తరచూ సహాయం చేస్తుండేవారు!" రమేష్ కళ్ళల్లో నీళ్లు నిలిచాయి. తమను తల్లిలేనిలోటు తీర్చి పెంచుతూన్న నాన్నగారు కూడా హఠాత్తుగా గుండె జబ్బుతో చనిపోయిన నాటి దృశ్యం కళ్ళముందు మెదిలింది కల్యాణికి. తల్లిదండ్రులు కరువైన బిడ్డల బ్రతుకు ఎంత దయనీయమైంది?

"తర్వాత?" మెల్లిగా అడిగింది కల్యాణి.

"మేనమామ ఒకాయన పేరుకు దగ్గరకు తీశాడు ఉపేంద్రను. అక్కడవాళ్ళు నీచంగా చూడటంతో, ఆత్మాభిమానం దెబ్బతిని ఒంట

రిగా వేరుగా వుండటం మొదలెట్టాడు. వారాలు చనుకుంయూ ..
వాడు. వృద్ధిలోకి వచ్చాడు!"

కల్యాణి ఆలోచనలో పడింది.

"అంతటి దీనస్థితిలో నుంచి ఇంతటి ఉన్నతి సాధించటం ప్రశంసనీయమేనన్నయ్యా!" అంది ముక్తసరిగా.

"ఇప్పుడు ప్రైవేట్ డిస్పెన్సరీ ఒకటి పెట్టాలని నిర్ణయించుకున్నాడట. సాధ్యమైంతవరకూ, బీదలకు ఉచితంగా వైద్యం చేసేందుకే తన నర్సింగ్ హోమ్ ఉపకరించాలని అతగాడి ఉద్దేశ్యం. అదే అతగాడి ధ్యేయం కూడా! మద్రాసులోని మన రెండు బంగళాలలో ఒకటి బాడుగకివ్వమని అడగటానికి వచ్చాడు."

కారు బంగళా గేటుదగ్గరకు వచ్చింది. నౌకరు గేటు తలుపులు తీశాడు.

"ఇస్తానన్నావా?" అని అడిగింది కల్యాణి.

కారుతాళాలు తీసుకుని కల్యాణిని అనుసరిస్తూ మెల్లిగా నవ్వాడు రమేష్. "అంత కంగారు పడ్తావేం కల్యాణీ? నీకూ, ఉపేంద్రకూ వివాహంతోబాటు, ఆ రెండు బంగళాలూ, నాన్నగారి అభిమతం ప్రకారం, వరుడికి కానుకగా ఇవ్వాలిగా మరి?"

మేడమెట్ల దగ్గరికి వచ్చిన కల్యాణి "షాక్" తిన్నట్లయింది. రమేష్ అన్న య్యేమన్నాడు? తనకూ ఉపేంద్రకూ పెళ్ళా? ఎవర్నడిగి చేశా డీనిర్ణయం? మేడమెట్లు ఎక్కుతూంటే ఆమె కాళ్లు తడబడిపోయాయి. అప్పటికప్పుడే రమేష్ డ్రెస్ విప్పి పడుకోబోతున్నాడు. చేసేదిలేక పక్కమీద పడుకున్న కల్యాణిని నిద్రాదేవి కసిరికొట్టింది.

ఉపేంద్ర మంచివాడూ, తెలివైన వాడూ కావచ్చు. అన్నయ్యకు ప్రాణస్నేహితుడే కావచ్చు. అతగాడిక్కావల్సిన ఆర్థిక సాయం చేయవచ్చు....కాని ఏకంగా తన నిచ్చి వివాహం చేసెయ్యటమే? తన సౌందర్యము, ఐశ్వర్యము ఎక్కడ! అతగాడూ, అతగాడి అందమూ ఏమిటి! మనసు మంచిదయినంతమాత్రాన సరిపోదు. మనిషికి బాహ్యమైన రూపసంపద కూడా ప్రధానమే. శరీరచ్ఛాయ చెప్పుకోదగ్గదిగా

లేదు....పదిమందిలో చలాకీగా తిరగ గలిగే లక్షణాలు కూడా కనిపించలే దతగాడిలో. విదేశాలకు వెళ్ళొచ్చాడని పేరేగానీ, ఆ ఠీవి, ఆ దర్పం, అంజనంవేసి చూసినా కన్పించలే దతగాడిలో.

బహుశా ఆదోరకమైన మానసిక బలహీనత అయ్యుండవచ్చు. పేద కుటుంబంలో పుట్టడమూ, బీదరికంలో పెరగటమూవల్ల ఉపేం ద్రలో నాగరికతా లక్షణాలయిన దర్జా, దర్పం లోపించాయి. అలాటి ఉపేంద్రలో రమేష్ అన్నయ్య కేం ప్రత్యేకత కనిపించిందో? తన లాటి విద్యావతి, సౌందర్యవతి వివేకవతి, ఉపేంద్రలాటి అనాకారి, అనాగరికునికి భార్యా?

ఇప్పుడే రమేష్ అన్నయ్యకు తన మనసులోనిమాట చెప్పాలి....

ఏదో నిర్ణయానికి వచ్చి గబుక్కున లేచింది కల్యాణి. కాని అంతలోనే, షుమారు నెలరోజుల క్రితం జరిగిన ఓ చిన్న సంఘటన గుర్తుకొచ్చింది.

"కల్యాణీ! ఓ మాటడగనా?"

జడల్లుకుంటున్న కల్యాణిదగ్గరగా వచ్చి కూర్చున్నాడు రమేష్.

"ఎం. ఏ. చదువుతానన్నావ్! చదివించాను.........నాట్యం నేర్చుకుంటానన్నావ్! నేర్పించాను! ఏది కోరితే అది ఇస్తున్నాను. మరి నీకు తగిన వరుణ్ణి నిర్ణయించటంలో కూడా కొంత స్వతంత్రం ఇస్తావా?"

అలా సూటిగా అన్నయ్య అడగటంతో క్షణకాలం దిమ్మెర పోయింది కల్యాణి. మరునిముషంలో తేలిగ్గా నవ్వేసింది.

"ఏమిటన్నయ్యా ఆ మాటలు?" అంది.

"రమేష్ గంభీరంగా మారాడు.... తమాషా కీ మాటలు నేననటంలేదు కల్యాణీ! నిజంగానే అంటున్నాను. నీకు యుక్తా యుక్త విచక్షణ జ్ఞానమూ, నీ స్వవిషయాలు స్వంతంగా ఆలోచించు కోగల వయసూ వున్నాయి. కాని...." రమేష్ ఆగాడు.

"మరి నీ కాసందేహం ఎందు కొచ్చిందన్నయ్యా?" అంది కల్యాణి కుతూహలంగా....

"ఇంత దాకా, నీకు ఏ విషయంలోనూ లోటురాకుండా, మరో లోకంలోవున్న మన అమ్మా, నాన్నా మనల్నిచూచి ఆనందించి. ర్వదించేట్టే చూసుకుంటూ వచ్చాను. కాని ఈనాడు....నువ్వు మరో ఇంటి కోడలిగా తరలి పోవాల్సిన సమయం రాబోతోంది! ఇన్నాళ్లూ నీ విషయంలో నేను చూపిన శ్రద్ధానక్తులు వేరు-ఇప్పుడు నీ వివాహ విషయంలో నేను తీసుకోవాల్సిన జాగ్రత్తలూ, బాధ్యతలూ వేరు!"

"నీక్కాబోయే భర్తకు నిన్నొప్పగించటంతో నా బాధ్యత తీరిందని చేతులు దులుపుకోవటం నా వల్లకాదు! అతగాడు నిన్ను పువ్వుల్లోపెట్టి పూజించాలి....నీ హృదయంలో, నీ ఇంట్లో, నీ వైవాహిక జీవితంలో, నవ్వుల పువ్వులే నిండి వుండాలి. ఆనాడే నాకు నిజమైన తృప్తి! ఆనాడే నాకు నిజమైన శాంతి! ఆనాడే, నాన్నగారు చనిపోతూ ఈ అపార సంపదతోబాటు నాకప్పగించిన నీపట్ల బాధ్యత నేను సక్రమంగా నిర్వర్తించగలిగానని తేలిగ్గా గాలిపీల్చుకోగలను!"

కల్యాణి పలకలేదు. రమేష్ హృదయ గత భావాలు తెలుసుకుని అతగాడికి తనమీదున్న వాత్సల్యానికి ఆమె హృదయం పొంగిపోతోంది.

"లక్షలకొద్దీ డబ్బున్న వరులెందరో వున్నారు. వారిలో ఎవరేనా సరే, 'ఊఁ' అంటే, మారుమాట లేకుండా, నిన్ను వివాహమాడతాడు....

కాని లక్షలకొద్దీ డబ్బుతోబాటు, కోట్లకు మించిన అహంభావం, అవలక్షణాలూ, దుర్వ్యసనాలూ కూడా దారిలో చాలా మందికి వారసత్వంగా వచ్చివుంటాయి! అలాటి వారిలో ఏ ఒక్కడికి నిన్నిచ్చినా....బహుశా కలిమికి లోటుండక పోవచ్చుగాని...జీవితానికి పట్టుగొమ్మవంటి అనురాగపు కలిమికి మాత్రం నువ్వు దూరమైపోతావేమోఅని నా భయం!

"అందుకే డబ్బుతో గుణగణాల్ని కొలవలేం. డబ్బులేకున్నా, చదువూ, సంస్కారమూ, మానవత్వమూ, మమకారమూ సమ

పాళ్ళలోవున్న వరుడే నీకు భర్తగా రావాలని నా అభిమతం....

"ధనం దేవిటి కల్యాణీ? ఈ రోజు వస్తుంది రేపు పోతుంది కాని గుణహీనుడైన ధనవంతుడికంటే, ధనహీనుడైన గుణవంతుడు కోటి రెట్లు మేలు."

రమేష్ చెప్పటం ఆపి, చెల్లెలి వేపు చూశాడు.

"అన్నయ్యా! నాకింతగా చెప్పాలా?" అని కల్యాణి సంతృప్తిగా నవ్వింది. "నాకు నీకంటే ఆత్మీయులెవరున్నారు? నా శ్రేయస్సు నాకంటే, బహుశా నీకే బాగా తెలుసునేమో! నీకు మనస్ఫూర్తిగా నచ్చిన యువకుడే నాకు భర్త....సరా?" అంది రమేష్ రెండు చేతులూ పట్టుకుని.

"నిజమేనా?"

సాయం సమయపు సూర్యకిరణాలు పడి పసిడివన్నె మరింత మెరసిపోతున్న ఆలయకలశాల వేపు వేలెట్టి చూపుతూ అంది కల్యాణి. "ముమ్మాటికీ నిజం! ఆ దేవుని సాక్షిగా చెబుతున్నాను.... నువ్వు ఎవరిని భర్తగా నిర్ణయిస్తే, అతగాడే నా భర్త! ఈ విషయంలో, అన్నివిషయాలలోలానే, నీకు సంపూర్ణ స్వేచ్ఛాస్వతంత్రాలున్నాయన్నయ్యా!"

"బంగారు తల్లీ! నీకు అన్యాయం చేస్తానా నేను మాత్రం?"

ఇద్దరూ చేతులు జోడించి క్షణకాలం ఆలయంవేపు చూశారు!

తలుపు తోసిన చప్పుడు కావటంతో, గత సంఘటన తాలూకు ఆలోచననుంచి తేరుకుంది కల్యాణి. ఆనాటి తన వాగ్దానం ఆమె కాళ్ళకు బంధమై చుట్టుకుంది.

"అరె! ఇంకా నిద్రపోలేదూ కల్యాణీ? నాకూ నిద్ర పట్టలేనిదేమిటో?" అంటూనే వచ్చి, కల్యాణి క్కాస్త దూరంలో సోఫాలో కూర్చున్నాడు రమేష్.

"లేదన్నయ్యా!" ఆపైన మాటలు రాలేదు. గొంతు మూగవోయినట్టయింది.

"నీ వివాహం గురించే ఆలోచిస్తుంటే నిద్ర కాస్తా ఇట్టే

ఎగిరిపోయింది కల్యాణీ! అధునాతనంగా, అద్భుతంగా చెయ్యాలి నీ పెళ్ళి! శుభలేఖలుకూడా పెద్దవిగా. అందంగా, బంగారు రంగు అక్షరాలతో అచ్చు వేయించాలి, పట్నంలోని ప్రముఖులందరికీ డిన్నర్ ఎలాగూ వుంటుందనుకో. పూర్ ఫీడింగ్‌కూడా....అదే పేదలందరికి అన్నమూ,బట్టలూకూడా దానంచెయ్యాలనుకుంటున్నా!''

ఉత్సాహంగా అంటున్న రమేష్ కళ్ళు అరమోడ్పులయ్యాయి. ఏదో చెప్పబోయిన కల్యాణికి మాటలు పైకిరాలేదు.

''నేనుకోరుకున్న లక్షణాలన్నీ ఉపేంద్రలోవున్నాయి కల్యాణీ! అంచేత అతగాణ్ణి నీకు వరునిగా నిర్ణయం చేశాను....నువ్వు నా మాటకు ఎదురుచెప్పవనే భరోసా నాకుంది! ముందస్తిగా ఉపేంద్రతో, ఈరోజు సాయంత్రం అన్నాను. 'మా కల్యాణిని వివాహం చేసుకో ఉపేంద్రా! నీ కా బంగళా నేను బాడుగకు ఇవ్వబోవటంలేదు. ఆ బంగళా, మరో బంగళా. ఓ కారు. ఫర్నిచరూ కానుకలుగా ఇవ్వా లనుకుంటున్నాను' అని.''

ఉపేంద్ర క్షణకాలం నావేపు అయోమయంగా చూశాడు. తర్వాత మెల్లని స్వరంతో 'నాతో పరిహాసాలాడుతున్నావా రమేష్?' అన్నాడు.

నేనతగాడి భుజాల చుట్టూరా చేతులువేసి నవ్వాను. 'హాస్యా లాడే సమయం ఇంకా ముందుంది. కాని ఇది మాత్రం పరిహాసంగా నేననటంలేదు మనస్ఫూర్తిగానే అంటున్నాను' అన్నాను.

ఉపేంద్ర ఐదారు నిముషాలు ఆలోచించాడు. తర్వాత మెల్లిగా అన్నాడు. 'రమేష్! నీకు నామీద మితిమీరిన ప్రేమాభిమానా లున్నాయనటానికి ఇంతకంటే నిదర్శన మింకేం కావాలి? కాని? ....'' ఏమిటి? అనడిగాను. '....నేను చిన్న తనంనుంచీ దరిద్రంలో పుట్టాను. పేదవాడిగా పెరిగాను....కాని మీ రలా కాదు. కలిమిలో పుట్టి కలిమిలో పెరిగారు! నా అంతస్తుకూ, మీ అంతస్తుకూ ఎంత తేడా వుందో నే వేరుగా చెప్పనక్కర్లేదు....' అన్నాడు.

''ఓహ్! ఈ అంతస్తులూ....అంతరాలూ మన స్వంత కల్పి

తాలు ఉపేంద్రా! మనిషికి విలువనిచ్చేది సంస్కారం, సుగుణం, చదువూ, అతగాడి ప్రవర్తనేగాని....అంతస్తులుకాదు! ఇంతకూ మా కల్యాణిని చూశావుగా? మరి దానిని వివాహం చేసుకోవడం నీకిష్టమా, కాదా?'' అంటే—''నిజం చెప్పాలంటే, మీకల్యాణిలాటి అతిలోక సౌందర్యవతీ, అగర్భ శ్రీమంతురాలూ భార్యగా రావటం, నా పూర్వజన్మ పుణ్యఫలమనే భావిస్తున్నాను రమేష్! కాని, నేను ఆవిడ అందానికి తగనేమో అనిపిస్తోంది....'' అని సందేహించాడు.

నాకు ఫక్కున నవ్వొచ్చింది ఆ మాటలు వినేసరికి.... 'చక్కటి ఆరోగ్యవంతమైన శరీరమూ, సంస్కార పూరితమైన హృదయమే పురుషునికి అందాన్ని ఇస్తాయి. నీలో ఆ రెండూ వున్నాయి....అదీగాక నువ్వు....ఏమీ అనాకారివికావు ఉపేంద్రా. ఇక మాట్లాడకు అంటూ కోప్పడ్డాను....'అయినా కల్యాణి ఇష్టం కూడా కనుక్కో రమేష్!' అన్నాడు మళ్ళీ!

''నాకు నవ్వొచ్చింది, నా చెల్లాయి నా మాట వినదా? నే నామెకు అన్యాయం చేస్తానని భావిస్తుందా? ఏమిటి ఉపేంద్రా నీ పిచ్చితనం? నే నీక్షణంలో 'కల్యాణీ! ఆ కొయ్య దుంగచేత తాళి కట్టించుకో' అంటాననుకో! మారు మాట్లాడకుండా ఆదుంగనే భర్తగా భావించుకుంటుంది. కల్యాణికి నామీదున్న గౌరవం, నా మాటమీదున్న గురి అలాటివి అన్నాను. ఇక ఏమీ వాదించక అంగీకరించాడు ఉపేంద్ర.

రమేష్ అలా ధారాళంగా చెప్పుకుపోతుంటే ఆమె కంఠానికి, శరీరానికి, ఏవో గొలుసులు బిగిస్తున్నట్టుగా అయింది!

ఇక ఇంతదూరం వచ్చాక తనేం చెబుతుంది? కాని, కాస్సే పాగి, ఎలాగో గొంతు పెకిలించుకుంది కల్యాణి. ''అన్నయ్యా! అత గాడికి రెండు బంగళాలు మనం కానుకగా ఇచ్చినంతమాత్రాన, మన స్థాయికి అతగాడు వస్తాడంటావా?''

రమేష్ పెద్దగా నవ్వాడు. ''అదా నీ సందేహం? పిచ్చితల్లీ! తన భర్త తన పుట్టింటివారితో సమానమైన తాహతు కలిగి వుండక

పోతే, అతగాణ్ణి తన పుట్టింటివా రెక్కడ చులకన చేస్తారో అనే భయమూ, సందేహమూ ప్రతి స్త్రీకి సహజంగానే వుంటాయి! నీ సుఖమూ, నీ శాంతీ, నీ శ్రేయస్సూకంటే నా కేంకేం కావాలి? నువ్వు అతగాడి సహచరిగా మారిన క్షణంలోనే అతగాడు లక్ష్మీ వరప్రసాదుడుగా మారిపోడూ? మనకున్న రెండు పొగాకు కంపెనీలలో ఉపేంద్రకు ఒక కంపెనీ సర్వహక్కులతో ఇచ్చేస్తాను! మిగతా నా వ్యాపారాలలోకూడా అతగాడికి సగం వాటాలు ఇస్తాను. సరా?"

కల్యాణి మాట్లాడలేదు.

"అన్నట్టు....ఫ్రెండ్సందరి పేర్లూ,అడ్రసులూ లిస్టు తయారు చెయ్యి కల్యాణీ....వారం రోజుల్లో శుభలేఖలు అచ్చోయిస్తున్నాను. ఏర్పాట్లలో నీకేదేనా కొత్త ఊహలుంటే చెప్పు....నిస్సంకోచంగా చెప్పమ్మా! మార్పులు చేస్తానుకూడా....!"

ఆనందసాగరంలో తూలుతూ, జరగబోయే ఏర్పాట్లను గురించి ఊహించుకుంటూ, మైకంలో పడిన మనిషిలా నడిచి పోయాడు రమేష్.

మనస్సు నెంతగా జోకొట్టినా, అందంలో, ఐశ్వర్యంలో-ఏ విషయంలోనూ తనకు భర్తగా ఉపేంద్ర తగడనే భావం ఏ మూల నుంచో పొంచిపొంచి చూస్తోంది కల్యాణి హృదయంలో.

## 2

పెళ్లికూతురు కళ్యాణిని ముస్తాబుచేసి, మేడదిగి వెళ్ళిపోయారు ముత్తయిదువులు. కొత్తగా ఈరోజు సనాతనమైన నగలతో అలంకరించిన తన అలంకరణా, ఆ అలంకరణలో తనూ ఎలా వున్నారో చూసుకోవాలన్న కాంక్షను ఇందాకటినుంచీ ఎలాగో అణిచి వుంచింది కల్యాణి. ముత్తయిదువు లలా వెళ్ళగానే, గబగబ డ్రెస్సింగ్ టేబిల్ముందుకు వచ్చి నిల్చుంది. నిలువుటద్దంలో తన

ప్రతిబింబాన్ని చూసుకుని క్షణకాలం అప్రతిభురాలై పోయింది కల్యాణి. తెల్లని నుదుటిమీద ఎర్రని తిలకంతో, అందంగా తీర్చి దిద్దిన కల్యాణపు బొట్టు వెలిగిపోతోంది. అసలే పెద్దవిగావుండే కళ్లు కాటుక దిద్దటంతో మరింత విశాలమై, ముఖమంతా నిండిన ట్లున్నాయి. సోగతేరిన చక్కటి ముక్కుకు రవ్వల ముక్కెర క్రొత్త అందాన్నిస్తోంది. చెవులకుపెట్టిన కెంపుల దుద్దులు చెక్కిళ్ళ ఎరుపు దనాన్ని వెక్కిరిస్తున్నాయి. నల్లకోడెత్రాచులా వున్న నిడుపాటి జడ మీద కుట్టిన మల్లెలు నీలాకాశంలోని తారకల్లా వున్నాయి!

కన్ను, ముక్కు తీరుగావుంటే, కొందరు విపరీతమైన పొట్టి గానో, భరించలేనంత లావుగానో, అదీ ఇదీ కాకుంటే, గాలి కెగిరి పోయే గడ్డిపోచల్లా మరీ సన్నగానో వుండటంతో, వారి అందం గణనకురాదు! పొట్టీ, పొడుగూ సరిపోతే ముక్కూ ముఖమూ తీయగా వుండవు....కాని ఇలా తనలా సహజసౌందర్యమూ, తెల్లని శరీరచ్ఛాయా, సరియైన పొడవూ, లావూ, అన్నీ అతికినట్లు వుండవు సాధారణంగా స్త్రీలలో! అటు అధునాతనమైన అలంకరణలో తను అపర రతీదేవిలా వుంటుంది. ఏ అలంకరణలోనైనా, ఎలాటి వస్త్ర ధారణలోనయినా, వెయ్యిమంది స్త్రీలలో తనను నిలబెట్టినా, తన అందం ప్రత్యేకమైందిగా గుర్తింపబడి తీరుతుంది!

సౌందర్యాతిశయంతో వీగిపోతున్న కల్యాణి శరీరం పులక రించిపోయిం దా క్షణంలో.

"ఇంకా ఎంతసే పలా అద్దం బద్దలయ్యేలా చూసుకుంటావే కల్యాణీ నీ అందాన్ని? నిజానికి 'మిస్ వరల్డ్'గా బిరుదు తెచ్చుకో వాల్సినదానివి....పదపద. ముహూర్తానికి వేళయిందట. నిన్ను పిల్చుకురమ్మని పురోహితులు నన్ను పంపారు."

విమల పెద్దగా నవ్వుతూ కల్యాణిదగ్గరసా వచ్చింది. సిగ్గుతో మొగ్గయిపోయింది కల్యాణి.మంగళ వాయిద్యాలు శ్రవణానందకరంగా వినిపిస్తున్నాయి. పెళ్లిపెద్దగా రమేష్‌కు క్షణంతీరటంలేదు. స్నేహితుల్నీ, ఆహూతుల్నీ ఆహ్వానించటంతో అతగాడికి ఊపిరి సలపటంలేదు.

వేదోక్తమైన మంత్రఘోషతో పెళ్ళిపందిరి ప్రతిధ్వనిస్తోంది. పవిత్రమైన అగ్నిహోత్రంముందు, అశేష ప్రేక్షక జనసందోహం మ్రోల, శ్రీ వేంకటేశ్వరుని సన్నిధానంలో కల్యాణిమెడలో, ఉపేంద్ర హస్తాలతో మంగళసూత్రధారణ జరిగింది. పూలవానలా అక్షతలు వధూవరులపై కురిశాయి.

"భగవాన్! శ్రీ వేంకటేశ్వరా! మా కల్యాణి వైవాహిక జీవితం ఆనందంగా, హాయిగా, సుఖశాంతులతో సాగేట్లు చూడు తండ్రీ....!" ఏడుకొండలవాడికి మనసులోనే అంజలి ఘటించాడు రమేష్.

సాయంత్రం బంధువులూ, స్నేహితుల కోరికపై. కల్యాణి నాట్య ప్రదర్శన ఏర్పాటుచేశాడు రమేష్. మనోహరంగా నాట్యం చేసింది కల్యాణి. అభినందనలూ, ప్రశంసలూ అశేషంగా కురిశాయి! కల్యాణి నాట్య ప్రదర్శన జరుగుతున్నంతసేపూ, ఉపేంద్ర మాత్రం ముభావంగా కూర్చుని వుండటం. ఆ హడావిడిలో రమేష్ గాని, మరెవరుగాని గుర్తించలేకపోయారు.

పాలనురుగులాటి తెల్లని జార్జెట్ చీరె, ఎర్రని జరీ అంచు వున్న తెల్లని పట్టు జాకెట్టులో కల్యాణి, ఉషఃకాంతిలో అరవిరిసిన తెల్ల తామర పువ్వులావుంది. ఫ్లవర్ వాజ్‌లో అమర్చివున్న గులాబీల పరిమళం మందమందంగా గదంతా అలము కొంటోంది! పందిరి మంచం చుట్టూరా వ్రేళ్లాడుతున్న మల్లెల మాలల సౌరభం హృదయాలను మత్తెక్కించేలా వుంది. గదివరకూ కల్యాణిని వెంటబెట్టుకు వచ్చిన ముత్తయిదువలంతా ఇక "మాకేం సంబంధం లేదమ్మాయ్!" అంటూ నవ్వుతూ, క్రిందకుదిగి వెళ్ళిపోయారు. ఏదో ఒంటరి తనం ఒక్కసారిగా ఆవహించినట్లయింది కల్యాణిలో. ఎంత చదువుకున్నా, ఎంతగా నలుగురిలో తిరగనేర్చినా, స్త్రీలో, అంతర్గతంగా సిగ్గూ, అణకువా, భయమూ, ఓ విధమైన సంకోచమూ నిండే వుంటాయనిపించిం దా క్షణంలో కల్యాణికి.

ముందుకు వేసింది కల్యాణి....కాని ఆమె పాదాలు తడబాటుతో గది గుమ్మంలోనే ఆగిపోయాయి.

"అలా నిలబడి పోయావేం కల్యాణీ? రా". మృదువుగా ఆహ్వానిస్తూ. దగ్గిరసా వచ్చాడు ఉపేంద్ర!

"ఆరో జంత హుషారుగా నాతో మాట్లాడినదానివి....ఈరో జిలా సిగ్గుపడి పోతున్నావేం!" లాలనగా ఆమె చుట్టూరా చేతులు వేస్తూ అన్నాడు ఉపేంద్ర.

ఆ అనుభవం కొత్తది....తీయనిది, మనోభావాలను మాట లలో వ్యక్తం చెయ్యనివ్వలేని, మూగ, మధురానుభూతి ఏదో కల్యాణిలో అలుముకుంది.

"ఇంతటి అందాన్నీ నాకు ఒక్కసారిగా ఇచ్చినందుకు దేవుడి కంటే, ముందస్తిగా రమేష్‌కు కృతజ్ఞతలు చెప్పుకోవాలి నేను!"

సోఫాలో కల్యాణిని కూర్చోబెట్టి పక్కనే కూర్చుంటూ అన్నాడు ఉపేంద్ర. అగరవత్తులనుండి వస్తున్న సన్నని పరిమళ భరితమైన పొగ గాలిలో తమాషాగా లీనమై పోతోంది.

"కల్యాణీ! ఈ క్షణంనుంచీ మనిద్దరం కొత్త జీవితంలో అడుగెట్టబోతున్నాం...."

కొద్దికొద్దిగా సిగ్గు తెరలను తొలగించుకుంటున్న కల్యాణి, చిరునవ్వుతో కళ్ళెత్తి ఉపేంద్ర వేపు చూపింది.

"....ఇన్నాళ్ళూ ఎవరికి వాళ్ళగావున్న మనిద్దరం ఇక ఒకే పడవలో సుదూరతీరాలకు ప్రయాణం సాగించబోతున్నాం! ముందస్తిగా మనిద్దరం ఒకరినొకరు అర్థం చేసుకోవటం మంచిది కదూ? ఫస్ట్ యింప్రెషన్ ఈజ్ ది బెస్ట్ అంటారు పెద్దలు. అవునా?"

సౌమ్యంగా మెల్లని స్వరంతో ఉపేంద్ర అలా చెబుతుంటే, వింటున్న కల్యాణిలో కొత్త ఆనందం రేగింది. బొత్తిగా తను ఊహించినంతటి అమాయకుడేం కాదు ఉపేంద్ర! ఎక్కువగా మాట్లాడకపోయినా, బలమైన ఆలోచనలున్న వ్యక్తి అతగాడు అనిపించిందా క్షణంలో!

"నేను చాలా పేదరికంలోంచి పైకివచ్చాను.......బహుశా ఈనాడుకూడా మీ అంతస్తుకూ, ఐశ్వర్యానికీ తగినవాణ్ణి కానేమో,.."

ఏదో చెప్పబోతున్న అతగాడి నోరు సుతారంగా, తన సున్నితమైన చేతివ్రేళ్ళతో మూసేసింది కల్యాణి...." అలా అంటే నేనొప్పుకోను!" అంది.

కల్యాణిచేయి తనచేతిలోకి తీసుకుంటూ నవ్వాడు ఉపేంద్ర. "నువ్వేకాదు, ఏ స్త్రీకూడా తన భర్త మనసులో అలాటి భావన కలగడానికి అవకాశం యివ్వదు....సర్లే. యిప్పుడు నీ మూలంగా బోలెడంత ధనవంతుణ్ణయ్యాననుకో! నేను ఎంత చదువుకున్నా, విదేశాలకు వెళ్ళొచ్చినా, మన భారతీయ సంస్కృతి, సంప్రదాయాలను మాత్రం విస్మరించలేను! ముఖ్యంగా మనదేశ స్త్రీలన్నా, మన స్త్రీల ఆచార వ్యవహారాలన్నా నాకెంతో గౌరవం! వాటిని గురించి నాకు కొన్ని ప్రత్యేకమైన అభిప్రాయాలూ, అభిరుచులూ వున్నాయి కల్యాణీ! కాని అవి నీకు నచ్చుతాయో లేదో అని నా సందేహం!"

లేతగులాబి రేకుల్లాటి చిన్ని పెదవులు విడీవిడకుండా, చిరునవ్వునవ్వింది కల్యాణి. "నచ్చటం నచ్చకపోవటమనేది వారివారి స్వభావాలమీద ఆధారపడి వుంటుంది....కాని మనం ఎవరికివారు మన అభిప్రాయాలని వ్యక్తం చేసుకోవటంలో తప్పులేదుగా?"

"నేను విదేశాలలో వుండగా, నాతోబాటు వచ్చిన భారతీయ మిత్రులు చెబుతూండేవారు తరచూ—ఉపేంద్రా! ఇక్కడే ఎవరినేనా వివాహం చేసుకుందాం. ఇక్కడే స్థిరపడిపోదాం. ఈనాగరికత మన దేశంలో ఎక్కడుందోయ్!—అంటూ!

"కొద్దికాలంలో వారిలో పాశ్చాత్య నాగరికతా వ్యామోహం ఎంతగా వేళ్ల పాతుకుపోయిందో....నా కాశ్చర్యం కలిగించేది.

"ఆ స్త్రీ పురుషులకు వారి పద్ధతులూ, ఆచార వ్యవహారాలూ సహజంగానూ, గొప్పగానూ వుండివుండొచ్చు. కాని స్వచ్ఛమైన భారతీయు డెవరూ ఆ పద్ధతులను హర్షించడు........హర్షించలేడు కూడాను.

"చాలీచాలని గౌన్లు వేసుకొని, శరీరాన్ని ప్రదర్శిస్తూ, మగవారితో పూసుకొని తిరగటంలో వారికివారే సాటి కల్యాణీ! కాని, అలా వారిని తరచూ, తప్పనిసరిగా చూస్తూండటంతో, సహజంగా స్త్రీలపై వుండే గౌరవభావం కూడా అడుగంటి పోయేది నా మటుకు నాకు. మళ్ళీ మనదేశంలో అడుగెట్టిననాడు, నేను శ్వాస హాయిగా పీల్చుకున్నా ననిపించింది."

ఉపేంద్ర క్షణకాలం ఆగాడు.

"కాని శోచనీయమైన సంగతేమిటంటే, మన దేశస్థులు విదేశీయులను అనుసరించటమే తమ జీవితపరమావధిగా భావిస్తున్నారు కల్యాణీ! తమ అర్థంలేని అలంకరణలతో, వేషభాషలతో, మన స్త్రీలలో కొందరు, మన దేశీయ సభ్యతా సాంప్రదాయాల్ని మన్నులో కలిపివేస్తున్నారు.

"నిజానికి స్త్రీ సాంప్రదాయసిద్ధమైన వేషభాషలతో, గృహకృత్యాలను నిర్వహించుకుంటూ, భర్త చాటు భార్యగా వుండటమే గౌరవ ప్రదమైంది కల్యాణీ! అంతేగాని, కేవలం ఓ ఆకర్షణ యంత్రంగా తయారై పెదవికి మించిన పల్లులా బయటపడటం బాగుండదు."

కల్యాణి విస్మయంగా భర్తకేసి చూసింది. "మీ ఉద్దేశ్యంలో స్త్రీలకు ఘోషా పద్ధతే మేలంటారా?" అంది మెల్లిగా కుతూహలంగా.

"అలా అనటంలేదు కల్యాణీ! పేరుకు ఘోషా అంటూ యేర్పాటుచెయ్యగానే, అనవసరంగా స్త్రీలోని పైశాచిక శక్తుల్ని మేల్కొల్పటమే అవుతుంది."

"మరి?"

"విదేశాలలో స్త్రీలు విచ్చలవిడిగా తిరుగుతారు....కాని అది వారికి ఎబ్బెట్టుగా తోచదు....కారణం-వారి సాంప్రదాయం, సాంఘికాచారాలూ అందుకు సుముఖంగా వుంటాయి. కాని మనదేశ సంస్కృతీ సాంప్రదాయాలు వేరు కల్యాణీ! అలా విచ్చలవిడిగా తిరిగే స్త్రీ తీవ్ర విమర్శకు గురౌతుంటుంది. ఒక్కోసారి స్వర్గతుల్యమైన తన సంసారానిక్కూడా దూరమై పోతుంటుంది...."

కల్యాణి మౌనంగా వుండిపోయింది.

"అందాకా ఎందుకూ? మా పురుషజాతినే తీసుకో. తమతో బాటు చనువుగా మెలిగేస్త్రీని పైపైకి పెదవులతో మెచ్చుకుంటారు. కాని ఆవిడ కాస్త కనుమరుగైతే, నిర్లక్ష్యంగా విమర్శించి, హేళన చేసి, చులకనగా మాట్లాడతారు. అలా ప్రవర్తించేవారిలో, ఏ ఒక్కరికీ, ఆమె తమ తోబుట్టువులాటిదనే భావన కలలో కూడా మెదలదు. అరె! ఏమి టలా వున్నావే?" పాలిపోయినట్లున్న కల్యాణి ముఖం కేసి ఆదుర్దాగా చూస్తూ అన్నాడు ఉపేంద్ర.

"ఏమీలేదే! మీరు చెప్పేది వింటున్నానంతే." పొడిగా అంది కల్యాణి. ఆమె హృదయాన్నెవరో బలంగా నొక్కేస్తున్నట్లయింది.

"మరొక్కమాట! ఏమీ అనుకోవుగదూ?"

"చెప్పండి."

"సాయంత్రం నీ నాట్యం...."

"ఏం, బాగాలేదా?" ఆదుర్దాగా అడిగింది కల్యాణి.

"అద్భుతంగా వుంది....కాని ఆ సమయంలో నే నొక్కడినే ప్రేక్షకుణ్ణి అయివుంటే, ఎంతగానో ఆనందించివుండేవాణ్ణి!"

తలమీద పిడుగుపడ్డట్లయింది కల్యాణికి.

"ఇక మీదెప్పుడూ, అలా పదిమందిలో నాట్య ప్రదర్శనలివ్వకు కల్యాణీ! ప్లీజ్!"

ఉపేంద్ర కంఠస్వరంలో ఏదో అధికారం నిండివున్నట్టు తోచింది కల్యాణికి.

కల్యాణి ఏమీ మాట్లాడలేదు. ఆమె మనస్సు పెనుతుపానులో కల్లోలితమైన సాగరంలావుంది. ఉపేంద్ర హృదయంలో ఇంత పురాతనభావాలు గూడుకట్టుకుని వున్నాయా?

"ఎంతకూ నేను మాట్లాడటమే తప్ప నువ్వసలు మాట్లాడటం లేదేం కల్యాణీ? నీకూ ఏ అభిరుచులున్నాయో, ఏ అభిప్రాయాలున్నాయో సూటిగా చెప్పెయ్. నా పద్ధతులూ నీ అభిప్రాయాల కనుగుణంగా మార్చుకోవటానికి ప్రయత్నిస్తాను...."

ఇద్దరూ తేలిగ్గా నవ్వుకున్నారు. ట్రెయిన్ కదలడానికి సిగ్నల్ ఇచ్చారు.

"ఫర్నిచరూ, కారూ గూడ్సులో పంపేశాను. జాగ్రత్త కల్యాణీ ....ఉపేంద్రా!"

చెయ్యి వూపుతున్న రమేష్ కనుమరుగై పోయేంతవరకూ చూస్తుండిపోయారు కల్యాణీ ఉపేంద్రలు. కళ్ళనీళ్ళతో, బెరుకుగా కూర్చునివున్న కల్యాణిని లాలనగా దగ్గరకు తీసుకున్నాడు ఉపేంద్ర.

* * *

సామానంతా జాగ్రత్తగా, శుభ్రంగా, అందంగా సర్దించే సరికి రెండు రోజులు పట్టింది కల్యాణికి. నౌకరు వెంకన్నా, పని మనిషి మంగమ్మా యజమానురాలి మెప్పు పొందటానికి శాయశక్తులా ప్రయత్నిస్తున్నారు. ఒకసారి వెళ్ళి హాస్పిటల్ పెట్టబోయే బంగళా చూసివచ్చారు కల్యాణీ ఉపేంద్రలు. ఇద్దరు క్వాలిఫైడ్ నర్సులను నియమించాడు ఉపేంద్ర. ఉపేంద్రకు తెలిసిన డాక్టర్లూ, వారి హాస్పిటల్ స్టాఫ్ అంతా వచ్చి కల్యాణిని పరిచయం చేసుకు వెళ్ళారు. ప్రతిఒక్కరూ ఆమె అసమాన సౌందర్యాన్ని ఆశ్చర్యంగా చూశారు.

సిస్టర్ కమల పైకే అనేసింది."మా డాక్టరుగా రెంత అదృష్ట వంతులండీ! మీలాటి సౌందర్యరాశిని నే నెక్కడా చూళ్ళేదు. ముఖ ప్రీతి మాటలనుకోకం డివి. నిజంగానే చెబుతున్నాను. ఇంతక్రితం నే పనిచేసిన డాక్టరుగారి భార్య వుండేవారు....అయ్య బాబోయ్! తల్చుకుంటే రాత్రి కలలోకి వస్తుం దావిడ. ఇలా నే నన్నానని మరెవరితోనూ అనకండేం?"

కల్యాణి లోలోపల గర్వంతో పొంగిపోయింది.

బంగళాచుట్టూరా బాగుచేయించింది కల్యాణి. ముళ్ళచెట్లతో, గడ్డీ, చెత్తాచెదారంతో నిండివున్న ప్రదేశమంతా అద్దంలా శుభ్రంగా వుందిప్పుడు. రకరకాల పూలమొక్కలూ, అన్నిరంగుల గులాబి మొక్కలూ, తెప్పించి నాటించింది. గేటులోంచి బంగళావరకూ వుండే మధ్యత్రోవ కిరువేపులా క్రోటన్సూ, గులాబీలూ నిటారుగా

నిల్చుని స్వాగతం చెబుతున్నట్లున్నా యిప్పుడు. బంగళాకు కుడి వేపున ఉన్న పెద్ద ఖాళీస్థలంలో వలయాకారంగా లాన్....చుట్టూరా తెల్లని ఇసుక....మరోవేపు, అందంగా గిరగిరతిరిగే ఫౌంటెన్, బంగళా ఎడమవేపు, కాస్తదూరంలో ద్రాక్ష, మల్లె, జాజి పందిళ్ళు ....పరిశుభ్రమైన ఖాళీస్థలం.

వంటమనిషికీ, పనివాళ్ళకూ పనులు పురమాయించటం, తోటలో కాసేపు తిరగటం, డిస్పెన్సరీ నుండి వచ్చిన ఉపేంద్రతో కబుర్లు-ఇలా సాగిపోతున్నాయి రోజులు కళ్యాణికి.

# 4

కిటికీలోంచి సన్నని వెన్నెల గదిలో పడుతోంది. గదంతా అగరువత్తుల పరిమళంతోనూ, సెంటు సువాసనలతోనూ నిండి వుంది. అలవాటుపడినవారికిగానీ విపరీతమైన ఆ పరిమళం భరింప శక్యంకాదు.

కుచ్చులు కుచ్చులుగా వున్న సింద్రిలా గౌనులో నైట్‌క్లబ్ డాన్సర్ లిల్లీ భువనమోహనంగా కనిపిస్తోంది.

"ఇంతటి మనోహరమైన సౌందర్యం నీలో ఎందుకు పెట్టాడో ఆ దేవుడు?" లిప్‌స్టిక్ పూసిన పెదాలు కొంటెగా, పంటితో నొక్కుకుంటూ అంది లిల్లీ.

"మీ బోటివాళ్ళ చుట్టూరా తిరగటానికి...." నవ్వుతూ ఆమె బాబ్‌డ్ హేర్‌ను అలవోకగా రేపి వదిలాడు మనోహర్.

"బావుంది. అందం వున్నంతమాత్రాన అందరూ మా చుట్టూరా తిరుగుతున్నారా?" చిరుకోపం అభినయిస్తూ, కాటుకపెట్టని కళ్ళను చికిలిస్తూ అంది లిల్లీ.

"అందరూ కాదనుకో! నాబోటి కొందరు!" సవరించాడు మనోహర్!

"చాల్లే మనోహర్! మహా కబుర్లు. మీ మగాళ్ళకసలు నిలకడంటూ వుండి ఏడ్చిందా ఏమిటి? ఒకరికంటే మరొకర్ని కాస్త కంటికి నదురుగా కన్పించారంటే చాలు....వాళ్ళవెంట వెళతారు: అవునా?" అతగాడి కళ్ళలోకి గోముగా చూస్తూ అంది లిల్లీ!

"అవును, నువ్వు చెప్పింది కరెక్టు! సుకుమారుండన్ని రుచులు చూడగవలెబో....తుమ్మెద మకరందమును గ్రోలినట్లు అన్నా డో కవి. ఆ కవి ఎవరైతే మనకేంగానీ, అతగాడు చెప్పినది అక్షరాలా పాటిస్తాను నేను!" నవ్వాడు మనోహర్.

"అంటే? నామీద నీ మోజు తీరాక, మరొకరిదగ్గరకు వెడతావు. అవునా?" రోషం నటిస్తూ అంది లిల్లీ.

"మీరుమాత్రం అంతేకదా లిల్లీ? మైడియర్ లిల్లీ! మీలాటి వాళ్ళ సంగతి నాకు తెలుసు. నా సంగతి మీకు తెలుసు. ఈ విషయంలో మనిద్దరికీ వాగ్వాదం ఎందుకూ?"

"పోనిద్దూ! లేనిపోని గొడవ! నా పిచ్చిగానీ, నామాట నువ్వు నమ్ముతున్నావా? నాకు నువ్వంటే ప్రాణమని ప్రమాణంచేసి చెప్పినా నువ్వు నమ్మవు! అవునా?"

"నేను నమ్మటం నమ్మకపోవటంతో పనేముంది లిల్లీ! నువ్వలాగే భావించుకో. నే కాదన్నానా?"

మనోహర్ మాటలకు అలక నటిస్తూ దూరంగా జరగబోయిన లిల్లీని గబుక్కున ఆపాడు మనోహర్.

"ఓహ్! ఇలాటి సమయాలలో గబుక్కున ఆపటానికి కనీసం పొడుగుపాటి జడైనా వుందికాదు నీకు. అయినా మీ ఆడవాళ్ళ అలక బ్రహ్మాస్త్రం! దీంతో ఎలాటి పనులేనా సాధిస్తారు."

"నీ దగ్గర మాత్రం నా అలకేమీ పనిచెయ్యదు." బుంగ మూతి పెట్టి అంది లిల్లీ.

"ఎందుకు పనిజెయ్యటంలే? అలిగేకాదూ మూడువందలు పైగా ఖరీదుచేసే లేడీస్‌వాచ్ కొనిపించుకున్నావు? అలిగేకాదూ ఐదు వందలు పైగా ఖరీదుచేసే లాకెట్‌చైన్ చేయించుకున్నావు? అలిగే

కొన్నా డజన్లకొద్దీ రకరకాల గౌన్లూ, ఖరీదైన చీరెలూ కొనిపించు కున్నావు? ఈసారీ ఏదో ప్లాన్ వేశావు. ఇదోలిల్లీ! ముందస్తిగానే చెబుతున్నాను....నా దగ్గర ఇప్పుడు చిల్లిగవ్వలేదు. డబ్బంతా వ్యాపారంలో రోల్ అవుతోంది. క్యాష్ చేతికొచ్చాకగానీ నీ కోరికల పూసెత్తకూ!"

"ఓహ్! ఎంత లెక్చరిచ్చారు? మీరిచ్చే వస్తువుల కోసం నేనేమీ పడిగాపులుపడి వుండటంలేదు లెండి...."

"అలా అన్నావ్ బావుంది, నేగాకుంటే నా తాత మరొక డిస్తాడు కదూ!"

ఏదో అనబోతున్న లిల్లీ నోరు తన పెదవులతో నొక్కేశాడు మనోహర్,

* * *

నీరవ నిశ్శబ్ద నిశీథ ఆకాశంలో మినుకుమినుకుమంటున్న తారకలు కొన్ని ఏ బలవత్తరశక్తి తాకిడికో తట్టుకోలేక, వేగంగా క్రిందకు రాలుతున్నాయి. భర్త రాకకోసం కనిపెట్టుకు కూర్చున్న సుశీల హృదయంలో వేయి తుఫానులు చెలరేగుతున్నాయి. ఏమి టీనిరీక్షణ? ఎంతకాల మీక్షోభ? అసలు దీని కో అంతమంటూ లేదా? తలుపుమీద మెల్లిగా చప్పుడవటంతో కళ్ళుతుడుచుకు లేచింది సుశీల. ఆమె కా సంకేతాని కర్థం తెలుసు. తల్లి సావిత్రమ్మకు వినిపిస్తే, ఆ అపరాత్రివేళ తిట్లదండకం మొదలెడుతుందనే భయంతో, మనోహర్ చాలా నెమ్మదిగా తలుపుమీద చప్పుడు చేస్తాడు,

తలుపు తియ్యగానే, గుప్పుమని వచ్చిన సెంటు పరిమళం, తలత్రిప్పివేసే వెగటు వాసనతో క్షణకాలం ఉక్కిరిబిక్కిరై పోయింది సుశీల. మరుక్షణం, భర్త ఎక్కణ్ణుంచి వస్తున్నాడో అవగాహనై పోయింది.

"భోంచేద్దురుగానీ రాండి!" షర్టు విప్పి, నిర్లక్ష్యంగా స్టాండుమీదకు విసిరివేసిన భర్తవేపు చూస్తూ అంది సుశీల.

"అఖ్ఖర్లేదు, చేసేవచ్చాను." తూలుతున్న శరీరాన్ని అదుపులో పెట్టుకుంటూ అన్నాడు మనోహర్.

"ఎక్కడ చేశారు? అన్నీ సిద్ధంగా వుంచాను పదండి!"

"ఎక్కడో ఓచోట! హోటల్లో! అన్నీ ఆరాలు కావాలేం? నిద్రవస్తోంది నాకు. నన్ను విసిగించక!" విసుగుగా తలుపులు వేసుకొని పందిరి మంచంమీద బోర్లా పడుకున్నాడు మనోహర్.

"అబ్బాయి వచ్చాడామ్మా సుశీలా?" తన గదికేసి వెళ్తున్న సుశీల అడుగుల చప్పుడు గ్రహించి, మెల్లిగా అడిగింది సావిత్రమ్మ.

"ఆ! వచ్చారత్తయ్యా?" నిర్లిప్తంగా జవాబిచ్చి, అడుగు ముందుకు వెయ్యబోయింది సుశీల.

"ఇప్పుడేనా రావటం? ఇంతదాకా ఎక్కడికి వెళ్లాడట?"

సావిత్రమ్మ తీక్షణంగా అడిగిన ప్రశ్నకు ఎందుకో అటుగా వచ్చిన మనోహర్ విసుగ్గా సమాధాన మిచ్చాడు. "సినిమాకు వెళ్ళొచ్చానమ్మా! ఏమిటి నీ గొడవ?"

అతగాడు విసురుగా గదిలోకి వెళ్ళిపోయాడు మళ్ళీ.

"సినిమా! నా పిండాకూడు! సుశీలనుకూడా వెంట తీసుకు వెళ్ళకూడదూ?" గొణుగుతూ, మరి చేసేదిలేక పడుకుంది సావిత్రమ్మ.

పడుకుందేగానీ నిద్రపట్టలేదు సుశీలకు. గతమంతా తెరలు తెరలుగా ఆమె హృదయ ఫలకంమీద పరుచుకొంటోంది!

కారులో వస్తూన్న మనోహర్, కాలేజినుంచి వస్తున్న సుశీలా ప్రతి రోజూ ఎదురవటం మామూలుగా జరుగుతూండేది రోజూ! ఆర డగులు పైగా పొడవూ, అంతకు తగిన లావుతో, ఆజానుబాహు వైన మనోహర్, నిజంగా కన్యల మనోహరుడే అనిపించేది సుశీలకు! సన్నగా తెల్లగా పొడవుగా వుండే సుశీల సన్నజాజి మొగ్గలా ఎంతో అందంగా కనుపించేది మనోహర్‌కు.

చూపులు దాటి మాటలు కలిశాయి ఇద్దరి మధ్యా.

మనోహర్‌కు ఎన్నోరకాల వ్యాపారాలున్నాయి. లక్షాధికారి? సావిత్రమ్మకు ఒక్కగా నొక్కకొడుకు.

తమ ఇద్దరి ప్రణయం శ్రుతిమించి రాగాన పడబోతున్నదని తెలుసుకున్న సుశీల, తనను త్వరగా వివాహమాడమని మనోహర్‌ను కోరింది.

అందుకు సమాధానంగా మనోహర్ వికటాట్టహాసం చేశాడు.

"మై డియర్ సుశీ! నీకింకా నా గురించి బాగా తెలియలేదు సుమా! ఒక్క పువ్వనే నియమం పెట్టుకుని తుమ్మెద బ్రతకగలదా? నేనూ అంతే! వివాహ మనే చట్రంలో నన్ను నేను బిగించుకొని నా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు చేజేతులా ధ్వంసం చేసుకోవటం నా కిష్టం లేదు సుమా!"

నిర్ఘాంతపోయింది సుశీల. తను సర్వస్వమని భావించిన మనోహర్ మరో రూపం ఇదా? ఇప్పుడు తనేం చెయ్యాలి? చిన్నతనం లోనే తలిదండ్రులు కరువైన తనని దూరపుబంధువులు చేరదీశారు. ఏదో, ఈ బి. ఏ. పూర్తిచేయించి తనని వదిలించుకుందామని చూస్తున్నారు. బి. ఏ. పరీక్షలు వ్రాసింది తను. కాని ఈనాడు ఇంతటి అగ్నిపరీక్ష ఎదురౌతుందని కలలోకూడా అనుకోలేదు. తనే బరువుగా భావిస్తున్న బంధువులు, తనిలా మనోహర్‌తో ప్రణయకలాపం సాగించిందనీ-పర్యవసానంగా తను గర్భం ధరించిందనీ తెలిస్తే, ఇక ఇంటిగడప తొక్కనిస్తారా? మనోహర్‌కూడా తనని నిరాకరిస్తున్నాడు. ఈనాడు తన దారేమిటి? ఆలోచించి ఆలోచించి....తీవ్ర నిర్ణయాని కొచ్చింది సుశీల. మర్నాడే సావిత్రమ్మగారిని కలుసుకుంది....తనని తను పరిచయం చేసుకుంది....

కన్నీళ్ళతో ఆవిడ కాళ్ళకు చుట్టుకుంది!

సావిత్రమ్మ గుణంగల ఇల్లాలు. తన కొడుకును గురించిన నిజాలు ఆమెకు తెలుసు. అంచేత ఆమె సుశీల మాటలు నమ్మింది. మనోహర్‌ను నిలవేసింది.

రూపంలో, గుణంలో, చదువూ-సంస్కారంలో అన్ని విషయాలలో అపరంజిలా వెలిగిపోతున్న సుశీల ఈ ఇంటి కోడలైతే, ఏనాటికైనా కొడుకు ప్రవర్తన ఓ దారికి రావచ్చని ఆశపడింది. అంచేతే బలవంతంగా మనోహర్‌ను ఒప్పించి, మెడలువంచి మరీ పెళ్ళి జరిపించింది.

ఆ ఇంటి గృహిణిగా అడుగెట్టిన సుశీల జీవితం ఆరునెలలు

[illegible] పువ్వుల్లో పెట్టి, తనను అపురూపంగా చూసుకొనే అత్తగారు, మన్మథసమాన రూపుడైన భర్త. ఇక ఇంతకంటే స్త్రీ కోరదగిందేముందీ?

కాని ఆ కమ్మనికలలాటి జీవితం అట్టేకాలం సాగలేదు సుశీలకు. పుట్టిన బిడ్డ కాన్పులోనే చనిపోయాడు; నెల పురుడు వెళ్ళకముందే ఆమెను మశూచి పట్టుకుంది.

సావిత్రమ్మ మొక్కులు ఫలించి, ఎలాగో సుశీల బ్రతికి బయటపడిందేగాని, శరీరమంతా నలుపురంగుకు తిరగటమేకాకుండా. ముఖమంతా మచ్చలతో వికృతంగా మారిపోయింది!

అంతే. అసలే స్త్రీవ్యామోహం హెచ్చుగావుండే మనోహర్ సుశీల ఛాయనుకూడా అసహ్యించుకోవడం మొదలెట్టాడు!

రోజులు గడుస్తున్నకొద్దీ సుశీల వునికే మనోహర్‌కు దుర్భరంగా తోస్తోంది....

"ఠంగ్ ఠంగ్ ఠంగ్ ఠంగ్ ఠంగ్!"

ఉలిక్కిపడింది సుశీల! గతమంతా ఆలోచిస్తూ, తను రాత్రంతా నిద్రపోలేదన్న విషయం ఆమెకి క్షణంలో గుర్తుకు వచ్చింది.

నౌకర్లు హడావుడిగా ఇల్లంతా తిరుగుతున్నారు. మెల్లిగా మంచంమీదనుంచి లేచి, పూజామందిరంలోకి వెళ్ళి, ఎదురుగా కన్పిస్తున్న శ్రీ వెంకటేశ్వరుని నిలువెత్తుపటానికి చేతులు జోడించి నమస్కరించింది సుశీల.

తాపీగా తొమ్మిదిగంటలకు నిద్రలేచిన మనోహర్, తన కెమెరా సరిచూసుకున్నాడు. వారంరోజుల క్రితం లిల్లీని వివిధ భంగిమలలో తను ఫోటో తీసిన కాపీలు ఆల్బంలోపెట్టి, ఆల్బం డ్రాయర్లో పడేసి, తాళం వేసేశాడు. వివిధ కంపెనీలకు ఫోన్‌చేసి, వ్యాపారపు వివరాలు మాట్లాడి, స్తిమితంగా సోఫాలో కూర్చున్నాడు. ట్రేలో కాఫీ, టిఫినూ పట్టుకువచ్చింది సుశీల.

"ఛీ!....ఛీ!....పొద్దున్నే పాడు మొహం!" విసురుగా కాఫీ

అందుకోబోయిన మనోహర్‌మీద కాఫీ కొద్దిగా ఒలికింది. "ఇందుకే లక్షసార్లు చెప్పాను నీకు—నువ్వేం నాకు 'పతిసేవ' చెయ్యనక్కర్లేదు, పనిమనుషులచేత పంపించు అని. వింటున్నావా?" తప్పంతా సుశీలమీదకు నెట్టాడు మనోహర్.

"పనిమనుషులమీద అన్నీ వదిలేస్తే వాళ్ళు సరిగా చెయ్యరు....ఇంటిమనుషులు ఈ పనులేనా చేసుకోలేకపోతే ఎలా?" నసుగుతూ అంది సుశీల.

"ఇప్పుడు చేశావుగా ఎంచక్కా! అయినా అదేదో సామెత చెప్పినట్టు, 'కురూపీ, ఎందుకు పుట్టావే? అంటే రూపంగలవాళ్ళను వెక్కిరించటానికే అందిట!' అలాగే నీ అవతారం పక్కన నా అందం మురికిగుంటలో గిరవాటేయబడిన వజ్రంలా నాశనమైపోతోంది!" ఇక వినలేక గిరుక్కున వెనుతిరిగింది సుశీల. అటుగా వచ్చిన సావిత్రమ్మ మాత్రం సహించలేకపోయింది.

"ఎందుకురా మనోహర్! అస్తమానం దాన్నలా ఆడిపోసుకుంటావూ? మశూచివచ్చి కాస్తంత అందం లోపించిందేగాని, సుశీలలో వున్న గుణం నీకు వెయ్యిజన్మలెత్తినా వస్తుందట్రా? ఒక వేళ నీకే మశూచి వచ్చి నీ అందమంతా తరిగిపోతే! నువ్వేం చేస్తావ్? నిన్నూ ఇలాగే సుశీల అసహ్యించుకోగలదా?" సావిత్రమ్మ కోపంతో ఊగిపోయింది.

"అమ్మా! అస్తమానూ నువ్వు సుశీలను వెనకేసుకు వస్తావెందుకూ? అసలు మా భార్యాభర్తలమధ్య నూరుంటాయి, నిన్నెవడు కలుగజేసుకోమన్నాడు?"

చెట్టంత కొడుకూ ఎదుటపడి అంత స్పష్టంగా ఈసడించుకుంటూంటే, ఆ తల్లి హృదయం బాధతో గిలగిలలాడిపోయింది.

"అవున్నాయనా? మీ ఇద్దరిమధ్యా కల్పించుకోవటానికి నేనెవత్తెని? తొమ్మిది నెలలూ మోసి, కని, పెంచటంతో నిజానికి నా బాధ్యత తీరిపోయింది. కాని కళ్ళెదురుగా కోడలు పడుతోన్న చిత్రహింస చూస్తూంటే నా కడుపు తరుక్కుపోతోంది.... నేనెంత పాపం చేసుకున్నానో! ఈఘోష చూస్తూ ఇంకా బ్రతికే వున్నాను."

న్నాడు. మరు నిమిషం కారు కదిలి వెళ్ళిపోయింది.

పూజామందిరంలోంచి సుశీల స్వరం మంద్ర మంద్రంగా వినిపిస్తోంది.

"వినా వేంకటేశం ననాధో ననాథః
సదా వేంకటేశం స్మరామి స్మరామి
హరే వేంకటేశ ప్రసీద ప్రసీద
ప్రియం వేంకటేశ ప్రయచ్ఛ ప్రయచ్ఛ."

"భగవాన్! పరాయితల్లి కన్న ఈబిడ్డ బ్రతుకు బాగు చెయ్యి. అంతకంటే నేనేమీ కోరను నిన్ను" కళ్లు మూసుకొని మనసులోనే ఆ ఏడుకొండలవాడికి మొక్కుకుంది సావిత్రమ్మ.

# 5

"డియర్ కల్యాణీ!

ఆశీర్వచనములు! నీ జాబు చేరింది. తన చెల్లెలి వైవాహిక జీవితం హాయిగా, చల్లగా సాగుతోందని తెలిసి సంతోషించని అన్నయ్య ఎక్కడేనా వుంటాడా ప్రపంచంలో?

'బంగళా చుట్టూరా బాగుచేయించి పూలమొక్కలూ, పళ్ళ చెట్లూ నాటించానన్నయ్యా. కన్నులపండువుగా వుందనుకో. ఇక రెండో బంగళా సరేసరి. దగ్గులూ, జ్వరాలూ, కాన్పులూ, పేషెంట్సుతో నిండుగా వుంది! మీ బావగారికిప్పుడు క్షణం తీరికలేదు. అస్తమానమూ కేసులూ, ఆపరేషన్లూ! కార్లో షికారువెళ్ళటానికి తీరికేదీ?'

అని వ్రాశావు. చెల్లాయీ! వెనకటి కొకాయనెవరో ఓ డాక్టర్ దంపతులను దీవిస్తూ లోకంలో రోగాలూ, రోగులూ వృద్ధిపొంది, నీ ప్రాక్టీసు పెరిగి, నీకు కీర్తిప్రతిష్ఠలూ, ఐశ్వర్యమూ రావా

అనీ, మీ దంపతులు ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధులతో కలకాలం వర్ధిల్లాలనీ అన్నాడట.

మరి ఉపేంద్ర కింత త్వరలో చక్కటి పలుకుబడీ, మాంచి ప్రాక్టీసూ వస్తోందంటే, నాకెంత ఆనందంగా వుందో తెలుసా?

'అన్నయ్యా మరి నాకు ఒదిన నెప్పుడు తెస్తావు? ఆ ప్రయత్నంలో లేనేలేవా ఏమిటి? అదేం కుదరదన్నయ్యా. త్వరలో, మన అంతస్తుకూ, నీ అందానికీ తగిన అమ్మాయిని ఎన్నికచెయ్యి. నేనే దగ్గరుండి స్వయంగా నీ పెళ్ళి ఏర్పాట్లన్నీ చేసేస్తాను!' అని వ్రాశావు, బంగారు చెల్లాయ్! నాక్కాబోయే భార్యను నువ్వు చూడవద్దా? అలాగే నీ యిష్టప్రకారమే త్వరలో పెళ్ళిచేసుకుంటాను. తీరా పెళ్ళయ్యాక, ఆ వదినమీద నీ ఆడ బడుచు అధికారం చెలాయించవు కదా?

ఉపేంద్ర నడిగానని చెప్పు....ఇక వుంటా.

నీ అన్నయ్య
రమేష్"

సాయంకాలపు నీరెండ 'లాన్'మీద పడి మెరుస్తోంది. గులా బీలు విరబూసివున్నాయి. ట్రాన్సిస్టర్‌లో 'వివిధభారతి' నుంచి 'దక్షిణ భారత్ ఫిల్మ్ సంగీతం' ప్రసారమౌతుంది.

గుప్పెళ్ళతో ఇసక కుప్పలుగా పోస్తోంది కల్యాణి. ఆమె కట్టుకుని వున్న ఎర్ర క్రేప్‌పిల్కు చీరె, బంగారు జరీ ధగధగ మెరు స్తున్నాయి. నీరెండలో చెవులకున్న ఎర్రరాళ్ళ దుద్దులు చెంపలమీద ప్రతిఫలించి, చెక్కిళ్ళు మరింత ఎర్రవారి వున్నాయి.

రెండు మోచేతులూ వెనక్కు ఇసకమీద ఆన్చి, కల్యాణి క్కాస్త దూరంలో వెనక్కువాలి వున్నాడు ఉపేంద్ర.

"మీ అన్నయ్య ఉత్తరాలు ఎంచక్కా వ్రాస్తాడు కల్యాణీ? అదీ ఓ కళేననుకుంటాను. ఎదటివ్యక్తి ఎదరవుండి మాట్లాడ్తున్నట్లు అనుభూతి చెందేలా ఉత్తరం రాయగల్గటం నిజంగా ఓ కళేసుమా! నాకది బొత్తిగా చేతకాదు; ఏదేదో వ్రాయాలని వున్నా, తీరా వ్రాయ

బోయేసరికి ఏదీ తోచదు. పెలిగ్రాంకు కాస్త అటూయిటూగా ఉత్తరం తయారౌతుంది. వ్రాయటానికికూర్చోగానే, ఎదుట కనిపించే విషయాలు కూడా తోచవు!''

నీ రెండలో, ఎర్రని దుస్తులలో, ఎర్రని దుద్దులతో, ఎర్రరాళ్ళ గాజులతో, అంతా ఎరుపుదనం అలుముకుని వున్న కల్యాణి సంధ్యారుణవర్ణం పులుముకునివున్న ప్రకృతి కాంతలా వుందనిపించింది ఉపేంద్రకు. ఆమె భువనమోహన రూపం చూస్తూ అలాగే ముగ్ధుడై పోయా డతగాడు.

''ఎదర కనిపించే మనుషుల సంగతే మీకు తోచకుండా వుంటే, ఇక వుత్తరాల్లో వ్రాయటాని కేం తోస్తాయి?'' చిరుకోపంతో భర్త వేపు చూస్తూ అంది కల్యాణి.

''హతోస్మి! నువ్వు కనిపించకపోవటమే?'' పరిహాసంగా అన్నాడు, ఉపేంద్ర, మెత్తటి ఆమె పమిటె కొంగు విలాసంగా లాగుతూ.

''మీరేమో ఉదయమనగా వెళ్ళిపోతారా, మధ్యాహ్నం ఏరెండు గంటలకో భోజనానికి మాత్రం వస్తారు. మళ్ళీ ఏ సాయంత్రమో, రాత్రికో పునర్దర్శనం. ఈలోగా ఎన్ని పుస్తకాలు చదవను? ఎన్ని అల్లికలూ, కుట్లూ వెయ్యను? ఊహూఁ, గడియారం ముళ్లు కదలందే! అస్తమానం గోళ్ళుగిల్లుకుంటూ కూర్చోబోతే బోర్ కొడుతుంది.'' కల్యాణి గోముగా చూసింది.

''తోటపనంతా పూర్తయిందా?'' చుట్టూరా కలయ జూస్తూ అడిగాడు ఉపేంద్ర.

''మొదట్లో కాస్త పొద్దుపోతూండేది. ఇప్పుడు నౌకర్లు అన్ని పన్లూ అలవాటుగా చేసుకుపోతున్నారు. ఇక నే చేసే పన్లేమున్నాయి గనుక?''

''అలా అయితే రేపే నౌకర్లందర్నీ డిస్మిస్ చేసి పారేస్తాను'' నవ్వాడు ఉపేంద్ర.

కల్యాణి పలకలేదు....ఆమె కొద్దిగా కోపం వచ్చిందని గ్రహించాడు ఉపేంద్ర.

"ఏం చెయ్యమన్నావ్ చెప్పు కల్యాణీ?త్వరగా పని ముగించుకొని వద్దామనే అనుకొంటాను. తీరా ఇంటికి బయల్దేరేవేళకు ఏదో ఓకేసు వస్తుంది...." లాలనగా కల్యాణి భుజం మీద చెయ్యివేసి అన్నాడు ఉపేంద్ర.

"మీ ప్రజాసేవ ఆపమనటం లేదు........నాకు తోచేదెలా? అంటున్నాను...."

"చుట్టు పక్కలెవరూ పరిచయం కాలేదూ? అయితే వుండు. రేపు నాకు తెలిసిన మిత్రులందర్నీ పిలిపించి 'ఆయ్యా బాబూ! మా గృహరాణిగారికి బొత్తిగా తోచడం లేదట, కాస్త మీ ఆడవాళ్ళందర్నీ పరిచయం చెయ్యండి....నా ప్రాణాలు నిలుస్తాయి" అని కోరుతాను."

కల్యాణి కోపం యిట్టే ఎగిరిపోయి, ఫక్కున నవ్వింది."భలే వారే! అలా అడుగుతారటండీ ఎవరేనా?" అంది నవ్వుతూ.

"మరేం చెయ్యను? మన పనిమనిషి మంగమ్మకు ఈ చుట్టు పక్కల తెలియని ప్రాణి అంటూ లేదు. మంగమ్మను తోడుతీసుకొని కార్లో బయల్దేరు...."

"ఇంటింటికీ నేవెళ్ళనా? నావల్ల కాదుబాబూ! ఇక్కడ లేడీస్ క్లబ్బు వుందిగా! రేపే చందాకట్టి మెంబరుగా చేరుతాను...."

ఉపేంద్ర పకపక నవ్వాడు. "అందుకింత ఉపోద్ఘాత మెందుకు కల్యాణీ? తప్పకుండా చేరు....కాని అప్పుడూ తోచకుంటే?"

నవ్వుతున్న ఉపేంద్రవేపు చిరుకోపం నటిస్తూ చూపింది

"కోపంలో అందమైన ఆడవాళ్లు మరింత అందంగా కనిపిస్తారు సుమా!" ఉపేంద్ర కల్యాణిభుజం మీద గడ్డం ఆన్చి, రహస్యంగా అన్నాడు. ప్రహరీ గోడ దగ్గరున్న అశోకచెట్ల చాటునుంచి చందమామ చిలిపిగా తొంగిచూశాడు.

"రండి!" కల్యాణి ఆ ముగ్గురు యువతులనూ మర్యాదగా ఆహ్వానించింది....

"నేనేనండీ మహిళామండలి కార్యదర్శిని. పేరు వనజ!" అలంకరణతో వయస్సును కప్పిపెట్టుకోవాలనే ప్రయత్నంలో విఫలురాలైన వనజ తననుతాను పరిచయం చేసుకొంది. మధ్యాహ్నం మహిళామండలి కార్యదర్శి,సభ్యురాళ్ళు కొందరు తనతో పరిచయం చేసుకోవటానికి రాబోతున్నట్లు ఉపేంద్ర నర్సింగ్‌హోం నుంచి సిస్టర్ విజయ ఫోన్‌చేసి చెప్పింది.ఆ కబురు విన్న కల్యాణికి ఎంతో ఆనందం కలిగింది.

"ఈవిడ నళిని. డాక్టర్ విజయకుమార్‌గారి ధర్మపత్ని! డాక్టర్ ఉపేంద్రగారూ, డాక్టర్ విజయకుమార్‌గారూ ఇప్పుడు వృత్తిలో పోటాపోటీల మీదున్నారు!" వనజ నళినిని పరిచయం చేసింది.

మగవాళ్ళలా పోటీలుపడ్తే మనకెందుకులెండి. మనం, మనం వొకటి!" నవ్వుతూ అంది కల్యాణి, నళిని నమస్కారం చేసింది.

"ఈవిడ నిమ్మీ! నిర్మల....పాతకాలపుపేరు మోటుగావుందని 'నిమ్మీ'గా మార్చుకుంది...."

అంతా తోటలో కూర్చున్నారు. నౌకరు కాఫీ, టిఫిన్లు పట్టు కొచ్చాడు. కబుర్లు రకరకాల విషయాలమీద దొర్లిపోయాయి. వనజ ఏమీ చదువుకోలేదనీ, నళిని బి.ఏ. పాసయిందనీ, నిమ్మీ ఇంటరు పాసయిందనీ తెలిసింది కబుర్ల సందర్భంలో.

హఠాత్తుగా వనజ అంది: "మీ రెంత అందంగా వున్నారండీ కల్యాణిగారూ! నిజంగా కళ్లు చెదిరేలా వున్న మీ సౌందర్యం, నా మటుకు నన్ను సర్వం మరిచిపోయేలా చేస్తోందంటే నమ్మండి."

కల్యాణి హృదయం గర్వంతో క్షణకాలం ఉప్పొంగి పోయింది. చిరునవ్వు నవ్వి వూరుకుంది.

"కాని....మీ పక్కన ఉపేంద్రగారిని చూస్తే మాత్రం బాధ

కలుగుతుంది....మీ అందానికి వారు తగరనిపిస్తుంది....మరోలా అనుకోకండి....నాది సూటిగా మాట్లాడే తత్త్వం!"

ఆ "తత్త్వం" అసహ్యకరమనీ, అసభ్యకరమనీ ఎందు కావిడకు తోచదో బోధపడలేదు కల్యాణికి,

"మా అక్క యొకావిడుంది! కల్యాణిగారిలానే ఎంతో బావుంటుంది! ఎన్ని సంబంధాలొచ్చినా నచ్చలేదని తిరగ్గొట్టింది. చివరకు ఏ సంబంధమూ కుదరక, మా బావను వివాహమాడేసింది విధిలేక! మా బావెలావుంటాడో తెలుసా కల్యాణిగారూ? బాబోయ్! రాత్రి కలలోకి వస్తాడు ఇప్పుడు తలుచుకుంటే!" తనెంతో చమత్కారంగా మాట్లాడాననుకుని, తన మాటలకు తనే నవ్వేసింది నిమ్మి.

"అలాంటిదేంలేదు. నేనే డాక్టరుగారిని కోరిచేసుకున్నాను!" కోపాన్ని లోలోపలే అణుచుకోవటానికి వ్యర్థప్రయత్నం చేస్తూ అంది కల్యాణి.

"మారేజెస్ ఆర్ మేడ్ ఇన్ హెవెన్ అంటారు పెద్దలు.... ఇంతకూ మీరు మా మహిళా సమాజాన్నీ, ఆ భవనాన్నీ చూడటానికెప్పుడొస్తారు?" తెలివిగా చర్చ మరోవేపు తిప్పింది నళిని.

"వీలుచూసుకు వస్తాను."

"డాక్టరుగారి పర్మిషన్ తీసుకోవాలా" నిమ్మి నవ్వుతూ అడిగింది.

"ఛీ....ఛీ....బొత్తిగా సభ్యత తెలీని మనుషులు!" లోలోపల విసుక్కుంది కల్యాణి నిమ్మిమాటలకు.

"మీరు మా మహిళా మండలిలో తప్పక చేరాలి కల్యాణి గారూ! మీలాటి బంగారు పిచ్చుకలు చేరినప్పుడే మా సమాజం ప్రగతి సాధిస్తుంది....ఈ సంవత్సరం కొత్తగా బాలవిహార్ ఒకటి స్థాపిద్దామనుకుంటున్నాం. అనాధలైన పసిపాపలకు ఉచిత ఆహార, విద్యాసౌకర్యాలు కల్పించటం ఈ 'బాలవిహార్' లక్ష్యం. మీరు పెద్ద మొత్తాన్ని విరాళంగా ఇవ్వాలి కూడాను!" నవ్వుతూ అంది వనజ.

కల్యాణి నవ్వింది...."అలాగే!"

చీకటి పడబోతుండగా, అంతా సెలవు తీసుకు వెళ్ళిపోయారు.

కొందరు స్నేహితులూ, కొంత వ్యాపకం దొరికిందన్న ఆ ఆనందంకంటే, వనజ తన అతి వాగుడుతో, తమ దాంపత్యం లోని వైరుధ్యాన్నిఎత్తిచూపిందన్న బాధే మిగిలిపోయింది కల్యాణికి.

ఉపేంద్ర తన పక్కన, తన అందానికి తగడన్న భావం తిరిగీ ఇన్నాళ్ళ తర్వాత తనలో తలయెత్తి కల్యాణి మనసంతా కలత బారింది.

# 6

ఆ వేళ పొద్దుపోయినా ఉపేంద్ర రాలేదు. అసలే చీకాకుగావున్న ఆమె మనస్సు మరింత చీకాకుపడిపోయింది. కారు లైట్లు గేటు లోంచి దూసుకురావటం చూచి, బంగళా కేసి నడిచింది కల్యాణి. "ఇప్పుడే ఇల్లూ, ఇల్లాలూ గుర్తుకు వచ్చాయి కాబోలు," అందా మనుకున్న కల్యాణి, ఉపేంద్రతోబాటు మరో వ్యక్తికూడా కారు లోంచి దిగటం చూచి చప్పున మానేసింది.

"ఇతగాడు భాస్కర్, కల్యాణీ! చిన్నప్పుడు, నేను వారాలు చేసుకొనే రోజుల్లో, వీళ్ళమ్మ రాజమ్మగారు, మనస్ఫూర్తిగా, తల్లిలా నా పక్కన కూర్చుని మరీ తినిపించేది అన్నం! అందుకే ఎవర్నీ వరస కలిపి పిలిచే అలవాటులేని నేను వీళ్ళమ్మను మాత్రం 'పిన్నీ' అంటుంటాను ఇప్పటికీ!"

"అలాగా!" నమస్కరించింది కల్యాణి. ప్రతి నమస్కారం చేశాడు భాస్కర్. పొట్టీ, పొడవూగాని సమ ఎత్తులో, చెప్పుకోదగి నంత అందంగాలేని భాస్కర్‌లో సంస్కారం మాత్రం నిండుగా తొణికిస లాడుతున్నట్లు తోచింది కల్యాణికి.

"ఇక్కడే బ్యాంకిలో గుమాస్తాగా వున్నాడు భాస్కర్."

ముగ్గురూ హాల్లో సోఫాల్లో కూర్చున్నారు. నౌకరుచేత హార్లిక్సూ, ఆపిల్ ముక్కలూ తెప్పించింది కల్యాణి.

"ఒద్దమ్మా! ఇప్పుడేమీ ఒద్దు...." భాస్కర్ మొహమాటంగా అన్నాడు.

అందరూ సాధారణంగా వాక్యంచివరన "అండీ" చేరుస్తారు కాని ఇతగాడేమిటి? బొత్తిగా పల్లె టైపులా ఈ సంబోధనేమిటి "అమ్మా!" అంటూ అనుకుంది కల్యాణి ఎగతాళిగా, లోలోపల.

"ఫర్వాలేదు కొద్దిగా తీసుకోండి...." కల్యాణి బలవంత పరిచింది.

"ఊహూఁ! ఒద్దమ్మా!"

ఉపేంద్ర నవ్వాడు. "భాస్కర్‌కు కొన్ని అలవాట్లున్నాయి కల్యాణీ! నియమితమైన ఆహార, విహార నియమాలను పాటిస్తా డతగాడు...."

"నియమాలూ, నీతులూ అంటూ కొన్ని బంధాలు తగిలించు కోవటానికి మనమేం సన్యాసులమా భాస్కర్‌గారూ? సొసైటీలో తిరుగు తున్నప్పుడు ఈ నియమాలను కొనసాగించుకో గలమం టారా?" నవ్వుతూ అంది కల్యాణి.

భాస్కర్ చిరునవ్వునవ్వాడు. "కొనసాగించుకోవటం, లేక పోవటం మన నిగ్రహంమీద ఆధారపడి వుంటుందమ్మా! కొన్ని నియమిత పద్ధతులు అవలంబించటానికి సన్యాసులం కానవసరం లేదు....నియమం నీతికి చెల్లెలు. నియమితమైన పద్ధతులు లేనపుడే మనిషిలో అనవసరమైన ఆందోళనలూ, అనారోగ్యమూ ఏర్పడు తాయి....మీరు నా మాటలు అతిశయోక్తులుగా భావించకండి. నిజం చెబుతున్నాను, నాకు బుద్ధి తెలిసింది మొదలూ, నా ఆహార విష యంలో, నేను చాలా శ్రద్ధతీసుకుంటాను. అంచేత దాదాపు పాతిక సంవత్సరాలు దాటినా, నా కేనాడూ శారీరక, మానసిక రుగ్మత లంటూ ఏర్పడలేదు...."

క్షణకాలం కల్యాణి నిరుత్తర అయింది.

"అన్నట్లు చెప్పటం మరచి పోయాను కల్యాణీ! ఇతగాడో రచయిత. ఇతగాడి చెల్లెలు రాధకూడా ఓ మాంచి రచయిత్రి! 'సుడి గుండాలు' నవల వ్రాసింది భాస్కరే!" అన్నాడు ఉపేంద్ర హుషారుగా.

"చాలా బావుందండి 'సుడిగుండాలు' " అంది కల్యాణి సంతోషంగా.

"యేదోలేమ్మా! ఉబుసుపోకకు వ్రాసే రచనలివి! మహానుభావులైన మన పూర్వీకపు కవులతో పోల్చుకుంటే, ఈనాటి సాహిత్యమూ, రచయితలూ, రచయిత్రులూ ఎందుకు పనికివస్తారు? సముద్రం ముందు పిల్లకాలువలాటి వీ రచనలు. కాలప్రవాహపు వురవడికి తట్టుకుంటాయో లేదో కూడా సందేహాస్పదమే!"

నివ్వెరపోయింది కల్యాణి. ఏమి టీ చాదస్తుడు? మరొకడయితే తన రచనల్ని గురించి గొప్పగా చెప్పుకుని, తాను వ్రాసినవన్నీ ఏకరువు పెట్టేవాడేమో! "మీ చెల్లాయినోమారు నేను రమ్మన్నానని చెప్పండి. నాకు రచయితలన్నా, రచయిత్రులన్నా, వారితోటి పరిచయమన్నా చాలా సరదా" అంది కళ్యాణి.

"అలాగే!"

"మీ ఫామిలీ అదీ...." కళ్యాణి మాటల్ని మధ్యలోనే ఆపేశాడు ఉపేంద్ర.

"భాస్కర్ కింకా పెళ్ళికాలేదు కళ్యాణీ! తన చెల్లెలు రాధకు పెళ్ళయ్యాకే తను పెళ్ళి చేసుకుంటాడట!"

"మరింకేం? చప్పున మీ చెల్లాయికి పెళ్ళిచేసి, మీరూ ఓ ఇంటివాళ్లు కాండి!" కిలకిల నవ్వింది కళ్యాణి.

"అంత తాహతు నాకు లేదమ్మా! ఎక్కువ కట్నాలు పోసే తాహతులేదు. తక్కువలో తగిన వరుడు రాడు." బాధగా అన్నాడు భాస్కర్.

"అందరూ రమేష్ లే అనుకుంటున్నావా కళ్యాణీ! కటికి పేదవాణ్ణి, చెల్లెలి నిచ్చి, అపర కుబేరుడులా మార్చటానికి?" ఉపేంద్ర నవ్వుతూ, కళ్యాణివేపు చూశాడు.

"కాకపోవటమే మేలు, తనకు నచ్చాడు గదాని, గబుక్కున పెళ్ళిచేసెయ్యకుండా" అందామె మనస్సు.

"నేనిక వస్తా ఉపేంద్రా! వెళ్ళొస్తానమ్మా!"

భాస్కర్ వెళ్ళిపోయాడు.

"కళ్యాణీ! మనిషి పేదవాడైనా, గుణాలలో గొప్పవాడు కళ్యాణీ! పాపం! ఒకప్పుడు సిరిలో మునిగి తేలుతుండేవారు.... ఈనాడు చెల్లెలికి పెళ్ళిచెయ్యలేని పరిస్థితిలో, ముసలితల్లితో, ఎలాగో పరువుగా కాలం నెట్టుకు వస్తున్నాడు" అన్నాడు ఉపేంద్ర, భాస్కర్‌ను గురించి.

"అందుకే మీకు నచ్చాడు." కళ్యాణి మాటలలోని వ్యంగ్యం పసిగట్టలేకపోయాడు ఉపేంద్ర.

సాయంత్రం వనజా వగైరాలు వచ్చివెళ్ళిన సంగతి చెప్పింది కళ్యాణి ఆరాత్రి ఉపేంద్రతో.

"రైట్! ఇంకేం,రోజూ వాళ్ళందర్నీ మనంటికివచ్చి కూర్చో మనలేకపోయావూ?" అన్నాడు ఉపేంద్ర నవ్వుతూ.

"బావుంది. వాళ్ళకేం పనుల్లేవా ఏమిటి?"

"లేదు కళ్యాణీ! కొందరు స్త్రీ పురుషులకల్లా వూరంతా అస్త మానూ తిరిగి రావటం సరదా. ప్రతిరోజూ, ఏదో ఓ సాకుతో, ఎక్కడికో ఓ చోటుకు వెళ్ళకపోతే, నీళ్ళలోంచి తీసిపడేసిన చేపల్లా గిల గిలలాడిపోతారు." అన్నాడు ఉపేంద్ర నవ్వుతూ.

"మనింటికోసారి వచ్చినంత మాత్రాన తిరుగుపోతులని ఎందు కనుకోవాలి?" రోషంగా అంది కళ్యాణి.

"అరె! నీకు ముక్కుమీదే వుంటుంది కోపం కళ్యాణీ.... పోనీవోయ్! ఎవరెటుపోతే మనకెందుకు? కమ్మనికాలం కరిగి పోతోంది చూడు!"

హుషారుగా ఆమెను దగ్గరకు తీసుకున్నాడు ఉపేంద్ర. కాని మరుక్షణంలో ఫోను గణగణ మోగటంతో కళ్యాణిని వదిలి, ఫోను చేతికి తీసుకున్నాడు.

"సారీ కళ్యాణీ! ఎవరో పసిబిడ్డకు జబ్బుగా వుందట. నర్సింగ్ హోంకు తీసుకొచ్చారట. అర్జంటుగా వెళ్లాలి నేను...."

కారు కదిలి వెళ్ళిపోయింది.

తెల్లగా పరుచుకొనివున్న వెన్నెల వేపూ, పాలనురగల్లాటి పడకవేపూ చూచి ఉస్సురని నిట్టూర్చింది కళ్యాణి.

# 7

"డాక్టర్! మీకోసం ఎవరో వచ్చారు...."

స్ప్రింగ్‌డోర్ కొద్దిగా తెరచి పట్టుకుని సవినయంగా చెప్పింది సిస్టర్ విజయ.

మెడికల్ జర్నల్స్ తిరగవేస్తున్న ఉపేంద్ర తలెత్తి, విజయ వేపు చూశాడు. అంత పొడవూ, పొట్టీ గాని సమఎత్తులో, అందంగా వుండే విజయలో పసిపిల్లల అమాయకత్వం, అచంచల సేవాపరాయణత్వం కొట్టొచ్చినట్లు కనిపిస్తుంటాయి. ఎందరో నర్సు లున్నారు. చాలామంది "ఏమిటో లెండి! గతిలేక ఈ నర్స్ వృత్తిలో దిగాం! ఇందులో ఆనందమూలేదు, సుఖమూలేదు, శాంతీలేదు!" అంటూ నిట్టూర్చడం తనెన్నోమార్లు విన్నాడు. కాని విజయ అలా కాదు.

ఓ మధ్యతరగతి కుటుంబంలోని ఆరుగురు ఆడపిల్లల్లో విజయ మూడవ అమ్మాయి. తన తల్లితండ్రుల ఆర్థికస్తోమతూ, వరకట్నాల సమస్యలూ కూలంకషంగా ఆలోచించిన విజయ, స్కూల్ ఫైనల్ పాస్‌కాగానే,నర్స్ ట్రెయినింగ్‌లో చేరింది.ఉపేంద్ర ప్రైవేట్ నర్సింగ్‌హోంలో నర్స్‌గా చేరింది ట్రెయినింగ్ పూర్తికాగానే.రోగితో సరళంగా మాట్లాడి, ఆత్మీయత కలిగించటంలో విజయ మంచి నేర్పరి. అందుకే ఉపేంద్రకు ఆమె అంటే అంత అభిమానం. తనకు లేని తోబుట్టువెవరో, తన ఎదర కనిపిస్తున్నట్టు అనుభూతి చెందుతాడు ఉపేంద్ర.

"పెక్యూలియర్ కేసట! మీతో స్వయంగా మాట్లాడాలంటు న్నారు. పిలుచుకురానా?"

విజయ తిరిగీ అడగటంతో, ఉపేంద్ర ఆలోచనలకు స్వస్తి చెప్పాడు.

"ఊఁ, పిలుచుకురా సిస్టర్! స్త్రీలా, పురుషులా?"

"దంపతులు."

"సరే రమ్మను!"

రెండు నిముషాలలో, ఆజానుబాహుడైన ఓ అందమైన యువకుడూ, అతగాడి వెంట, చూడగానే సౌందర్యరాశి అనిపించ గల ఓ అందమైన యువతీ స్ప్రింగ్ డోర్స్ తోసుకు లోపలికి వచ్చారు.

"నమస్తే డాక్టర్!"

"నమస్తే! ఇలా కూర్చోండి." ఎదర కుర్చీలకేసి చూపాడు ఉపేంద్ర.

ఇద్దరూ కూర్చున్నారు.

"ఈవిడ ఒంట్లో నలతగా వుంటోంది....మీరు కాస్త పరీక్ష చెయ్యాలి...." ఉపోద్ఘాతంగా అన్నా డా యువకుడు.....

"దట్సాల్ రైట్! మీపేరేమి టన్నారూ?"

"మనోహర్! ఫర్టిలైజర్స్ బిజినెస్ చేస్తుంటాను. ఇక్కడే ఓ ఫాన్సీషాపూ, సిల్కుహౌస్‌కూడా వున్నాయి నాకు."

"గుడ్ ....మీరురాండి....పరీక్ష చేస్తాను ...." ఎగ్జామిన్ చేసే రూమ్‌కేసి నడిచాడు ఉపేంద్ర....ఆ యువతి అనుసరించింది.

"ఒంట్లో ఏమిటండీ నలత?...." మెల్లిగా అడిగాడు ఉపేంద్ర....

"వాంతులు....నీరసం...." ఆ యువతి గొణిగింది....పరీక్ష చేస్తున్న ఉపేంద్ర లోలోపల నవ్వుకున్నాడు....యువదంపతులు! అందునా ఇద్దరికిద్దరూ అపురూపంగా, కలిమిలో పుట్టి పెరిగినట్టు న్నారు....ఇలా అతి సుకుమారంగా పెరిగినవారికి తమ కాలిలో

ముల్లు గుచ్చుకున్నా అదేదో 'పెక్యూలియర్' కేస్ అనిపిస్తుంది. ఎంతో గాభరా పడిపోయి, డాక్టర్ల దగ్గరకు పరుగెత్తారు....కళ్ళు పోయినంతగా బాధపడ్తారు.

అతగాడు తండ్రి కాబోతున్నాడు. ఈవిడ తల్లి కాబోతోంది. బహుశా ఈ సంగతి తెలియక వాళ్ళిద్దరూ ఇంతగా గాభరా పడిపోతున్నారేమో!

చిరునవ్వుతో, వాష్‌బేసిన్‌లో చేతులు శుభ్రపరచుకొని, టవల్‌తో తుడుచుకుంటూ బయటికి వచ్చిన ఉపేంద్ర మనోహర్‌కేసి చూసి నవ్వాడు. "డోంట్ వర్రీ! మొదటిసారి గర్భిణిగా వుందనుకుంటా నావిడ....ప్రస్తుతం నాలుగోనెల రాబోతోంది!"

మనోహర్ ముఖంలో, తా నాశించిన మెరుపు కనిపించలేదు సరికదా, ఒక్కసారిగా అతగాడి ముఖం, ఏదో వినకూడని మాట విన్నట్టు వివర్ణమైపోవటంతో ఉపేంద్ర ఆశ్చర్యపోయాడు.

"వ్వాట్? ప్రెగ్నెంట్?" తెప్పరిల్లిన మనోహర్, గట్టిగా అరిచాడు.

"ఊఁ!"

లోపలినుంచి ఆ యువతి వచ్చి, మనోహర్ పక్కన కూర్చుంది కుర్చీలో.

"కుసుమా! విన్నావా డాక్టరుగా రేం చెబుతున్నారో?" ఆ యువతి తలూపి, తల దించుకుంది.

"కుసుమా! నువ్వెళ్ళి వరండాలో కూర్చునివుండు. డాక్టరు గారితో నే మాట్లాడి వస్తాను." మనోహర్ మాటలలానే, అతగాడి ప్రవర్తనా అర్థంకావడంలేదు ఉపేంద్రకు.

కుసుమను స్ప్రింగ్‌డోర్స్ తెరచి బయటకి సాగనంపి, తిరిగి వచ్చి ఎదురుగా కూర్చున్నాడు మనోహర్.

"డాక్టర్! ఎంత డబ్బయినా ఇస్తాను....ముందస్తిగానే చెప్పానుగా....నేను లక్షాధికారినని....ఈ బెడద వదిలించెయ్యండి!"

టేబిల్ మీదకు వంగి, రహస్యం చెబుతున్నట్లు చెప్పాడు మనోహర్.

నిర్ఘాంతపోయాడు ఉపేంద్ర.

"ఏమిటి మీరంటున్నది?" అన్నాడు.

"కుసుమకు అబార్షన్ చేసెయ్యండి. ఫీజు ఎంతయినా ఇచ్చు కుంటాను...." లెదర్‌బాగ్‌లోంచి రెండువంద రూపాయనోట్లు తీసి టేబిల్‌మీదుంచాడు మనోహర్: "ప్రస్తుతానికి అడ్వాన్సుగా ఇది మీ దగ్గరుంచండి. అబార్షన్ కాగానే, మరో నాలుగువందలు....నాలు గేమిటి మీరు ఎంత కోరితే అంత ఇస్తాను."

నోట్లవేపు ఓసారి, మనోహర్‌వేపు మరోసారి చూచిన ఉపేంద్రకు చాలావరకు అర్థమైంది.

"ఆవిడగారు మీ భార్యగారు కారా?"

మనోహర్ ఫక్కున నవ్వాడు. "నా భార్యయితే చిక్కేముందీ? ఇక్కడే ఓ లాయర్ కూతురు. పరిస్థితి చెయ్యి దాటిపోయిందనే అను మానం కలగ్గానే, మీ దగ్గిరికి వచ్చాం. కుసుమ నాన్నగారో లాయరే కాదు, అపర యమధర్మరాజనికూడా పేరు. ఆయనగారికి సంగతి తెలిస్తే, పోయిన పరువు ఎలాగూ పోయిందని, నామీద దావా వేస్తారు....నా వ్యాపారం....నా పలుకుబడి అంతా 'గోవిందా' అవు తుంది!"

మనోహర్ గాభరాగా చెప్పి, కర్చీఫ్‌తో ముఖానికి పట్టిన చెమట తుడుచుకున్నాడు.

"మరి ఆవిడ....కుసుమ....ఏమంటోంది?" బొమ ముడిచి ప్రశ్నించాడు ఉపేంద్ర.

"ఏమంటుంది? ఎంచక్కా నన్ను పెళ్ళాడమంటుంది తనని!"

"మరింకేం! ఇందాకా వచ్చాక, పెళ్ళాడకుండా ఎలా తప్పించు కుంటారు? పెళ్ళాడేసెయ్యండి!" ఉపేంద్ర లోలోపలే అసహ్యాన్ని అణుచుకుంటూ అన్నాడు.

"భలేవారే మీరు! అలా కూడా పీకెలమీదకు తెచ్చుకో మన్నారా?"

"అంటే?"

"డాక్టర్! నాకు వివాహమైంది. నా భార్య సలక్షణంగా బ్రతికే వుండికూడాను."

"ఏమిటీ? వివాహితులయ్యుండేనా ఇంతదారుణానికి ఒడిగట్టారు? మరో అమాయకురాలిని వంచించారు? పైగా అబార్షన్ చెయ్యమంటారా నన్ను?" ఉగ్రుడై పోయాడు ఉపేంద్ర.

"డాక్టర్! ప్లీజ్. కాదనకండి....ఇక్కడున్న డాక్టర్లందరిలోకీ బాగా పేరుపడ్డ డాక్టర్ మీరు....అదీగాక మీరు తీసుకున్న ఏ కేసూ పాడయినట్లు నే నింతవరకూ వినలేదు....అంచేతే,మీ దగ్గరకు వచ్చాను...." మనోహర్ ప్రాధేయపూర్వకంగా అన్నాడు.

"మిస్టర్! మీరు చేసిన తప్పులో నన్నూ భాగస్వామిని చెయ్యదలుచుకుంటున్నారా?"

లెదర్‌బాగ్ జిప్ లాగి, ఐదు వందరూపాయనోట్లు తీసి ఉపేంద్రవైపు తోశాడు మనోహర్.

ఒక్కసారిగా కోపంతో వీగిపోయాడు ఉపేంద్ర.

"మిస్టర్! ఇలాటి లక్షనోట్లు నాముందు కుమ్మరించినా, నేను మీరు కోరినట్లు ఆమెకు అబార్షన్ చెయ్యను....తెలిసిందా?"

"అంతేనంటారా?" మనోహర్ కోపంగా ఉపేంద్రకేసి చూస్తూ, నోట్లు బేగ్‌లో కుక్కుకున్నాడు.

"ముమ్మాటికీ అంతే! అనవసరంగా నన్ను విసిగిస్తే, స్వయంగా పోలీసులకు ఫోన్ చేస్తాను...."

ఒక్క అంగలో స్ప్రింగ్ డోర్స్ తెరుచుకుని విసురుగా బయటికి వెళ్ళిపోయాడు మనోహర్. కాని ఐదు నిముషాల తర్వాత, తలవంచుకొని మెల్లిగా కుసుమ లోపలికి వచ్చింది.

"డాక్టర్!" ఆర్ద్రంగా కంపిస్తూందామె గొంతు.

"కూర్చోండి."

కుసుమ కూర్చుంది కాని ఆమె బలవంతంగా దుఃఖాన్ని అణుచుకొంటోందన్నందుకు గుర్తుగా, ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో బాటు గుండె పైకీ కిందకూ ఊగుతోంది.పంటితో బిగబట్టిన పెదవులు

అదురుతున్నాయి....కళ్ళల్లో నీళ్ల సుడులు తిరుగుతున్నాయి....

కుసుమను చూస్తూన్నకొద్దీ ఉపేంద్ర హృదయంలో జాలి ముంచుకు వస్తోంది....

"కుసుమ!" పేరుకు తగ్గట్టే, సుకుమారమైన పువ్వులా వుంది. పాపం! ఈ ధూర్తుడి చేతిలో నలిగి నాశనమైపోయింది. ఉపేంద్ర గాఢంగా నిట్టూర్చాడు.

"డాక్టర్!" ఇకేమీ చెప్పలేక తన రెండుచేతుల్లో ముఖం కప్పుకొని ఏడ్చింది కుసుమ."

ఐదారు నిముషాలు ఉపేంద్ర ఆమెను ఓదార్చే ప్రయత్నం పెట్టుకోలేదు.

కారణం, అలాటి సమయాలలో దుఃఖానికి లోనైన మనిషిని అలా కొంతసేపు గట్టిగా ఏడవనివ్వటమే మంచిది. ఎగసివస్తున్న దుఃఖపు పొంగు అలా కన్నీరు మున్నీరుగా మారి బయటికి ప్రవహించటంతో హృదయం తేలికౌతుంది. షుమారు పదినిముషాల తర్వాత, కుసుమ తననుతాను సంబాళించుకుంది.

"డాక్టర్! నన్నిప్పుడేం చెయ్యమంటారు?" అంది ఉపేంద్ర కేసి చూస్తూ....

ఆమె మనస్థితి ఉన్మాదస్థితిలో వుందని గ్రహించటానికెంతోసేపు పట్టలేదు ఉపేంద్రకు. క్షణకాలం ఏం సమాధానం చెప్పటానికీ తోచలేదు....

"నిజమే! నేను ఇక్కడికి రావటానికి ముందే సందేహించాను మీరిలాటివాటికి అంగీకరించరని. కాని నా జీవితం?" ఆమె హృదయంలో చెలరేగుతున్న సంక్షోభం ఉపేంద్రకు స్పష్టంగా కనిపిస్తోంది.

"చూడండీ! జీవితం ఓ మహా సాగరంలాటిది. సాగరానికి కూడా ఓ హద్దంటూ వుందికదా? అలాంటప్పుడు, స్త్రీ జీవితంలో హద్దులేకుండా ప్రవర్తిస్తే వచ్చే అనర్థాలెంత దారుణంగా వుంటాయో గ్రహించండీ! మనంవేసే ప్రతి అడుగూ జాగ్రత్తగా వేయాలి...."

కుసుమ మాట్లాడలేదు.

"జరిగిందేదో జరిగిపోయింది. ఒక తప్పును దాచుకోవటానికి మరో తప్పు చెయ్యటం వివేకవంతుల లక్షణం కాదు....ధైర్యం వహించండి. మీకు అంగీకారమైతే, మనోహర్ మీద దావా వెయ్యండి. కనీసం ఒకడేనా శిక్షింపబడటమంటూ జరిగితే, మరొకడయినా కాస్త ఇలాటి నేరాలకు దిగకుండా వుండవచ్చు....లేదా, సవ్యంగా కాన్పు రానిచ్చి, ఆత్మవిశ్వాసంతో ఆ బిడ్డను పెంచండి....ఆ తర్వాత మీ మార్గం మీరు ఎన్నుకుందురుగానీ....కాని ఇలా అబార్షన్ చేసుకున్నందువల్ల లాభమేమిటి?"

ఉపేంద్ర మాటలు మంత్ర ముగ్ధలా వింటోంది కుసుమ.

# 8

"డియర్ రమేష్,

చాలాకాలం తర్వాత నీకు ఉత్తరం వ్రాస్తున్నాను...ఉత్తరాలు వ్రాయటమంటే నాకు తగని బద్ధకమని నీకు తెలుసుగదా! అందులోనూ మనసులోని భావాలు ఒక వరుస క్రమంలో పెట్టి వ్రాయటం నాకు బొత్తిగా చేతకాదు సుమా! అందుకే తప్పు పట్టకు.

నా బాల్యదశ అతి దీనావస్థలో గడిచిందని నీకూ తెలుసు. ఆ గడ్డు రోజులలో, నన్నాదుకున్న కుటుంబాలలో ముఖ్యమైనది వెంకటేశ్వరరావుగారిది. ఆయనిప్పుడు లేరు. చనిపోయారు. ఆయనగారి భార్య-రాజమ్మ పిన్నీ అంటూంటాను నేను—తల్లి ప్రేమ ఎరుగని నాకు మాతృప్రేమను చవిచూపిన మహా ఇల్లాలు. వారి కొడుకు భాస్కర్, కూతురు రాధా ఈనాడూ నాకు ఆత్మీయులే. బాగావున్న వారి కుటుంబం వెంకటేశ్వరరావుగారి మరణంతో బాగా చితికిపోయింది, ఆర్థికంగా.

భాస్కర్ ఇక్కడే ఓ బ్యాంకిలో గుమాస్తాగా పనిచేస్తున్నాడు.

అతగాడి చెల్లెలు రాధ. స్కూల్ ఫైనల్ పాసయింది....ఇక పై చదువులు చదివే స్తోమతులేక, చదువు ఆపేసింది. కానీ చదువును మించిన సంస్కారం వుం దా అమ్మాయిలో. అన్నట్లు మరిచేపోయా—భాస్కర్, రాధ కూడా రచయితలే! రాజమ్మ పిన్నికీ, భాస్కర్‌కూ ఇప్పుడున్న సమస్యల్లా ఒక్కటే: రాధ వివాహం. వేలకు వేలు కట్నాలు కుమ్మరించగల తాహతు లేదు వారికి. అదీగాక, అందంలో, గుణంలో, సంస్కారంలో, అపరంజిలాటి రాధకు ఎలాటి వరుడు వస్తాడోనని వాళ్ళ భయం. ఆమెలో నీ రచనా శక్తిని ప్రోత్సహించే భర్త లభ్యం కావాలని వారిద్దరికి ఆశ.

ఈ సరికే నా ఉద్దేశ్యం చాలావరకూ బోధపడిం దనుకుంటాను. అయినా విడమర్చి వ్రాస్తున్నా. రాధ నీ కన్ని విధాలా తగిన గృహిణి అని నా ఉద్దేశ్యం. కేవలం ఐశ్వర్యానికీ, అంతస్తుకూ ప్రాధాన్యం యివ్వని పక్షంలో, మీ యిద్దరిదీ అనుకూల దాంపత్యం కాగలదని నా విశ్వాసం.

ఇలా సాహసించి వ్రాస్తున్నందుకు మరోలా అనుకోకు. నాది శాసనమని భావించకు. మనిద్దరి మధ్యవున్న స్నేహభావాన్నీ, చనువునూ, బాంధవ్యాన్నీ పురస్కరించుకొని ఇలా వ్రాస్తున్నానంతే. వెంటనే బయల్దేరిరా. రాధనుచూసే ఏర్పాటు తమాషాగా చేస్తాను.... కల్యాణికి ముందస్తుగా తెలియ నివ్వకు. అందరినీ సస్పెన్స్‌లో పెడదామని నా ఉద్దేశ్యం!

మరి త్వరలో బయల్దేరి వస్తావు కదూ? అన్నట్లు, నువ్వొస్తే, కల్యాణి నాగురించి నీతో బోలెడన్ని కంప్లెయింట్స్ చెయ్యాలని సిద్ధంగా వుంది సుమా!

నీ

ఉపేంద్ర'

ఉత్తరం చదువుకుని నవ్వుకున్నాడు రమేష్. కాస్సేపయాక తిరిగి మరోమారు చదువుకుని ఆలోచనలో పడ్డాడు. ఉపేంద్ర ఏదీ

సమయం ఆసన్నమైంది. ఇంతటి ఆస్తీ, డబ్బూ తేరగా వస్తాయనే ఆశతో ఎందరో కన్యలూ, ఆడపిల్లల తలిదండ్రులూ తన చుట్టూరా భ్రమరాల్లా తిరుగుతున్నారు. కోటివలలు పన్నుతున్నారు.

తనేం మహాయోగీ, జితేంద్రియుడూ కాదు. డబ్బు కల్పించే భరోసాతో, ఏ క్షణాన్నయినా, ఎలాటి మకిలిలో పడిపోతానోనని అనుక్షణం భయపడుతూనే వున్నాడు.

ఉపేంద్ర అంత నొక్కినొక్కి వ్రాశాడంటే, బహుశా ఆరాధ అన్నివిధాలా తనకు తగిన వధువే అయ్యుండవచ్చు.

క్షణంలో ఓ నిర్ణయాని కొచ్చేశాడు రమేష్. కంపెనీ మేనేజర్ శేషగిరిరావుకు, తన ఆప్తుడు చలపతికీ, తను అవసరమైన పనిమీద వూరికి వెళ్తున్నట్లూ, బహుశా రెండు రోజుల తర్వాతగానీ తిరిగి రావటానికి వీలుగాదనీ, ఈ లోగా వ్యాపార విషయాలు జాగ్రత్తగా చూసుకోమనీ ఫోన్‌చేసి, వెంటనే బయలుదేరాడు రమేష్ కారు వేసుకొని.

శ్రావణ మాసం. అప్పుడప్పుడూ వచ్చే, పోయే జల్లులతో భూమాత, అభ్యంగన స్నానం చేసిన అందమైన యువతి తడిపొడి బట్టలతో, తలార బెట్టుకున్నట్టుంది. మనోహరంగా విరబూచిన రకరకాల విరులతో, ఆకు పచ్చగా కలకలలాడుతున్న చెట్లతో, ఏడు కొండలూ మనోజ్ఞంగా కనిపిస్తున్నాయి. ఇంత చక్కటి ప్రకృతిని తన చుట్టూరా నిలుపుకుని, ఏడుకొండలమీద సుస్థిరంగా నెలకొన్న ఆ శ్రీనివాసుని వైభవం ఎలా వర్ణించినా తనివి తీరదేమో అనిపించింది రమేష్‌కు. యోగులకూ, భోగులకూ, జోగులకూ ఒకే విధమైన ఆనందాన్నీ, అనుభూతినీ పంచి పెట్టగల ఈ ప్రకృతిలో, ఈ ఏడుకొండలమీద మొలిచిన గడ్డి మొక్కయినా ధన్యమైందే మోనేమో? అతగాడి హృదయమంతా ఏవో అందమైన కొత్త ఊహలతో నిండిపోయింది.

కుండా వచ్చిన అన్నయ్యను చూచి బ్రహ్మానంద భరితురాలైంది కల్యాణి....

నవ్వాడు రమేష్. చాలా రోజుల తర్వాత ఒకరి నొకరు చూసుకున్న ఆ సోదరీ సోదరులలో ప్రేమాభిమానాలు పెల్లుబికాయి.

రమేష్ కల్యాణివేపు చూశాడు. అంతక్రితం కంటే, కొద్దిగా లావెక్కి పరిపూర్ణంగా వికసించిన అందమైన పువ్వులా వున్నట్లు తోచింది.

"ఒదిన కావాలంటూ ఉత్తరాలలో ఒకటే గొడవ చేస్తున్నావుగా? నీ బాధ వొదిలించుకోవటానికి మరో బాధను మెడకు తగిలించుకుందా మనుకుంటున్నాను...."

కల్యాణి మాటలు పూర్తిగాకుండానే, లోపలికి వస్తున్న ఉపేంద్ర పెద్దగా నవ్వాడు "....మానవాతీత కన్యవు వెదుక్కు వస్తావా ఏమిటి కల్యాణి? అలాటి అమ్మాయిలు కేవలం కథల్లోనూ, కలల్లోనూ మాత్రం కనిపిస్తుంటారు! వాస్తవిక ప్రపంచంలో అలాటి వారుండరు."

ఉక్రోషంగా భర్తవేపు చూసింది కల్యాణి. "ఎందుకుండరు? మా అన్నయ్య కోసం అలాటి అమ్మాయి ఎక్కడున్నా, వెదికి మరీ తెస్తాను చూడండి...."

"రమేష్, ఎప్పుడు రావటం? అరే! నే కాస్సేపాగి రావాల్సింది సుమా! కల్యాణి నాగురించి చెప్పదల్చుకున్న ఫిర్యాదులన్నీ పూర్తి చేసిందా?"

"మా చెల్లా యటువంటిది కాదయ్యా,బంగారుతల్లి!"అన్నాడు రమేష్ నవ్వుతూ.

'బంగారు తల్లి కాదు. బంగారు బొమ్మ!' ఉపేంద్ర పెద్దగా నవ్వాడు, కల్యాణివేపు క్రీగంట చూస్తూ.

"నీ ప్రాక్టీసు బాగా వృద్ధిచెందిందటగదూ?"అన్నాడు రమేష్.

"ఆ! చాలా వృద్ధిచెందిందన్నయ్యా! రాత్రింబగళ్ళూ, వేళకు భోజనమూ, నిద్రాకూడా లేవు. ఏకంగా నర్సింగ్ హోమే ఇల్లూ,

ఇల్లాలూ అయిపోయింది" అంది కల్యాణి నవ్వుతూ.

"నెంబర్ వన్—నోట్ దిస్ కంప్లైంట్ రమేష్!" నవ్వుతూ అన్నాడు ఉపేంద్ర.

అంతా నవ్వుకుంటూ డైనింగ్‌హాల్ వేపు నడిచి వెళ్ళారు.

సాయంత్రం ఐదుగంటలకు భాస్కర్, రాధ, రాజమ్మ పిన్ని మనింటికి వస్తామని కబురుచేశారు కల్యాణీ!" మామూలు విషయమేదో చెబుతున్నట్లు, కల్యాణికి చెప్పి, రమేష్‌వేపు తిరిగి కన్నుగీటాడు ఉపేంద్ర.

"రానీండి. కొంత్త సరదాగా గడుస్తుంది." అంది తేలిగ్గా.

సాయంత్రం నాలుగు గంటలయేసరికి, బంగళా ముందు లాన్‌లో ఐదారు పేము కుర్చీలు వేయించి, టీపాయ్ వగైరాలు అమర్పించింది కల్యాణి.

"నాకు వాళ్ళెవరో తెలీదు. చొరవగా మాట్లాడితే, ఏమైనా అనుకుంటారా కల్యాణీ?" చెల్లెలి మనోభావాలు చూచాయగా తెలుసుకోవటానికి ప్రయత్నిస్తూ అడిగాడు రమేష్.

"అనుకొనేంతటి అంతస్తుకలవారేమీ కారన్నయ్యా వాళ్ళు. నిజానికి మీ బావగారి పరిచయస్థులంతా ఇలాటివారే!" హేళన ధ్వనిస్తున్న కంఠస్వరంతో అంటున్న కల్యాణివేపు క్షణకాలం విస్తుపోయి చూశాడు రమేష్.

ఐదుగంటలు కావస్తుండగా, రాధ, భాస్కర్, రాజమ్మగార్లను తన కారులో తీసుకు వచ్చాడు ఉపేంద్ర.

నమస్కారాలూ,పరిచయాలూ అయ్యాయి.అందరూ కుర్చీల్లో కూర్చున్నారు.

కల్యాణీ, రమేష్ రాధను పరీక్షగా చూశారు. తెల్లగా,సన్నగా, పొడవుగా వున్న రాధ అందంగా, ఆకర్షణీయంగా వుంది.

కాని కల్యాణికి రాధ అలంకరణ ఎంతమాత్రం నచ్చలేదు. రెండు చేతుల నిండా ఎర్రని గాజులు, చెవులకు జుమికీలు, ముక్కు

"రాధ కూడా కథలు వ్రాస్తుంది కల్యాణీ!" మౌనంగా వాతావరణాన్ని మాటలలోకి మారుస్తూ అన్నాడు ఉపేంద్ర.

"ఏమంత చెప్పుకోదగ్గవి కాదులెండి!" సిగ్గుపడుతూ అంది రాధ.

రమేష్ మాట కలిపాడు.

"ఎవరి శక్తిని వారు పొగడుకోవటానికి ఇష్టపడతారా ఎక్కడెక్కడేనా? మీరు చెప్పండి భాస్కర్! మీ యిద్దరిలో ఎవరు బాగా వ్రాస్తారు?"

భాస్కర్ నవ్వాడు. "భలేవారే! ఎంత క్లిష్టమైన ప్రశ్న వేశారు! నిజానికి ఎవరికివాళ్ళం, ఇద్దరికిద్దరమూ బాగానే వ్రాస్తాం. అయితే, మా రాధ రచనలు ఎక్కువగా అచ్చయి వస్తుంటాయి. నావి సగానికి సగం తిరిగి నాకు పదిలంగా చేరుతుంటాయి........కారణం బహుశా ఈ రోజుల్లో స్త్రీల రచనలమీద పత్రికల ఎడిటర్లకూ, పఠితలకూ కూడా మోజు ఎక్కువవడం అయివుంటుంది." చివరివాక్యం కావాలనే అన్నట్లు భాస్కర్ నవ్వే చెప్పేసింది.

రాధ మెల్లగా తల అడ్డంగా ఊగించింది. "ఆ మాట నే నొప్పుకోనన్నయ్యా! రచనల విలువ బట్టి పేరు ప్రతిష్ఠలు వస్తాయిగానీ, వ్రాసింది స్త్రీయా, పురుషుడా అనేదాన్నిబట్టి కాదు. బాగా వ్రాసే వారికి తగినంత ప్రోత్సాహం లభ్యం కావటంలేదూ? కాని అన్నయ్యకంటే ఎక్కువగా, ప్రచురితమైతే ప్రతిఫలం వస్తుందన్న ఆశ నాకుంది!" అంది రాధ నవ్వుతూ.

రమేష్ విస్మయంగా చూశాడు రాధవేపు. "కేవలం ప్రతిఫలం మీది కోరికతోనే మీరు కథలు వ్రాస్తారా?" అన్నాడు.

ఈమారు భాస్కర్ సమాధాన మిచ్చాడు. "అది వట్టి గాలి కబురు. ప్రతిఫలన్నాశించి వ్రాసే కథలు వేరు. అవి నిజానికి రచనలనిపించుకోవు. స్వతఃసిద్ధంగా భగవంతుడిచ్చిన భావనాశక్తిని అణుచుకోడం కష్టం. ఏ కళ అయినా దానంతటదే వెలికి వస్తుంది....అలాగే రచనా శక్తి కూడా. నిజానికి మనదేశంలో రచయితలు, కేవలం

రచనాశక్తిని నమ్ముకుని జీవితయాత్ర సాగించగలరంటారా?ఎన్నడూ లేదు....ఉదాహరణ చెబుతాను చూడండి. ఓ కథవ్రాసి, ఓ పత్రికకు పంపాక, షుమారు ఓ ఆరునెలల తర్వాతగానీ, అది ప్రచురణార్హమైందని తెలియజెయ్యరా పత్రికాధిపతులు. అలా తెలియజేశాక మరో నాలుగు నెలలు పోయాకగానీ అది అచ్చులో కనిపించదు. ఆ తర్వాత ఓ నెలరోజులకుగానీ ప్రతిఫలం రూపంలో ఓ పాతికో, ముప్ఫయ్యో రూపాయలు కళ్ళజూడడు రచయిత.అంటే షుమారు ఓ పదినెలలకు పాతిక రూపాయలు సంపాదిస్తాడన్నమాట! అలా జీవితయాత్ర సాగించటం సాధ్యమంటారా?''

"మీరు చెప్పిందే నిజం" అన్నాడు రమేష్ నవ్వుతూ.

రాజమ్మగారు మాట్లాడ్డానికేమీలేక, తోచక కూర్చుని వుండటం గమనించిన ఉపేంద్ర కల్యాణివేపు తిరిగి "కల్యాణీ! మన తోటా అదీ చూపించరాదూ రాజమ్మ పిన్నికి" అన్నాడు.

"నేనూ వస్తానుండండి!" రాధ కూడా లేచింది.

"మీ తోట చాలా అందంగా వుందండీ. కానీ మీకంటే అందంగా మాత్రంకాదు!" అంది రాధ నవ్వుతూ.

కల్యాణి పొంగిపోయింది.కాని రాధ అలంకరణ తనకేమిటో ఎబ్బెట్టుగా తోచింది. "రాధా! మీకు ఈ అలంకరణేమిటి? అంత ప్రఖ్యాత రచయిత్రి అయ్యుండీ, చేతులనిండా గాజులూ, ముక్కుపుడకా వగైరా...."

రాధ కిలకిల నవ్వింది. "నే నోరచయిత్రినైనంత మాత్రాన మన సాంప్రదాయాల్ని విస్మరించాలంటారా ఏమిటి మీరు? గాజులు, ముక్కుపుడకలు వగైరాలు స్త్రీలకు మంగళకరమైన వస్తువులలోకి వస్తాయి. అవి ధరించడం, ధరించకపోవడం, వారివారి మనస్తత్వాల మీద ఆధారపడివుంటుంది. అంతేగానీ అవి ధరించినవారు పరమ ఛాందసులనీ, రాతియుగపు అనాగరికులనీ భావించడం అవివేకం కాదూ?"

రాధ యాదాలాపంగా ఇచ్చిన సమాధానం కల్యాణికి వేడిగా,

ఈలోగా అసలు సంగతి విన్న భాస్కర్ క్షణకాలం నిర్విణ్ణుడైనాడు.

"మీ రిద్దరూ కలిసి నన్ను ఆటపట్టించటం లేదుగదా?" అన్నాడు ఉపేంద్రతోటి, రమేష్‌తోటి.

రమేష్ అతగాడి భుజం తట్టి "నిన్ను ఆటపట్టించడం లేదు భాస్కర్! నిజంగానే, మనస్ఫూర్తిగా చెబుతున్నాను. రాధ నాకు నచ్చింది....త్వరలో ముహూర్తం పెట్టించు....మరో మాట....నన్ను నువ్వు కూడా 'రమేష్' అంటూ చనువుగా పిలిస్తే సంతోషిస్తాను."

భాస్కర్ కళ్ళలో కృతజ్ఞత తొణికిసలాడింది!

రాత్రి పడుకోబోతూ కల్యాణి వేపు చూస్తూ అడిగాడు ఉపేంద్ర.

"ఒక్కమాట అడుగుతాను చెబుతావూ?"

కల్యాణి కిలకిల నవ్వింది. "ఒక మాటేమిటి? వెయ్యి అడగండి చెబుతాను" అంటూ.

"రాధ, రమేష్‌ల జంట ఎలా వుంటుంది?"

ఉలిక్కిపడింది కల్యాణి. రమేష్ అన్నయ్యకు ఓ సాధారణ కుటుంబంలోని కన్య భార్యా?

"పలకవేం కల్యాణీ?"

"నా మొహంలా వుంటుంది." కోపంగా అంది కల్యాణి.

"ఇంకేం? మచ్చలేని చందమామలాటి నీ ముఖంలా వుంటే, ఎంత అందంగానో వుంటుం దన్న మాట!" ఉపేంద్ర నవ్వుతూ అన్నాడు.

"అవును, వుండకేం? ఈ ముఖంతోబాటు అంతులేని పిరీ వచ్చి పడిందిగా! ఎలాగూ ఓ సంబంధం చేశావన్నయ్య. ఇక రెండోదీ అలాటి వూరూ పేరూ లేనిదే కావాలా?" విసురుగా, తనేమంటూందో తెలుసుకోలేని స్థితిలో అనేసి, బయటికి వెళ్ళిపోయింది కల్యాణి.

క్షణకాలం నిర్విణ్ణుడైనాడు ఉపేంద్ర. ఎంత మాటంది

కల్యాణి! ఇన్నాళ్ళుగా ఈ భావనే ఆమెలో వుందా? ఆమెదృష్టిలో తను ఊరూ, పేరూ లేని, ఎందుకూ పనికిరాని, ఆమెకు తగని భర్తా?

రమేష్, కల్యాణిని తనకిస్తానన్నపుడు, తను వెంటనే అంగీకరించాడని భావించిందా కల్యాణి?

అహంకారపూరితమైన కల్యాణి హృదయంలోని మకిలి భావాలు మొదటిసారిగా తెలుసుకొన్న ఉపేంద్ర హృదయ మెంత కలతజెందింది.

రాత్రి చాలా పొద్దుపోయింది. తెలిమబ్బులు అడ్డువస్తూ,పోతూన్నందువల్ల, చందమామ తెలాతెలా పోతున్నాడు. ఆరుబయల్లో కుర్చీలో కూర్చునివున్న కల్యాణికి, ఆలోచిస్తున్నకొద్దీ, తనిందాకా అన్న మాటలలో ఎంత వాడివుందో తెలిసివచ్చింది.

తన మనసులో ఎన్నోరోజులుగా పేరుకొంటున్న అసంతృప్తి ఈరోజు కొద్దిగా అక్షరరూపంలో వెలువడిం దెందుకో! ఆ మాటలు విన్న ఉపేంద్ర ముఖంలో క్షణకాలం కనిపించిన మార్పు తలుచుకుంటున్నకొద్దీ తన కిప్పుడు పశ్చాత్తాపం కలుగుతోంది.

"నీకు ఆవేశమెక్కువ, ఆలోచన తక్కువ కళ్యాణీ!" అంటూ ఎన్నోసార్లు రమేష్ అన్నయ్య తనను హెచ్చరించాడు. ఆ మాట అక్షరాలా నిజమనిపిస్తోం దీరోజు.

రాధ అన్నయ్యకు నచ్చిందేమో? తను అడ్డు చెప్పట మేమిటి? అన్నయ్య ఓ ఉత్తరంలో వ్రాసినట్లు అప్పుడే తను ఆడబిడ్డగా మారుతోందా? ఛీ....ఛీ....

ఉపేంద్రను అనునయిద్దామని,బెడ్ రూమ్‌లోకి వెళ్ళిన కల్యాణిని చూసి, పాల నురుగులాటి పక్క ఫక్కున నవ్వింది. అక్కడ ఉపేంద్ర లేడు.

గాభరాగా రమేష్ పడుకున్న గదిదగ్గరకు వచ్చి, లోపలికి తొంగి చూసింది. రమేష్ నిశ్చలంగా నిద్రపోతున్నాడు. మేడదిగి వచ్చి, వెంకన్నను లేపింది.

"ఏదో అర్జంటు కేసంటమ్మగోరూ! ఆస్పత్రికెల్లారు అయ్య

గాఢంగా నిట్టూర్చి, మేడమీదకు వచ్చి పడుకున్న కల్యాణికి నిద్ర పటనేలేదు.

# 9

రాధా రమేష్‌ల వివాహం తిరుపతిలో జరిగింది! ఉభయఖర్చులూ రమేష్‌వే. వివాహం వైభవంగా జరిగింది. కల్యాణీఉపేంద్రులు పెళ్ళి పెత్తనమంతా నెత్తిన వేసుకు తిరిగారు.

నూతన వధువు రాధ తన అదృష్టానికి లోలోపలే ఉప్పొంగి పోయింది. రాజమ్మా, భాస్కరులు తమ కృతజ్ఞతలు పదేపదే తెలుపు కున్నారు ఉపేంద్ర, రమేష్‌లకు.

నాలుగురోజు లుండి ఉపేంద్ర వెళ్ళిపోయాడు, డిస్పెన్సరీని, రోగుల్ని చూసుకోవాలంటూ.

రమేష్ కోరికమీద కల్యాణి పదిరోజులుంది.

"మరో వారంరోజులు వుండు కల్యాణీ" అన్నాడు రమేష్ ప్రయాణమౌతున్న కల్యాణితో.

కొత్తగా పెళ్ళయిన జంటమధ్య ప్రతిబంధకంలా తను ఉండడం సబబుకా దనిపించింది కల్యాణికి. అందుకే లేని అవసరాలు కల్పించుకొని కావాలనే బయల్దేరింది.

"ఊహూఁ, నే వెళ్ళాలన్నయ్యా!" అంది దృఢంగా.

చెల్లెలి మనోభావాలు అర్థం చేసుకున్న రమేష్ మరి ఒత్తిడి చేయదలుచుకోలేదు.

ట్రెయిన్‌లో కూర్చోబెట్టి, ట్రెయిన్ కదిలేవరకూ వుండి, వెళ్ళిపోయారు రాధా రమేష్‌లు.

ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్‌లో, కల్యాణిగాక మరో యిద్ద రున్నారు. బాగా వయసుమళ్ళిన వృద్ధు డొకాయన. రెండవ వ్యక్తి ఓ అందమయిన యువకుడు. అతగాడి మెడలో కెమెరా వేళ్ళాడుతోంది.

ఏదో ఆలోచిస్తూ, కిటికీలోంచి బయటికి చూస్తూ కూర్చుంది కల్యాణి. పక్క స్టేషన్‌లో ట్రెయిన్ ఆగగానే, ఆ వృద్ధుడు దిగి పోయాడు.

ట్రెయిన్ కదలగానే ఆ యువకుడు ఆసక్తిగా కల్యాణివేపు చూసి పలకరించాడు. "క్షమించండి. మీరు....డాక్టర్ ఉపేంద్ర గారి........" అన్నాడు, అందంగా వున్న నొక్కుల క్రాపు సవరించు కుంటూ.

"...ఆః వారి సతీమణిని. మీరు?" అంది కళ్యాణి కుతూహ లంగా. అతగాణ్ణిదివరకెప్పుడూ చూసిన గుర్తుకూడా లేదామెకు.

"నా పేరు మనోహర్! భాస్కర్ వాళ్ళకు దూరపుబంధువును. భాస్కరుకు వరసకు అన్నయ్య నవుతాను...."అన్నాడతగాడు చిరు నవ్వుతో.

నిజంగా మనోహరుడే అనుకుంది కల్యాణి లోలోపల అత గాడి అందానికి ఆశ్చర్యపోతూ.

"రాధ పెళ్ళికి వచ్చారా మీరు?" అంది కుతూహలంగా.

"ఆః వచ్చాను. అక్కడే మిమ్మల్నీ, ఉపేంద్రగారినీ చూశాను. మీ పేరు కల్యాణిగారు కదూ? అంతమంది ఆహూతులలో మీరు నన్నెక్కడ గుర్తు పెట్టుకోగలరు?"

"మీరేం చేస్తుంటారు?"

తన వ్యాపార వివరాలు వివరంగా చెప్పాడు మనోహర్.

"ఒకేచోటే వుంటున్నామన్నమాట!" అంది కళ్యాణి స్నేహ పూర్వకంగా.

"అయినా. ఈ సిటీలలో విసిరివేసినట్లు, దూరదూరంగా ఉండటంతో, ఆట్టే కలుసుకోవటానికి పడదు. దాంతో దగ్గరి బంధు వులమయినా, కేవలం స్నేహితులుగా మాత్రమే మిగిలిపోతాం. భాస్కర్ కుటుంబమూ, మా బంగళాదగ్గరే. కాని మా కుటుంబాల మధ్య తరతరాలుగా వస్తున్న మనస్పర్ధలమూలంగా, దూరందూరం గానే వుంటున్నాము లెండి. మా రాధతో బంధుత్వం కలిసింది

"మీకు వివాహమయిందా?" కుతూహలంగా అడిగింది కల్యాణి.

"ఆ! అయింది." నిరుత్సాహంలో గంభీరంగా ముఖం పెట్టాడు. "చూడండి కల్యాణిగారూ! కొందరు పెద్దలు, కొందరేమిటి లెండి, చాలామంది మన పెద్దలు తరచు తామేదో అతి తెలివిగల పన్లు చేస్తున్నామని మురిసిపోతూంటారు. కాని వారు ఆ అహంతో చేసే నిర్ణయాలు ఎంత అనర్థకరంగా వుంటాయో వారికి తెలీదు. నా పెళ్ళి అలాటివాటిల్లో ఒకటి లెండి! ఇప్పుడు మా చూస్తున్నంతసేపూ నాకదే అనిపించింది. రోజు గడవటం కష్టంగా వుండే భాస్కర్ కుటుంబమెక్కడ, కలిమితో పుట్టి పెరిగిన మీ అంతస్తు యెక్కడ?"

కల్యాణి మౌనంగా వుండిపోయింది. అతగాడి వాగ్ధోరణి ఆమెలో కుతూహలాన్ని రేకెత్తిస్తోంది.

"వియ్యమునకు, నెయ్యమునకు, కయ్యమునకు సమ అంతస్తు, మనస్తత్వమూ, బలమూ వుండాలంటారు. అది అక్షరాలా నిజం.

"అంతస్తుల దేమిటి? బీద గొప్ప తేడా ఏమిటి?" అంటూ కబుర్లు చెబుతారు. కాని అంతస్తులలో వుండే తేడా మనస్తత్వాల లోనూ వుంటుంది సుమండీ! ఏ గూటిచిలక ఆ గూటి పలుకన్నట్లు, ఏ వాతావరణంలో పెరిగినవారికి ఆ వాతావరణపు ఊహలూ, పోకడలూ, ప్రభావమూ వుంటాయి.

కల్యాణి మాట్లాడలేదు. మనోహర్ వాగ్ధోరణి వాస్తవానికి దగ్గరగా వున్నట్లు తోచిందామెకు.

"మీరు గమనించారోలేదో కాస్త బీదకుటుంబంలోంచి వచ్చిన మగాళ్ళయినా, ఆడవాళ్ళయినా చూడండీ, వాళ్ళకు ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్ ఎక్కువగా వుంటుంది. సోషల్ మూవింగ్ అండ్ లివింగ్ కూడా చేతకాదు. అలాటి వసలు వారు సహించలేరుకూడాను. మా ఆవిడ సంగతి చెబుతాను. చదువుకున్న మూర్ఖురాలు. నలుగురిలోకి రాదు...."

కల్యాణి మదిలో ఉపేంద్ర మెదిలాడు. మనోహర్ చెప్పేదానో అతిశయోక్తి లేదనిపించిందామెకు.

"మీ ఆవిడ చాలా బీద కుటుంబంలోనుంచి వచ్చారా?"కుతూహలంగా అడిగింది కల్యాణి.

"ఊఁ—మీరు నాట్యం చాలా చక్కగా చేస్తారండీ!" కల్యాణి అడిగిన ప్రశ్న మీదనుంచి కప్పదాటువేసి, మరో మలుపు తిప్పాడు సంభాషణను మనోహర్.

"మీకెలా తెలుసూ?" ఆశ్చర్యంగా అడిగింది కల్యాణి.

"రెండు మూడుమార్లు మీ నాట్య ప్రదర్శనలు చూశాను. నృత్యం చెయ్యటంలో మీకు మీరే సాటి అనిపించేటంతటి అద్భుతంగా చేస్తారు. ఈ మధ్య ఎప్పుడూ ప్రదర్శన లిచ్చినట్లు కనబడదు!" సాలోచనగా కళ్యాణివేపు చూస్తూ అడిగాడు మనోహర్.

"ఊహూఁ!" కల్యాణి నిట్టూర్చింది. ఆమెలో అణగారుతున్న ఏదో జ్వాల మెల్లగా రేగుతోంది తిరిగీ మనోహర్ మాటలతో. పెళ్ళి కాకముందు తనకూ, తన నాట్యానికీ ఎన్ని ప్రశంసలు! ఎంత పేరు ప్రఖ్యాతులు! కాని ఈ మధ్య అసలు గజ్జలు ముట్టుకోలేదు కూడాను. తిల్లానా వగైరా టేప్ రికార్డ్సు మూలపడిపోయాయి.

ఎప్పుడేనా ఉక్రోషంగా తన నాట్యం మూలపడిందని ఉపేంద్రతో అంటే, ఉపేంద్ర చిరునవ్వు నవ్వేస్తాడు.

"కల్యాణీ! నీకంత ఇష్టమైతే, చక్కగా ఇంట్లో నృత్యం చేయి. చూసి ఆనందిస్తాను నేను....ఈనాడు పేరు మోసిన, గౌరవనీయుడైన ఓ డాక్టరు భార్యవు నువ్వు. చక్కటి గృహిణి స్థానం నీది. అలాటప్పుడు నువ్వు నాట్యకళ పేరుతో స్టేజీ ఎక్కి తైతక్కలాడటం, నేనేకాదు. పెద్ద మనిషైన వాడెవడూ సహించలేడు...." అంటాడు.

కల్యాణి కలాటి సమయాలలో ఉక్రోషం ముంచుకువస్తుంది. స్త్రీలోని కళ విస్తరిల్లితే. అది మహావృక్షంలా కొమ్మలుచాచితే, ఆనీడ మాటున తనెక్కడ మరుగుపడిపోతానో అనే భయం బహుశా చాలా మందిపురుషులలో దాగిఉంటుందేమో? ముఖ్యంగా ఉపేంద్రలాటిసనా

"పరువు, ప్రతిష్ఠ" ఇంకా ఏవేవో సవాలక్ష కారణాలు వలలాచేసి చూపిస్తా రెప్పుడూ. అంచేతే, మనదేశంలో, స్త్రీలలో నిబిడీకృతమై ఉన్న ఏ కళా ఓపట్టాన వెలికిరాదు. అథవా వచ్చినా, పురుషునికి వచ్చినంత పేరుప్రతిష్ఠలు నోచుకొనేలోగానే, ఏ ఆఘాతమో వచ్చి పడుతుంది.

"కల్యాణీ! కళవేరు. బాధ్యతలు వేరు. గృహిణిగా, ముఖ్యంగా మన హిందూ సాంప్రదాయాల ననుసరించిన గృహిణిగా, నీ కెన్నో బాధ్యతలూబరువులతోబాటు కొన్ని కట్టుబాట్లు కూడా వున్నాయి. అవి ఉల్లంఘించినపుడు, కీర్తికంటే అపకీర్తే చుట్టు ముడుతుంది, కళకే అంకితమై, శాశ్వతంగా కళారాధనే చేయదలుచు కున్న స్త్రీ, వివాహం మాట తలపెట్టకుండా వుండటమే శ్రేయ స్కరం. అలాటివారు యోగుల లెక్కలోకి వస్తారు. కళే వారి జీవిత పరమావధి.

"కాని వివాహమాడి, ఇల్లూ, భర్తా అంటూ ఏర్పరచుకుని, తనో ఇల్లాలుగా మారాక, నాట్యంలాటి కళలకు, ముఖ్యంగా ప్రదర్శ నలకు తిలోదకాలివ్వక తప్పదు.

"వివాహితలైన స్త్రీలు రచయిత్రులుగా రాణించటంవేరు, చిత్రకారిణులుగా రాణించటం వేరు. కాని నాట్యం అలాక్కాదు. పది మంది ఎదుటా, తననుతాను బహిరంగ పరచుకొని, నృత్యం చెయ్యాలి గృహిణి. ప్రతి ఒక్కరి చూపూ ఆమె నాట్యంమీద కంటే ఆమె మీదే కేంద్రీకృతమౌతుంది....ముఖ్యంగా భర్తస్థానంలోవున్న పురుషుడు ఇది భరించలేడు....కారణం తన భార్య అనే స్వార్థ చింతన, అహమే కావచ్చుగాని, అది అతగాడి హద్దుమీరిన ప్రేమకూ అభిమానానికీ తార్కాణం కూడాను.

"నువ్వెన్నైనా చెప్పు కల్యాణీ!పదిమందిలో నువ్వు ప్రదర్శన లివ్వటానికి నేను అంగీకరించనుసుమా!"

ఉపేంద్ర వ్యక్తపరచిన భావాలు టేపు రికార్డు పెట్టినట్టుగా ఆమెకి జ్ఞాపకం వచ్చాయి.

"ఏమిటండీ ఆలోచిస్తున్నారు?"

మనోహర్ గొంతుక విని త్రుళ్ళిపడింది కల్యాణి. ఉపేంద్ర బాజుపట్టిన భావాలు తలుచుకుంటున్న కొద్దీ ఆమెలో అసహ్యం ముంచుకువస్తోంది....

"ఏ విద్యయినా తరచు అభ్యాసం లేనిదే రాణించదు....మరి మీరు నాట్యం...." మనోహర్ తిరిగీ అడగటంతో ఆలోచనలకు స్వస్తి చెప్పి మెల్లిగా ఈ లోకంలోకి వచ్చింది కల్యాణి.

"ఆ! గృహ బాధ్యతలు అవీ...."

"అలా అనకండి! ఉత్సాహమంటూ వుండి,సరైన ప్రోత్సాహ మంటూ లభిస్తే, ఎన్ని పనులున్నా, ఎన్ని బాధ్యతలూ, బరువులూ వున్నా, తీరిక చేసుకోగలరు. బహుశా డాక్టర్ ఉపేంద్రగారికి మీరు నాట్య ప్రదర్శన లివ్వటం ఇష్టం లేదనుకుంటాను." నిశితంగా ఆమె కేసి చూస్తూ అన్నాడు మనోహర్.

క్షణకాలం, పట్టుబడిన దొంగలా, నివ్వెరపోయింది కల్యాణి. ఇతగాడికి 'ఫేసియాలజీ' లాటి విద్యేదేనా తెలుసా ఏమిటి? అను కుంది లోలోపల. ఎలాగో సంబాళించుకుంటూ "అబ్బే! అలాటిదేం లేదండీ!" అంది తడబడుతూ.

మనోహర్ గట్టిగా నవ్వాడు. "చనువుగా మాట్లాడుతున్నం దుకు మరోలా అనుకోకండి. ట్రీట్ మీ యాజ్ యువర్ ఫ్రెండ్ ప్లీజ్! అందరు స్త్రీలలానే మీరూ మీ భర్తను గురించిన కొన్ని నిజాలు పైకి చెప్పుకోవటానికి ఇష్టపడటంలేదు. దట్సాల్ రైట్!కానీ. ఒకటిమాత్రం నిజం....చాలామంది పురుషులకు, స్త్రీలలోని,ముఖ్యంగా తమ భార్యలలోని కళాభిరుచిని గుర్తించి,ప్రోత్సహించే తెలివితేటలూ, అభిలాషా ఉండవు....ఆనందించే కళా హృదయం వారిలో ఉండకపోవటమే ఇందుకు కారణం." మనోహర్ చేసిన విమర్శ ఉపేంద్రకు కూడా తగులుతుందని కల్యాణికి తెలుసు....కల్యాణి స్థానంలో మరో స్త్రీ ఉండివుంటే, తన ఎదరే, తన భర్త నలా విమర్శిస్తున్నందుకు అతగాణ్ణి దులిపి వేసేదే.

కాని ఉపేంద్ర మీద కోపంతో ఉడికిపోతున్న కల్యాణికి,

మనోహర్ మాటలు సేదదీరుస్తున్నట్లు తోచాయి. అంచేతే అతగాణ్ణి వారించటానికి ప్రయత్నంకూడా చెయ్యలేదామె!

కొందరు పురుషులలో అత్యద్భుతమైన విద్య ఒకటుంటుంది. అదేమిటంటే, ఎదుటి మనుషుల్ని మాటల్లోకి దింపి, తమ సంభాషణా చాతుర్యం ద్వారా వారిలోని బలహీనతని అతిశయింపచేసి, ఆ బలహీనతే ఆధారంగా తమ ప్రభావం వారిమీద ప్రసరింపచేస్తారు!

మనోహర్ ఆ విద్యలో అగ్రగణ్యుడు! అంచేతే అతగాడు పేరుకు ఫర్టిలైజర్స్ బిజినెస్ అంటూ నడుపుతున్నాడేగాని, ఆ ఎరువులతోబాటు దొంగసారా రవాణా, బ్లాక్ మార్కెట్ వ్యాపారం వగైరా అమోఘంగా నడుపుతున్నాడని చాలామందికి తెలియదు!

కల్యాణిలోని బలహీనతను అతగా డిట్టే పసిగట్టాడు....

"నాకు నాట్యమంటే ప్రాణం కల్యాణిగారూ! సృష్టికి మూలం ఆది దంపతుల అందెల రవళే నంటానునేను. నేను నాట్యం నేర్చుకోవాలని ఎంతగానో ఉత్సాహపడ్డాను చిన్నతనంలో. మగపిల్లవాడికి నృత్య మేమిటని, మా ఛాందసులైన అమ్మ, నాన్నలు ససేమిరా ఒప్పుకోలేదు. ఏ కళకైనా స్త్రీ పురుష భేదమేమిటో నాకు బోధపడదు! దేనికైనా అదృష్టమూ, ప్రోత్సాహమూ ఉండాలండీ!" మనోహర్ కంఠస్వరంలో బాధగోచరించింది!

"మీకు నాట్యమంటే అంత అభిమానమా!" ఆశ్చర్యంగా అడిగింది కల్యాణి.

"ప్రాణం! ఎక్కడ నాట్య ప్రదర్శనలు జరుగుతున్నా ముందు వరసలో నే నుంటాననుకోండి! 'ఝనక్ ఝనక్ పాయల్ బాజే', 'ధర్తీకా ఝంకార్' వగైరా నృత్య ప్రధాన చిత్రాలను షుమారు డజన్ మార్లయినా చూసుంటానేమో!"

కల్యాణి కుతూహలంగా వింటోం దతగాడి మాటలు....

"ఈనాడు, రానురాను, సినిమాలలో శాస్త్రీయ నాట్యానికి చోటే లేకుండా పోతోందండీ. నాట్యంపేరిట కుప్పిగంతులూ, పిచ్చి పరుగులే చూపిస్తున్నారు. అవే నాట్యమనుకుని ఎగబడి చూస్తున్నారు

ప్రేక్షకులు. కాని నిజమైన శాస్త్రీయ నాట్యంలో ఎంతటి అందం, ఆనందం ఇమిడికున్నాయో, అదిచూసే ప్రేక్షకునిలో ఎలాటి భావోద్దీపనం కలుగుతుందో, అటు నిర్మాతలూ, డాన్స్‌డైరెక్టర్లూ తెలుసుకోవటం లేదు. ఇటు ప్రేక్షకులూ అవగాహనచేసుకోవటంలేదు. నిజానికి నాట్యం కూడా శరీర వ్యాయామానికీ, ఆరోగ్యానికీ తోడ్పడుతుందని చాలా మంది తెలుసుకోలేరు. నాట్యంతో శరీరంలోని ప్రత్యంగమూ, స్ప్రింగ్‌లా, ఎటువేపంటే అటువేపు ఒంగుతుంది. అప్పుడు శరీరం లోని ప్రత్యంగానికీ రక్త ప్రసరణ సరిగా జరిగి, అన్ని అవయవాలూ పరిపూర్ణ ఆరోగ్యంతో, ఆనందంతో వికసించి, ఆ వ్యక్తికి పరిపూర్ణ ఆరోగ్యం శాశ్వతంగా ఉంటుంది. కాని ఇది అర్థం చేసుకోగల డాక్టర్లు మాత్రం ఎవరు? నన్నడిగితే, నరాలపోట్లు, నరాల బలహీనత వగైరా శారీరకమైన జబ్బులతో బాధపడే రోగులకు, శాస్త్రీయ నాట్య శిక్షణతో మందులతో రాని గుణం తెప్పించవచ్చంటాను.... అన్నట్లు చెప్పడం మరిచేపోయాను! వీలుచూసుకుని త్వరలో ఒక ఉచిత నాట్య శిక్షణ కేంద్రాన్ని స్థాపిద్దామనుకుంటున్నాను.... ఆసక్తి ఉన్న స్త్రీ పురుషులకు నృత్యంలో ఉచిత శిక్షణ ఇచ్చే ఏర్పాటుచేయిస్తాను.''

మనోహర్ మాటలు వింటున్న కొద్దీ, కల్యాణిలో అతగాడి మీద గౌరవ భావం పెరుగుతోంది. చివర అతడు వెలిబుచ్చిన అభి ప్రాయంతో అతడి మీద గౌరవాభిమానాలు సుస్థిర మయాయి.

మనోహర్ మంచి సంస్కారి. విశాల భావాలు కలవాడు. అన్ని కళలలోను ప్రవేశమున్నవాడు. కళాభిమాని. ముఖ్యంగా స్త్రీల పట్లా, వారి కళాభిరుచిపట్లా ఆదరాభిమానాలు గలవ్యక్తి. మంచి స్నేహితునిగా ఉండదగినవాడు—ఈ కొద్దికాలం పరిచయంలో కల్యాణిలో అతగాడి పట్ల ఏర్పడిన భావా లవి.

“మీకు స్టేషన్ కారు వస్తుందా?'' అడిగాడు మనోహర్.

“ఊహూఁ, ముందస్తిగా నే వస్తున్నట్లు వారికి తెలుపలేదు.... టాక్సీలో వెడతాను.'' అంది కల్యాణి.

"ఒంటరిగా వెళ్ళటం ఎందుకూ?బంగళావద్దర దిగబెట్టి వెళతా లెండి." అన్నాడు మనోహర్.

"మీ కా శ్రమెందుకు?" మొహమాటంగా అంది కల్యాణి.

"శ్రమేమిటండీ! ఐ టేక్ ఇట్ ఎ ప్లెజర్! బట్ నాట్ ఎ ప్రెషర్!" నవ్వుతూ అన్నాడు మనోహర్!

కల్యాణి కూడా నవ్వేసిం దతగాడి వాక్చాతుర్యానికి.

# 10

బంగళాముందు టాక్సీ ఆగింది.

వరండాలో కూర్చుని, భాస్కర్‌తో మాట్లాడుతున్న ఉపేంద్ర టాక్సీలోంచి దిగివస్తున్న కల్యాణిని చూసి క్షణకాలం ఆశ్చర్య పోయాడు....తర్వాత ఆనందంతో ఎదురొచ్చాడు.

"ఏమి టీ ఆఘాయిత్యం కల్యాణీ? కబురు చేస్తే, కారు తీసుకు స్టేషన్‌కు రాకపోయానా?" అన్నాడు.

మరు నిముషంలో, టాక్సీలోంచి దిగిన మనోహర్‌ను చూసి, ఉపేంద్ర ముఖంలో రంగులు మారిపోయాయి.

"వీరు మనోహర్‌గారు. ఇక్కడే బిజినెస్ చేస్తున్నారట. ట్రెయిన్‌లో పరిచయమయ్యారు."

అంది కల్యాణి మనోహర్‌ను ఉపేంద్రకు పరిచయంచేస్తూ. టాక్సీలోంచి దిగిన మనోహర్ ఉపేంద్రను చూచి పాలిపోయాడు. అసలు ఈ సమయంలో ఉపేంద్ర ఇంటి దగ్గర వుంటాడని అతగాడు కలలో కూడా ఊహించలేకపోయాడు.

ఎలాగో గాభరా అణచుకుంటూ ప్రతి నమస్కారం చేశాడు.

"భాస్కర్! రాధా రమేష్‌ల వివాహం ద్వారా మనందరి మధ్యా బంధుత్వాలు మరింత దగ్గరయాయి!" పొడిగా నవ్వుతూ అన్నాడు మనోహర్.

"ఊఁ" ముక్తసరిగా అన్నాడు భాస్కర్.

ఈ వాతావరణమూ, ఈ వ్యక్తుల మనస్థితీ బొత్తుగా అర్థం కాలేదు కల్యాణికి. వచ్చిన పెద్ద మనిషిని, పరిచయా లయ్యాక, సాదరంగా ఆహ్వానించి, మర్యాద చెయ్యాలనే ఇంగిత జ్ఞానం భాస్కర్‌కు లేదనుకున్నా, ఉపేంద్ర కెలా లేకుండా పోయిందో అర్థంకాలేదు కల్యాణికి.

"వెళ్ళొస్తానండీ!" ముగ్గురి వంకా చూసి టాక్సీకేసి నడిచాడు మనోహర్!

"ఉండండి మనోహర్‌గారూ! కాఫీ తీసుకు వెడుదురుగానీ!" అంది కల్యాణి.

"ఇప్పుడేమీ వద్దండీ! మరోమారు వచ్చినపుడు టిఫిన్ కూడా పుచ్చుకుంటా లెండి!" తడారి పోతున్న పెదవుల్ని నాలుకతో తడి చేసుకుంటూ నవ్వి, గబగబా టాక్సీలో కూలబడ్డాడు మనోహర్. భర్త కుసంస్కార పూరిత ప్రవర్తనకు లోలోపల మండి పడుతూ లోపలికి వెళ్ళిపోయింది కల్యాణి.

"మీకు ఇతగాడు బంధువా భాస్కర్!" భాస్కర్ వేపు చూస్తూ అడిగాడు ఉపేంద్ర.

"ఊఁ.నామ మాత్రపు బంధువు. అలా చెప్పుకోవటానికూడా నాకు సిగ్గేస్తోంది. దగుల్బాజీ వెధవ! కట్టుకున్న ఇల్లాలినీ, కన్నతల్లినీ నానాక్షోభా పెడుతున్నాడు. ధనగర్వంతో, అన్నిదుర్వ్యసనాలూ అబ్బేయి. పాపం! వీడి భార్య సుశీల నిజంగా సుశీలే! వీడి మూలాన పంచ ప్రాణాలూ అరచేతులో పెట్టుకొని రాత్రిం బవళ్లూ అలమటిస్తోంది."

"వ్యాపారం అదీ...." ఉపేంద్ర మాటల్ని మధ్యలోనే అడ్డుకున్నాడు భాస్కర్.

"....వ్యాపారం, బండలూను! పైకి చెప్పుకునే వ్యాపారం వేరు....అసలు సాగించే దొంగ వ్యాపారం వేరు. ఎప్పుడు ఇరుక్కుంటాడో జెయిలో అని ఏడుసోం దా తల్లి!"

ఉపేంద్ర విస్మయంగా చూశాడు భాస్కర్ వేపు.

"అవును ఉపేంద్రా! పేరుకు ఫర్టిలైజర్స్ అనీ, ఫారిన్ బిజినెస్ పేరు చెబుతుంటాడు. కాని అసలు వ్యాపారం దొంగ సారాయి రవాణా! ఇంకా దొంగనోట్లు అచ్చు కొట్టించటమూ, విదేశీ బంగారమూ, ఓహ్! ఒకటేమిటి? అన్నిరకాల బ్లాక్ బిజినెస్ చేస్తూనే వుంటాడు.... సి. ఐ. డి. ఇన్‌స్పెక్టర్స్ వీడి వాలకాన్ని గమనిస్తున్నారని వినికిడి కూడాను. కాని ఏవరేనా పెద్ద ఆఫీసరు తనని చెక్ చేయటానికి రాబోతున్నాడని తెలుస్తుందనుకో!- వెంటనే అతగాణ్ణి తన వాక్చాతుర్యంతో ఆకట్టుకుని, బాగా తాగించి, అతగాడిచేత వాగించి, అతగాడిలోని బలహీనతల్ని బయటికి లాగుతాడు. అలాటి ఆఫీసర్లకు నైట్‌క్లబ్ డాన్సర్స్‌ను జత చేసి, ఆ సమయంలో ఫోటోలుతీసి, త్రాగివున్న సమయంలో వారి అతివాగుడు టేప్ రికార్డింగుచేసి, వాళ్ళను బ్లాక్ మెయిల్ చేసి వాళ్ళనోళ్ళు మూయించేస్తాడు! తీరా ఒళ్ళు తెలిశాక, ఆ ఆఫీసర్లు వీడిచేతిలో తమ పరువు ప్రతిష్ఠలు ఇరుక్కున్నాయని తెలుసుకుని నోరునొక్కుకుని వెళ్తుంటారు! ఇదీ వీడి వ్యాపారం. ఇదీ వీడి బండారం!" భాస్కర్ అసహ్యంతో ముఖం తిప్పుకున్నాడు.

వింటూన్న ఉపేంద్ర విస్తుపోయాడు. ఆనాడు తన డిస్పెన్సరీకి వచ్చిన మనోహర్‌ని కేవలం స్త్రీలను నాశనంచేసే షోకిలాగానే వూహించుకున్నాడు.... అతగాడి వికృత రూపాలన్నీ, ధూర్తలక్షణాలన్నీ ఒకటొకటిగా ఇలా బయటపడగానే, మనోహర్‌మీద అంతు లేని కోపమూ, ఉపేంద్రలో ఉప్పెనలా పొంగాయి.

"నే వెళ్ళొస్తా ఉపేంద్రా!" భాస్కర్ వెళ్ళిపోయాడు.

కల్యాణి ప్రయాణపు కబుర్లు మొదలెట్టింది.

"అతగాడు మంచి కళారాధకుడు. ఎంచక్కా, ప్రయాణం చేసినట్లే అనిపించలేదు సుమండీ!" అంది మనోహర్‌ను గురించి చెబుతూ.

ఉపేంద్ర ముఖం వివరమెందొక్కసారిగా.

"కాని ఇంటికొచ్చిన మనిషిని కనీసం కూర్చోమని చెప్పే పాటి మర్యాదయినా మీలో లేకపోయిందెందుకో?" కల్యాణికి అంత లోనే కోపం ముంచుకు వచ్చింది.

"అంతగా మర్యాద చెయ్యవలసిన మని షేం కాదు మనోహర్."

ఉపేంద్రవేపు విస్మయంగా చూసి కల్యాణి "అంటే!" అంది.

"అతగాడి కారక్టర్ మంచిది కాదు."

"ఎవరు చెప్పారు?"

"భాస్కర్ చెప్పాడులే ...అతగాడికి బంధువుకూడాను...." విసుగ్గా అన్నాడు ఉపేంద్ర. మనోహర్‌ను గురించిన చర్చ వెగటుగా వుంది అతనికి.

కల్యాణి కిలకిల నవ్వింది. "అలా చెప్పండి. మీకు తగిన సచివుడే దొరికాడు. భాస్కర్, మనోహర్‌ల కుటుంబాల మధ్య ఏవో మనస్పర్ధలున్నాయట. అందుకే వాళ్ళిద్దరూ ఒకళ్ళమీద మరొకళ్ళు చాడీలు చెప్పుకోవటంలో ఏ మాత్రం వెనుదియ్యరు అవకాశంవస్తే. అయినా ప్రతి మనిషిలోనూ ఏవో కొన్ని లోపాలంటూ వుండనే వుంటాయి. ప్రతి మనిషి కారెక్టర్‌ను గురించీ శల్యపరీక్ష మీరు ప్రారంభిస్తే, ప్రపంచంలో ఇక స్నేహితులంటూ మిగలరేమో?"

"స్నేహితానిక్కూడా ఓ అర్హతవుండాలి కల్యాణీ!" అను నయించబోయాడు ఉపేంద్ర.

"జీవితాంతం ఒకరి కొకరుగా బ్రతకవలసిన వివాహాలలోనే అర్హతలూ, అంతస్తులూ గమనించని మీరు కొత్తగా స్నేహితాలూ, స్నేహితుల అర్హతల్ని గురించి చర్చించ బూనుకోవటం హాస్యాస్పదం!"

గిరుక్కున తిరిగి గదిలోంచి బయటికి వెళ్ళింది కల్యాణి. నిర్ఘాంతపోయాడు ఉపేంద్ర. చల్లని జాబిల్లి, ఆహ్లాదకరమైన ప్రకృతీ చేదుగా, దుర్భరంగా మారాయా నిముషంలో.

# 11

"ఏరా కోసం మీ స్నేహితురా లంటమ్మగోరూ! ఎవరో ఒకా విడ వచ్చివున్నారు."

మేడమీది గదిలో కూర్చుని, అతిలోక సౌందర్యంతో వెలిగి పోతున్న మనోహర్ ఫోటోకేసి, తదేకధ్యానంతో చూస్తున్న సుశీల నౌకరు పిలుపుతో త్రుళ్ళిపడింది....

"ఇక్కడికే పిల్చుకురా" అంది. గబగబ లేచి, రేగిన జుట్టు సవరించుకుని, బొట్టు సరిచేసుకుంది..."ఎవ రా స్నేహితురాలు?"అని ఆలోచిస్తూ కూర్చుంది.

వచ్చిన ఆగంతుకురాలిని, తన స్నేహితురాళ్ళ జాబితాను ఎంత తరచిచూచినా, పోల్చుకోలేక పోయింది సుశీల.

"నాపేరు కుసుమ....మీతో మాట్లాడాలని వచ్చాను...."

అందంగావున్న ఆ అమ్మాయి గర్భిణి అని చూస్తుండగానే పోల్చుకుంది సుశీల.

"అలాగా! రాండి" తన ప్రక్కనే సోఫా చూపింది సుశీల... కుసుమ వచ్చి ఆమె పక్కన్నే కూర్చుంది.

"మీకు నేను అపరిచితురాలినే కాని మనోహర్ భార్యగా మీరు నాకు పరోక్షంగా పరిచితులే!"నవ్వటానికి ప్రయత్నిస్తూ అంది కుసుమ.

ఆమె మాటలు అర్థంకాలేదు సుశీలకు. మనోహర్ ఈమెకు ఎలా పరిచయస్థుడో?

"మీరు నాకు అక్కయ్య వరసౌతారు!" అంది అలాగే నవ్వుతూ కుసుమ....

సుశీల పరీక్షగా కుసుమవేపు చూసింది. ఆమెకు మతి స్థిమితంగా లేదనటానికి ఆస్కారం కనిపించటంలేదు....

"నా మాటలు మీకు అర్థంకావటంలేదుకదూ? స్పష్టంగా చెబుతాను. మీకూ, నాకూ మనోహర్‌గారే!"

పిడుగు పడ్డట్లు క్షణకాలం గిలగిల లాడింది సుశీల. "ఏమిటి మీరంటున్నది?" అని మాత్రం అనగలిగింది.

"నిజమే చెబుతున్నాను. మనోహర్ వివాహితుడని నాకు తెలియదు. పెద్దలకు తెలియకుండా హద్దుమీరి ప్రవర్తించి, కోరి ఆపద కొని తెచ్చుకున్నాను. ప్రస్తుతం నాకు ఐదవనెల జరుగుతోంది....గుట్టుగా అబార్షన్ చేయిస్తానన్నాడు మనోహర్. డాక్టర్లు అంగీకరించలేదు, నాకూ ఇష్టంలేకపోయింది. కారణం—నా తెలివి తక్కువతనానికి నాలోని ఆ పసిగుడ్డును అంతం చెయ్యటమా అనిపించింది నాకే. అందుకే మొండిగా బ్రతకదలుచుకున్నాను....మీతో ఇవన్నీ చెప్పి, కేవలం మీ భార్యాభర్తల మధ్య మనస్పర్థలు రేకెత్తించాలనే ఉద్దేశ్యంతో నే నొచ్చాననుకోకండి.........అన్ని విధాలా అన్యాయం పాలైనదాన్ని....ఒక్కొక్కగానొక్క కోరిక కోరుదామని వచ్చాను...."

కుసుమ అందాకా బిగబట్టుకున్న కన్నీళ్ళు ఆమె చెక్కిళ్ళ మీదుగా ప్రవహించటం మొదలెట్టాయి.

సుశీల నిర్ఘాంతపోయింది. కుసుమ చెబుతున్న మాటలు అబద్ధం కావనటానికి నిదర్శనంగా ఆమె మనస్సును ప్రతిబింబిస్తున్న ఆ ముఖమే చెబుతోంది....మనోహర్ చివరి కింత నీచమార్గంలో ప్రయాణిస్తున్నాడన్నమాట. తనని నిర్లక్ష్యం చేశాడని బాధపడటం లేదు....వేశ్యల కొంపల చుట్టూరా తిరుగుతున్నాడని తెలిసీ బాధపడటంలేదు....కాని ఇంకా అవివాహిత కన్యల జీవితా లిలా బుగ్గిపాలు చేస్తూనే వున్నాడా అని ఆమె చింత. దీనికి పరిష్కారమేమిటి?

"ఏమి టాలోచిస్తున్నారక్కయ్యా? నే చెప్పేది నిజమౌనా కాదా అనా? ఇవి చూడండి...." కుసుమ హాండ్‌బాగ్‌లోనుంచి రెండు ఫొటోలు తీసి ఇచ్చింది. కార్డుసైజులో వున్న ఆ ఫొటోలలో మనోహర్ కుసుమను పొదివి పట్టుకుని వున్నాడు.

...టోమాటిక్ ఫొటోగ్రాఫిక్ కెమెరాతో, మనోహరే తీశాడు ఫొటోలు రెండూ" అంది కుసుమ.

సుశీల బాధగా అంది. "మీరు చెబుతోంది అబద్ధమనే ఉద్దేశ్యంతో నేనాలోచించటంలేదు కుసుమా! కాని నా భర్త చేసిన ఈ నీచపు పనికి ఏ నిష్కృతి సరిపోతుందా, నీకు నేనెలా న్యాయం చేకూర్చగలనా అని మాత్రమే ఆలోచిస్తున్నాను...."

కుసుమ నవ్వింది. "మీరు మాత్రం ఏం చేస్తారక్కయ్యా! ఎలాగో ఓలా పోరాడి, మీ మంచితనం ఆసరాతో నన్ను ఈ ఇంట్లో మరో వ్యక్తిగా చేయగలరేమో. కాని ఇలా గొలుసు కట్టుగా మనోహర్ చెలగాట మాడే ప్రతి కన్యనూ ఈ ఇంట్లోకి తీసుకురావటం సాధ్యమౌతుందంటారా? ఈనాడు నాకు మనోహర్ మీది మమకారం పూర్తిగా విరిగిపోయింది అక్కయ్యగారూ! అంచేత మీరు నాకేలాటి సహాయం చేస్తానన్నా, నేను నిరాకరిస్తాను."కుసుమ వివేకానికీ, ఆమెకొచ్చిన ఆపదకూ సుశీల హృదయం తల్లడిల్లిపోయిం దా క్షణంలో.

"మా అమ్మా, నాన్నా ఈ ఫొటోల సాయంతో, మనోహర్ మీద కేసు పెడదామంటారు. కాని నాకేమిటో ఇష్టంలేదు. ఇలాగూ ఓ విధంగా చెడ్డాను. ఇక ఈ ఫొటోలు పత్రికలలో వచ్చి, నేనూ, న పేరూ పత్రికలో ప్రముఖస్థానం వహించి, చివరకు నే సాధించేదేమిటి? మనోహర్ శిక్షింపబడతాడు....కాని నాకు పోయిన గౌరవం, చెడిన శరీరం తిరిగి వస్తాయంటారా? అమాయకులైన మీకూ, మీ అత్తయ్యగారికీ కూడా పరోక్షంగా ద్రోహం చేసిన దాన్నవుతాను.... ఇన్నీ ఆలోచించే నేను కేసులకు ఒప్పుకోలేదు .... .... నా దొక్కటే కోరిక...."

కుసుమ ఆగింది....

"చెప్పండి...." బరువుగా అంది సుశీల.

"ఈ గౌరవ వాచకాల కిక స్వస్తిచెబుదాం అక్కయ్యా! మా అమ్మ, నాన్నగారు, నేనూ ఈరోజే బయల్దేరి తిరుపతి వెళ్ళిపోతాం... అక్కడ మాకో బంగాళావుంది....అదీగాక అక్కడయితే నాకు

కొంత ప్రశాంతత చిక్కుతుందని నా నమ్మకం....ఈ కాన్పులో నేను బ్రతకడమంటూ జరుగుతుందో లేదో నే చెప్పలేను...అలా చనిపోవటమే నాకూ సంతోషం. కాని నాకు పుట్టబోయే బిడ్డను.... నువ్వు తప్పక తీసుకోవాలి....''

కుసుమ ఏం చెబుతోందో అర్థంకాలేదు సుశీలకు....''ఏమిటి నువ్వంటున్నది కుసుమా?'' ఆప్యాయంగా ఆమె తలమీద చేయివేసి అడిగింది సుశీల.

''బాగా ఆలోచించే చెబుతున్నా నక్కయ్యా! నా మీద వున్న మమకారం కొద్దీ, నేను తప్పుచేసినా నన్ను తమ కడుపులో దాచుకున్నారు మా అమ్మా, నాన్నా! నేను గర్భిణిగా వున్నానన్న సంగతి నలుగురికీ తెలియనివ్వకుండా, నా కేదో జబ్బుగా వుందని అందరికీ చెప్పి, నన్ను బయటకు రానివ్వకుండా జాగ్రత్త పడ్డారు....ఇప్పుడు తిరుపతి తీసుకు వెళ్ళటంలో ఉద్దేశ్యమదే....నా కాన్పు గుట్టుగా అక్కడ జరిగాక, ఆ బిడ్డను బహుశా రహస్యంగా ఎక్కడో పారవేయిస్తారు, లేదా యెవరికేనా ఇచ్చేస్తారు. మనోహర్‌మీద వారికి గల కోపం తీర్చుకోటానికీ,తమ తమ పరువు ప్రతిష్ఠల కోసమూ వాళ్లు నాబిడ్డ నేం చేసినా చెయ్యొచ్చు....ఆ తర్వాత మళ్ళీ కన్యగా నాకు వివాహం చెయ్యొచ్చని వారి ఆశ....అందుకే నేను ముందస్తుగా నీ దగ్గరకు వచ్చాను....నాకు నొప్పులు కనిపించగానే నీకు కబురంపుతాను .. నువ్వు వచ్చి, నా బిడ్డను తీసికెళ్ళు....మనోహర్ బిడ్డలలో ఒకడుగా, సరైన స్థానమిచ్చి ఆ బిడ్డను నువ్వు పెంచగలవనే నమ్మకంతో నీ దగ్గరకు పరిగెత్తుకు వచ్చాను....'' సుశీల రెండు చేతులూ గట్టిగా తన హృదయానికి హత్తుకుని, వలవల ఏడ్చింది కుసుమ....

వింటూన్న సుశీల హృదయం వ్రయ్య లయినట్లయింది.

''చెప్పక్కయ్యా! నేలేకున్నా నా బిడ్డను దగ్గరకు తీస్తావా? ఈ జన్మకిక మరో వివాహం నేచేసుకోను....కాని నా బిడ్డ అనాధగానో, బికారిగానో పెరగటం నే సహించలేను....''

సుశీల మెల్లిగా పెదవులు విప్పింది.''నే తీరుస్తాను చెల్లాయ్!''

కుసుమ ముఖం విప్పారింది. "నాకు తెలుసు .. దేవుడు నీ కలాటి అమృత హృదయం ఇచ్చాడు కాబట్టే, మనోహర్ లాటి ధూర్తుణ్ణి భర్తగా సహిస్తున్నావ్! సరే .. ఇక నేను నిశ్చింతగా వెళ్ళొస్తాను అక్కయ్యా!" కుసుమ లేచి నిల్చుంది.

"ఎక్కడున్నా ఎలా వున్నావో ఉత్తరాలు వ్రాస్తూండు కుసుమా!" ఆ కొద్దిసేపటిలోనే జన్మజన్మల అనుబంధమేదో ఇద్దర్నీ పెనవేసి, ఆత్మీయులుగా మార్చివేసింది.

"తప్పకుండా అక్కయ్యా."

కళ్ళనీళ్ళతో ఒకరినొకరు అనునయించుకున్నారు. అమితమైన దుఃఖ భారంతో కుసుమను సాగనంపిన సుశీల....సోఫాలోనే స్పృహ తప్పిపడిపోయింది....

# 12

"మహిళలెప్పుడూ అబలలుగారు........వారు సబలలే....

కానైతే, తాము సబలలమనే సంగతీ, తమ శక్తి సామర్థ్యాల సంగతీ వారు విస్మరించటంవల్లే, ఇన్ని అనర్థాలు వాటిల్లుతున్నాయి. భర్తల ప్రోత్సాహమూ, తగినంత ఆర్థికస్తోమతూ, అన్నిటికీమించి తగినంత మనోబలమూ, ఆత్మవిశ్వాసమూ లేనందువల్లే, మనలో చాలామంది, తామెందుకూ పనికిరాని, ఏమీచేతకాని దద్దమ్మలనీ, పురుషులకంటే అన్నివిధాలా హీనమైన ప్రాణులనీ తమని తామే కించ బరుచు కుంటున్నారు. అలా తనలో తాను నీరసించిపోతున్న స్త్రీ లోని బలహీనతల్ని కనిపెట్టిన పురుషుడు ఆ స్త్రీని మరింతగా అణగ ద్రొక్కుతున్నాడు.

"ఉదాహరణకు, సినిమాకు వెళ్లాలని ఓ భార్యకు కోరిక కలుగు తుం దనుకుందాం. ఎంతో గారాంగా 'సినిమాకు వెడదాం రాండి!'

అంటుందామె. ఆమె ముచ్చట తీర్చాలనే అభిలాషకంటే, తన పురుషాహంకారాన్నీ, అధికారాన్నీ వ్యక్తం చేసుకోవాలనే ఉద్దేశ్యంతో 'నేను రాను. నాకు తీరికలేదు.' అంటాడు భర్త. అలా అని ఊరుకోడు. 'కావలిస్తే నువ్వొక్కర్తివీ వెళ్లు!' అని కూడా అంటాడు. నిజానికిది అతగాడు గృహిణిని చేసే సవాలు. 'నే రాకుండా, నేను తోడు లేకుండా నువ్వెక్కడికీ వెళ్ళలేవు సుమా! అంటూ హేళనగా విమర్శించటం మాత్రమే! దాంతో ఆ గృహిణి, 'పోనీలెండి. ఈరోజు వద్దు....మీకు తీరినప్పుడే వెడదాం!' అనేస్తుంది. ఓ విధంగా ఇది తన ఓటమినీ, అబలత్వాన్నీ అంగీకరించటమనే విషయాన్ని గుర్తు చేసుకోరు.

"నిజానికి వివేకవతియైన స్త్రీ ఐతే ఆ సమయంలో అతగాడిలా తన ఉత్సాహాన్ని భగ్నం చెయ్యగానే, 'సర్లెండి. పాపం, మీకు తీరికలేకుంటే ఏం చేస్తారు-నేను నా స్నేహితురాలితో వెళ్తాను' అని బయల్దేరి వెళ్లాలి. అలా చెయ్యగానే అతగాడికి తన లోని కార్యదీక్ష, పట్టుదలా, ధైర్యమూ రుజువు చేసినట్లూ అవుతుంది, అతగాడికో గుణపాఠం నేర్పినట్లూ అవుతుంది తాను తప్ప స్త్రీకి మరో ప్రపంచమేలేదని విర్రవీగుతున్న పురుషుని అహంకార పూరిత హృదయంమీద ఈ సంఘటన ఖడ్గ ప్రహారణయే అవుతుంది!

"ఇలాగే ప్రతి దైనందిన చర్యలోనూ, స్త్రీ తాను అబలననే భావం విస్మరించాలి... అంతేకాదు, పదిమందిలోకి తనువస్తే, పరువు పోతుందనే మూఢ భావాన్ని తుడిచిపెట్టాలి: ఏం? పురుషుడు తనకు నచ్చిన స్నేహితులతో, స్నేహితురాళ్ళతో కలివిడిగా తిరగ్గా లేంది, స్త్రీ తనకు నచ్చిన స్త్రీ పురుషులతో చెలిమి చెయ్యటం తప్పెలా అయింది? పురుషుని దౌర్జన్యానికీ, అతగాడి మాటలకూ లొంగి, అతగాడికి దాసోహమంటూ ఆత్మార్పణ చేసుకొనే స్త్రీలను ప్రాణం వున్న వ్యక్తి లనుకోవటం కంటే నిర్జీవ పదార్థాలని సరిపెట్టుకోవటమే నిజంగా మేలు.

"స్త్రీ పురుషుని విలాస వస్తువు కాదు ...స్త్రీకి వ్యక్తిత్వం వుంది. ఆమెకూ కొన్ని కోరికలూ, కొరతలూ వుంటాయి. స్వేచ్ఛ,

స్వాతంత్ర్యం ఆమెకూ వుండి తీరాలి....తన సర్వస్వం పురుషుని కర్పించి, అతగాడి అధీనంలో సర్వం కోల్పోయి, చైతన్య రహిత మైన జడపదార్థంలా స్త్రీ శిథిలమై పోవటం నారీ లోకానికే కళంకం. ముందస్తిగా స్త్రీలందరూ ఈ సత్యాన్ని గుర్తించాలి....''

కల్యాణి కంఠస్వరం కంచుగంటలా ఖంగున మ్రోగుతోంది. షుమారు అరగంటనుంచి ఆమె ఉపన్యాసం ఇస్తోంది. ఆమె కంఠ స్వరంలో పొంగి పొరలుతున్న ఆవేశాన్నీ, అద్భుతమైన ఆమె వాక్ప్రవాహాన్నీ ఆశ్చర్యంగా గమనిస్తున్నారు శ్రోతలంతా. హాలంతా స్త్రీలతో నిండివుంది....ముందు వరసలో మధ్యనున్న కుర్చీలో కూర్చునివున్న మనోహర్ మరింత శ్రద్ధగా ఆమె మాటలు వింటు న్నాడు. అందంగా మెరుపు తీవెలా వున్న కల్యాణి ఆవేశంగా అలా మాట్లాడుతుంటే, ప్రసిద్ధ చిత్రకారుడు ఎరుపు, తెలుపు కలగలిపి చిత్రించిన చక్కటి వర్ణ చిత్రంలా వుందనిపిస్తోం దతగాడికి.... మనోహర్ మహిళామండలి పేట్రన్‌లలో ఒకడు. సాధారణంగా అన్ని మీటింగులకీ హాజరుకాడు కాని, కల్యాణి మహిళా మండలిలో మెంబరుగా చేరింది లగాయతూ, ప్రతి మీటింగుకూ అతగాడు వస్తు న్నాడు.

హాలంతా చప్పట్లతో మారుమోగింది. ముఖమూ, మెడా అంతా చిరుచెమటలు పట్టడంవల్ల, సుతారంగా కర్చీఫ్‌తో తుడుచు కుంటూ వచ్చి కల్యాణి తన సీట్లో కూర్చుంది.

"ఎంత బాగా మాట్లాడారు కల్యాణీ! నిజంగా మీ అభ్యుదయ భావాలకు జోహార్లు!" అంది నళిని.

కల్యాణి చిరునవ్వు నవ్వింది.

"నాకు చచ్చేంత స్టేజి ఫియరండీ! మాట్లాడదామని ఎంతో ప్రిపేర్ అయివస్తాను, తీరా స్టేజి ఎక్కగానే అదేమిటో కంఠం పూడుకు పోయినట్లయి, ఇక ఒక్క వాక్యంకూడా సవ్యంగా పలక లేను!" దాక్షాయణి తన బలహీనత వెళ్ళబుచ్చింది.

"ఈమారు మహిళామండలి మీటింగ్‌కు సిటీలో లక్షాధికారులు

కొందరిని ఆహ్వానించాం....చందాలు వసూలు చేయాలి. అంచేత ఆ రోజు, "స్త్రీలు—వారి సమస్యలు" ఉపన్యాస విషయంగా నిశ్చ యించాం

ఈనాడు స్త్రీలు ఎదుర్కొంటున్న అనేక రకాల సమస్యలని చర్చించాలి....మీలా మంచి కంఠస్వరమూ, స్ఫుటమైన వాచకమూ, అన్నిటికీమించి చెబుతున్న విషయంమీద శ్రోతలలో ఉద్రేకం కలిగించే చాకచక్యమూ ఎవరికీలేవు. మాలో...." అంది నిమ్మీ.

"మీరు వచ్చాకే మా మహిళామండలిలో నవచైతన్యం వెల్లి విరిపిందండీ!" అంది కమల, తనో చిన్న రచయిత్రి ననే సంగతి తన మాటలద్వారా వ్యక్తం చేయాలనే ఉద్దేశ్యంతో.

అభినందనాలతో, ప్రశంసలతో ఉక్కిరిబిక్కిరౌతోంది కల్యాణి....మనోహర్ వచ్చాడు అందర్నీ తోసుకుని.

"మీరు నమ్మండి, మానండి కల్యాణిగారూ! మీలా అప్పటి కప్పుడు, ఓ కాగితమ్ముక్కమీద పాయింట్సుకూడా నోట్ చేసుకో కుండా ఓ విషయాన్ని గురించి కూలంకషంగా, తడబాటు లేకుండా సుదీర్ఘ ఉపన్యాసం ఇవ్వటం ఎవరికీ చేతకాదండీ ...

"అందాకా ఎందుకు? మన మంత్రులూ, పెద్దపెద్ద ఆఫీసర్లూ వగైరాలుంటారు చూడండి. వారి కసలు పదిమందిలో ఎలా మాట్లాడాలో కూడా తెలియదు. గంట కో వాక్యాన్ని తడబడి తడబడి ప్రసారం చేస్తారు! ఏదో పెద్ద నాయకుడు మాట్లాడుతున్నాడు లెమ్మని విన్నా, వినకున్నా, శ్రోతలు చప్పట్లు చరుస్తారు.

"మరి కొందరయితే, ఏకంగా ఓ నాలుగు రావుల ఉపన్యాసం వ్రాసుకుని, కంఠస్థంచేసి, సభలో నిల్చుని, సుమతి శతకం పద్యంలా గడగడ ఒప్పచెప్పి, దుమ్ముదులుపుకున్నట్లు కుర్చీలో కూలబడతారు!

"ఇంకా కొందరికి తాము మాట్లాడబోయే విషయాన్ని గురించి అసలు తలాతోకా తెలిసి వుండదు. ఇలాటి మహానుభావులకు, సెక్ర టరీలే మాట్లాడబోయే విషయాన్ని గురించి వ్రాసి ఇస్తారు. అది చచ్చిచెడి బట్టీ పట్టి, ఎలాగో ముక్కున పెట్టుకుని సభలో అవకతవకగా చెప్పి చాలించుకుంటారు!

"నాబోటిగాడెవడేనా అలాటి ఉపన్యాసాలలో శ్రోతగా వుండాల్సిన ఖర్మ ఏర్పడితే, ఏం చేస్తాడో తెలుసా? ఎంచక్కా సీటుకు చేరగిలబడి ఓ కునుకు తీస్తాడు. లేదా, హాయిగా ఏ పిక్చర్లోదో, లేక తన జీవితంలోదో, తనకు నచ్చిన సంఘటన తాలూకు దృశ్యాన్ని వూహించుకుంటూ, హాయిగా అర్ధనిమీలిత నేత్రాలతో ఊహాలోకంలోకి జారిపోతాడు. వడగళ్ళ వానలాటి ఆ మహానాయకుని ముక్కాలి చెక్కల బొంగురు రాపు, కీచు, నానాభీభత్స కంఠస్వరం తాలూకు ఉపన్యాసం మెదడునుచేరి, మెదడును ముక్కలు చెయ్యవలాగైతే. అంతా ఎప్పుడు చప్పట్లుచరుస్తారో అప్పుడు ఉలిక్కిపడి, "హమ్మయ్య! ఈ నాయకుడి ఉపన్యాస హింసాకాండనుంచి బ్రతికి పోయాంరా బాబూ!' అని ఊపిరి పీల్చుకుని నలుగురితోబాటు చేతులు దగ్గర చేరుస్తాను!"

మనోహర్ వాక్చాతుర్యానికి కల్యాణితోబాటు, చుట్టూ వున్న శ్రోతలంతా విరగబడి నవ్వారు....

"రండి కల్యాణిగారూ! మిమ్మల్ని నా కార్లో డ్రాప్‌చేసి వెడతాను. ఎలాగూ ఆ దోవంటే గదా వెళ్తాను" అన్నాడు మనోహర్.

అంగీకరించింది కల్యాణి. అందరి దగ్గరా సెలవు తీసుకుని కారు వెనక సీట్లో కూర్చుంది. డ్రైవ్ చేశాడు మనోహర్.

# 13

"రండి! లోపలికి వచ్చి కాస్త కాఫీ తీసుకు వెడుదురుగాని" అంది కల్యాణి బంగళాలోకి కారు రాగానే.

"ఓ....తప్పకుండా! ఏలాగూ మీకు వాగ్దానం చేసివున్నాను కదా మరి?" నవ్వుతూ ఆమెను అనుసరించాడు మనోహర్.

"వెంకన్నా! వీరిని మేడమీద విజిటర్స్ రూంలో కూర్చోబెట్టు," అంది నౌకరుతో, "మీరక్కడ కూర్చుని వుండండి, పది నిముషాలలో వస్తాను" అంది మనోహర్‌తో!

"ఓ....యస్!" మనోహర్ నౌకరు వెంట మేడమీదకు వెళ్ళిపోయాడు.

డ్రెస్ మార్చుకుని వచ్చిన కళ్యాణివేపు, అప్రతిభుడై రెప్ప వేయకుండా చూస్తూ వుండిపోయాడు మనోహర్. పలుచని తెల్లటి జార్జెట్ చీరె, ఎర్రని క్రేప్‌సిల్కు జాకెట్టు ధరించివుంది. మహిళా మండలికి వచ్చినపుడు చుట్టగా అమర్చిన కురులను విప్పి, వాలుజడ వదులుగా అల్లుకుంది. తెల్లని విశాలమైన నుదురుమీద సన్నని ఎర్రని తిలకంబొట్టు మెరుస్తోంది. జడలో ఒకే ఒక గులాబీ, ఆమె సౌకుమార్యం ముందు వెలవెలా బోతున్నట్లుంది. నల్లని శాండల్స్ చప్పుడు చేసుకుంటూ వస్తున్న ఆ సౌందర్యరాశి చరణాలు తన హృదయంమీదే నాట్యం చేస్తున్నట్లు తోచింది మనోహర్‌కు.

"ఇంట్లో నాకు వొక్కర్తెకూ ఏమీ తోచదు. ఏదో ఇలాటి వ్యాపకమేదేనా లేకుంటే బొత్తిగా బోర్ అనిపిస్తుంది!" కల్యాణి స్నేహపూర్వకంగా నవ్వుతూ మనోహర్‌కు ఎదురుగా మరోసోఫాలో కూర్చుంది.

మంగమ్మ కాఫీ, టిఫినూ ట్రేలో పట్టుకువచ్చి, అక్కడపెట్టి, వెళ్ళిపోయింది.

"తీసుకోండి!" టిఫిన్ ప్లేటు అతగాడి ముందు పెట్టింది కల్యాణి.

"భలేవారే! నే నప్పుడు తమాషా కన్న మాటలు పట్టుకుని, టిఫిన్‌కూడా పెట్టేస్తున్నారే!" నవ్వుతూ అన్నాడు మనోహర్.

కల్యాణి చిరునవ్వు నవ్వింది.

"అదేం? మీరూ తీసుకోలేదేం? డాక్టర్‌గా రొచ్చేవరకూ వుంటారా?"

"అదేం లేదు....కాస్సేపాగి తీసుకుందామనుకున్నాను...."

"ఊహూ! కంపెనీ లేంది నే నే పనీ చెయ్యనుసుమండీ! మీరూ టిఫిన్ తీసుకుంటేనే, నే తీసుకొనేది. లేకుంటే నాకూ వద్దు!...."

మనోహర్ చనువు మాటలకి మురిసిపోయింది కల్యాణి.

"మంచివారే! కానీయండి." ప్లేటు, స్పూను చేతికి తీసుకొంది కల్యాణి.

కప్పుల్లో కాఫీ పోస్తూ, అప్రయత్నంగా తలెత్తిన కల్యాణి మనోహర్ కళ్ళు తనమీదే కేంద్రీకరించి ఉండటం గమనించింది. "ఏమిటలా చూస్తున్నారు?" అంది.

మరోలా అనుకోనంటే చెబుతాను......." అన్నాడు మనోహర్.

"ఊఁ!"

"నిజానికి ఎంతోమంది స్త్రీలని చూశాను. నాకు వ్యక్తిగతంగా పరిచయమున్న స్త్రీలు ఎందరో వున్నారుగానీండి....మీలా సౌందర్యమూ, సౌకుమార్యమూ, చదువూ, సంస్కారమూ సమపాళ్ళలో రంగరించివున్న స్త్రీలు మాత్రం నూటికి ఒక్కరుండటంకూడా అరుదేమో అనిపిస్తోంది, మీతో పరిచయం వృద్ధౌతున్నకొద్దీ!"

కల్యాణి పలకలేదు. మౌనంగా చిరునవ్వు నవ్వి వూరుకుంది.

"చదువుకున్నా, అతిశయంతో అహంకారపూరితంగా ప్రవర్తించటమో, లేక అతి ఘోషాపద్ధతి అవలంబించటమో చేస్తుంటారు చాలామంది స్త్రీలు.

"కాని విదేశాలలో చూడండి....ఈ స్త్రీపురుషజాతిభేదం లేకుండా, అంతా కలిసినట్టుగా, సరదాగా వుంటారు. అపార్థాలకూ, అనుమానాలకూ ఆస్కారమే లేదక్కడ. గాని వచ్చిన చిక్కల్లా మనలోనే. మన భారతీయుల బుర్రల్లోవున్న మూఢనమ్మకాలూ, అంధవిశ్వాసాలూ ఇక ఏ దేశస్థులలోనూ మచ్చుకూడా కనిపించవంటే నమ్మండి. ప్రగతి పంథా తెలియని పాత చింతకాయపచ్చడి రకాలు మనవాళ్ళు!"

"భార్య మరో పురుషుని ఎదుటపడినా, అతనితో మాట్లాడినా మండిపడతాడు భర్త. భర్త ఇంకో స్త్రీతో మాట్లాడితే, అపార్థాలు

తీసి, ఇల్లు నరకం చేస్తుంది ఇల్లాలు. ఇదీ మన వారి సంస్కారం! ఎంతో చదువుకున్నవారే కానీయండి. అంతర్గతంగా ఈ అనుమానపు తెరలు వారిని తొలుస్తూవుంటాయి. సహృదయత, సంస్కారం, విశాల దృక్పథం మన డిక్షనరీలలోనే లేవనుకుంటాను. అంచేతనే అన్నివిధాలా ఇంత వెనుకబడివున్నాం.

"మీరే చెప్పండి! మన దేశంలో వున్నన్ని స్త్రీల సమస్యలు మరెక్కడయినా వున్నాయా? కాని వాటిని స్త్రీలు పరిష్కరించుకో గలుగుతున్నారా? ఉహూఁ! ఆ ప్రయత్నంకూడా చెయ్యటంలేదు!

"ఎంత చదువుకున్నా, ఆర్థిక స్తోమతు, తెలివితేటలు వున్నా, వివాహం కాగానే ప్రతిస్త్రీ భర్తఅడుగుజాడల్లో నడుస్తూ అతగాడి అభిరుచులకు తల ఒగ్గక తప్పటంలేదు. చేజేతులా అలాటి పరిస్థితులు కల్పించుకుని, అదే గొప్పతనమని భావించి, తనకాళ్ళను తనే నరుక్కొంటోంది మనదేశపు స్త్రీ.ఇలా తననుతాను సంస్కరించుకోవటం చేతకాని స్త్రీ తన జాతినేం ఉద్ధరిస్తుంది?"

"మీరన్నది అక్షరాలా నిజం!...." అంది కల్యాణి అప్రయత్నంగా.

"మీరు చూడండి! చదువుకున్నారు. ఆర్జించుకున్న విజ్ఞానాన్ని అందరికీ పంచిపెట్టదల్చుకున్నారు. నిస్సంకోచంగా మీ జాతిలోని లోపాల్ని వెలికిచూపి, మీజాతి వున్నతికోసం పాటుపడుతున్నారు! మీలాటి వివేకవతులయిన స్త్రీలు మరో వందమంది వుంటే స్త్రీల పరిస్థితి ఇకముందుతరంలోనయినా, చాలావరకూ మెరుగౌతుందని నా నమ్మకం."

మనోహర్ ముఖంలోని గాంభీర్యం, అతగాడి మాటలతీరూ, కల్యాణిలో అతనిపట్ల విశ్వాసాన్నీ, గౌరవభావాన్నీ ఇనుమడింప జేశాయి. నిజానికి మనోహర్‌లో ఎంత సంస్కారం దాగివుంది అనిపించిం దామెకు.

"అంత పెద్దమాట ఉపయోగించకండి....ఏదో ఉబుసుపోకకు చేరాము మహిళామండలిలో. మీ భార్యగారు ఏమీ చదువుకో

లేదా? చదువుకున్నా నలుగురిలోకి రారా?" కుతూహలం పెల్లుబికగా అడిగింది కళ్యాణి.

"ఓహ్! చంపారు—మొన్ననే చెప్పానుగా చదువుకున్న మూర్ఖురాలని! పెద్దవాళ్ళ పట్టుదలవల్ల పెళ్ళాడానేగాని, నాలాంటివాడికి ఇల్లాలు కావలసిన అర్హత ఒకటీ లేదామెలో! అమ్మమ్మకబుర్లు చెబుతూ, ఇల్లువిడిచి బయటకు రాదు.

"అసలు మీరు సృష్టిలోని ఈ చిత్రాన్ని గమనించారో లేదో: సంఘంలో, భార్యను నలుగురిలో త్రిప్పటానికి అడ్డు చెప్పే భర్తలు కొందరైతే, సోషల్ మూవింగ్‌కు ప్రోత్సాహ మిచ్చినా ముందుకురాని భార్యలు కొందరు. రెండో కోవకు చెందింది మా దాంపత్యం...."
నిట్టూర్చాడు మనోహర్.

కల్యాణి మదిలో ఉపేంద్ర మెదిలాడు. మనోహర్‌భార్యలాటి భావాలేగల ఉపేంద్రకు బహుశా ఆమె గృహిణిగా వచ్చివుంటే బావుండేదేమో. "మీరు నచ్చచెప్పుకోలేకపోయారా మీ భార్యగారికి?" అంది కల్యాణి మనోహర్‌వేపు చూస్తూ.

"ఓయ్! ఎన్నోమార్లు నచ్చచెప్పాను. విసిగివేసారాను.అందరికీ మీలాటి సునిశితమైన తెలివితేటలుండవు కల్యాణిగారూ!"

"ఊరికే నన్ను పొగిడేస్తున్నారు."

"లేదు....లేదు....అలా అనుకుంటే నేనేమీ చెప్పలేను. కాని ప్రమాణంచేసి చెబుతున్నాను. ఇది నా హృదయాంతరాళాల్లో నుంచి వచ్చిన నగ్నసత్యం. మిమ్మల్ని చూస్తుంటే, నాకిలా అనిపిస్తుంది—మీలాటి సర్వలక్షణశోభితురాలైన గృహిణిని స్వీకరించిన ఉపేంద్రగారు ఎంతటి అదృష్టవంతులో అని—"

ఆనందాతిశయం ముప్పిరిగొన్న కల్యాణి హృదయకుహరంలోని భావతరంగాలు, లోపల దాచుకోలేక చెంపలపై కెంపులు వెదజల్లాయి.

"దేనికైనా అదృష్టమంటూ వుండాలి కల్యాణిగారూ! అది లేక పోయాక, ఏ వ్యక్తికయినా ఎంతటి సామర్థ్యం వుంటేనేం? బురదలో పోసిన పన్నీరులా అవుతుంది అతగాడి జీవితం."

అతని దో జాలి గాథ అనిపించింది కల్యాణికి. బహుశా తరచి తరచి అడగటంవల్ల అతగాడికి బాధ కలుగవచ్చుననే వుద్దేశ్యంతో మరేమీ వివరాలు అడగలేదు.

"ఇలా నేను స్త్రీలను గురించి జాలిపడటంవల్ల, చాలామంది నన్ను స్త్రీలోలుని క్రిందా, షోకిలా క్రిందా జమకడుతుంటారు.... బహుశా మీ చెవిదాకా వచ్చిందో లేదో గానీ....నా గురించి మంచి కంటే చెడే ఎక్కువ ప్రచారంలో వుంది సుమండీ. ముఖ్యంగా భాస్కర్‌లాటి అకారణ నిందా వ్యాపారుల కదే పని. అయితే అది నా కర్మ అని సరిపెట్టుకుంటాను. ఏం చేస్తాం చెప్పండి? బాగా డబ్బున్నవారిని చూస్తే. వారికుందనీ తమకు లేదనీ లేనివారి కెంత అక్కసో గమనించండి. అస్తమానమూ డబ్బున్నవారిలోని అవ గుణాలు వెదకటమే వారికి పని. నన్నడిగితే అది వారికి హాబీ అంటాను. ఎలాగో ఓలా, డబ్బుగలవారిని రకరకాలుగా తిట్టుకుని, మానసిక తృప్తి అనుభవిస్తుంటారు.

"అలాగే నా గురించి కూడా, లక్షలతో వ్యాపారం - నన్ను నేను పొగడుకోవటం అనుకోకండి - అన్ని విశాలభావాలు నాలో వున్నాయి....ఇవే ఆసరాగా నన్నాడిపోసుకుంటుంటారు జనం. పోనిద్దురూ! ఇప్పుడు నాకేం లోటొచ్చిపడింది? ఈనాటికయినా, న న్నర్థం చేసుకోగల ఓ మంచి స్నేహితులు మీ రున్నారు అనే విశ్వాసం నా కేర్పడింది. అంతే చాలు!" చాలా క్షణాలు మౌనంగా దొర్లిపోయాయి.

"మీ దగ్గ రేవైనా కొత్త నవల లున్నాయా....?" అంది కల్యాణి.

"ఓ! బోలెడన్ని. చదివేవాళ్లు లేక చెదలు పడుతున్నాయి. ఎక్కువగా ఇంగ్లీషు నవలలే వున్నాయి. ఐ లైక్ దెమ్ వెరీ మచ్! శృంగార రసపోషణలో ఇంగ్లీషు రచయితలకున్న ప్రావీణ్యం. మన వారికి పుటం వేసినా రాదు."

కల్యాణి నవ్వింది. "రేపు కొన్ని పంపండి. చదివాక తిరిగి మీ కిచ్చేస్తాము జాగ్రత్తగా."

"ఇవ్వకున్నా ఫర్వాలేదు. నిజానికి అవి నా దగ్గరుండటం కంటే మీ దగ్గరే రాణిస్తాయి. అరె, అదేమిటండీ ఆ టేబిల్‌మీద? ఏదో ఆల్బంలావుంది? మీ కభ్యంతరం లేకుంటే నే చూడొచ్చా? నాట్యకళ తర్వాత నాకు ప్రాణంలాటి మరో కళ ఫోటోగ్రఫీ! వివిధ కోణాలనుంచి, రకరకాలుగా ఫోటోలు తీయటం నా హాబీ!"

"ఓ! తప్పకుండా చూపిస్తాను." కల్యాణి లేచివెళ్ళి ఆల్బం తెచ్చిచ్చింది.

కల్యాణి చదువుకునే రోజుల్లో ఆమె స్నేహితురాళ్ళు, ఆమె కలిసివున్న ఫోటోలు కొన్నీ, నాట్యప్రదర్శన లిచ్చే సమయంలో తీసిన స్నాప్స్ కొన్నీ వున్నాయి.

పేజీలు తిప్పుతున్న మనోహర్ కళ్ళు అప్రయత్నంగా ఓ ఫొటోమీదపడి, త్రుళ్ళిపడ్డాడు. కుసుమ! కుసుమ, కల్యాణీ, మరె వరో అమ్మాయి ఓ ఫొటోలో నవ్వుతూ నిల్చుని వున్నారు. కుసుమ కల్యాణి స్నేహితురాలా? మనసులో మథన అణుచుకోలేక మెల్లిగా పైకి అనేశాడు మనోహర్. "మీ పక్కనున్న ఈ యిద్దరమ్మాయిలూ ఎవరండీ?"

"ఈ అమ్మాయి విమల....విమల మేనత్త కూతురు కుసుమ ........విమల నా డియరెస్ట్ ఫ్రెండ్. అప్పుడప్పుడూ విమల దగ్గరకు వస్తే, కుసుమ మా యింటికి వచ్చేది....అంతకు మించి ప్రత్యేకమైన స్నేహమంటూ లేదు. ఓసారి అలాగే విమల వెంట వస్తే, మా రమేష్ అన్నయ్య మా ముగ్గుర్నీ ఫొటో తీశాడు. ఏం? మీకు తెలుసా?" అంది కల్యాణి.

"అబ్బే తెలీదండీ! ఫొటోగ్రఫీ చాలా చక్కగా వచ్చింది.... అందులోనూ ఈ అమ్మాయి బాగా పడింది. అంచేత అడిగానంతే."

మనోహర్ హృదయ భారం కొంత తగ్గినట్టయింది. గబగబ పేజీలు తిప్పుతున్నాడు. "ఇవన్నీ చాలావరకూ నాట్య ప్రదర్శన సమయాలలో ఫ్లాష్ కెమెరాతో తీసిన వనుకుంటాను. ఫుట్ లైట్స్ కూడా చక్కగా పడ్డాయి!"

"అవును."

"ఈ పోజ్ అద్భుతంగా వుందండీ. ప్రణయభిక్ష పెట్టమని పరమ శివుని అర్థిస్తున్న పార్వతీదేవి మీలో సాక్షాత్కరించి వుంది ఇందులో!" ఓ ఫొటో పైకితీసి, ఆమెకు చూపుతూ అన్నాడు మనోహర్.

కల్యాణి నిండుగా నవ్వింది. "మా రమేష్ అన్నయ్యకూడా అలాగే అన్నాడోసారి. ఇది ఎన్‌లార్జి చేయించాడు కూడా" అంది. ఆమె హృదయంలో ఉపేంద్ర మెదిలాడు. ఎన్నోమార్లు ఉపేంద్రకి అల్బం చూపించాలనీ, అతగాడినుంచి ప్రశంసలు అందుకోవాలనీ ఆశించింది తను. కాని తన బలవంతంమీద ఎలాగో రెండుమూడు పేజీలు తిప్పి, "నువ్వు నాట్య ప్రదర్శనాలిచ్చేటప్పుడు తీసినవికదూ? అంటూ మొహమాటంగా, చూసీ చూడనట్లు అక్కడ పెట్టేశాడు అల్బం.

మనోహర్ అన్నట్లు ఏకళయినా గుర్తించే కళాహృదయం వుండాలి మనిషిలో. అది ఉపేంద్రలో వెదకి కూచినా లేదేమో? కాని మనోహర్‌లో ఎంతటి కళాభిరుచి నిగూఢమైయుంది!

"మీ కభ్యంతరం లేకపోతే, ఈ ఒక్క కాపీ నాకిస్తారా?" అడిగాడు మనోహర్.

"తీసుకోండి!" ఆలోచనా రహితంగా అంది కల్యాణి.

జాగ్రత్తగా ఫొటో పేంట్‌జేబులో వేసుకున్నాడు మనోహర్. క్రింద కారు హారన్ వినిపించింది. త్రుళ్ళిపడ్డాడు మనోహర్. చీకటి కూడా పడబోతోంది.

"నే వెళ్ళొస్తానండీ! డాక్టరుగారొచ్చినట్టున్నారు!" గాబరాగా లేచాడు.

"ఫర్వాలేదు కూర్చోండి. వారితో కాస్సేపు మాట్లాడి వెడుదురుగాని...." అంది కల్యాణి.

"ఊహూ(. డాక్టరుగారు అలిసి వచ్చివుంటారు. మళ్ళీ సావకాశంగా కలుసుకుంటాను. వెళ్లొస్తానండీ!" అల్బం టీ పాయ్‌మీద

పడేసి, జవాబు ఆశించకుండా బయటికి వెళ్లాడు మనోహర్.

మేడమెట్లు దిగుతోంటే ఎదురుపడిన ఉపేంద్ర మనోహర్ వేపుచూస్తూ, నిప్పులు కురిపించాడు క్షణకాలం.

"నమస్కారం డాక్టరుగారూ!" మనోహర్ పాలిపోయిన ముఖంమీద చిరునవ్వు తేలిపోయింది.

"ఊఁ" ప్రతి నమస్కారం చెయ్యకుండా, విసురుగా మెట్లెక్కుతున్న ఉపేంద్ర కళ్ళలో కెంపు తరగలేదు. మరు నిముషంలోనే మనోహర్ కారు వెళ్ళిన చప్పు డయింది.

విజిటర్స్ రూమ్ గుమ్మంలో నిల్చుని, ఇదంతా గమనిస్తోంది కల్యాణి. ఉపేంద్ర ప్రవర్తన ఆమెకు అంతుబట్టలేదు. అందరితోనూ —విసిగించే రోగులతో నయినా—ఎంతో ఓర్పుగా మాట్లాడే ఉపేంద్ర మనోహర్‌ను చూస్తేనే నిప్పులు కురిపిస్తాడెందుకు? అతగాడి అందాన్నిచూచి అసూయా? అతగాడిమీద అకారణద్వేషమా? లేక భాస్కర్ దుర్బోధలా? లేక మనోహర్ అన్నట్లు, తను అతగాడితో మాట్లాడుతోందని అపార్థం చేసుకోడమా?

# 14

"కల్యాణీ!" ఉపేంద్ర గర్జించాడు.

"…. ……….."

"వాడెందుకొచ్చాడు మళ్ళీ?" తీక్షణంగా చూస్తూ అడిగాడు ఉపేంద్ర.

ఇదేం ప్రశ్న?

"ఈ రూంలోకి, లోపలికి, అందునా మేడమీదికి ఎందుకు రానిచ్చావ్?"

"ఏమిటి మీ ధోరణి? మహిళా మండలినుంచి నన్నింటి దగ్గర కార్లో వదలి వెళ్ళబోతుంటే నేనే కాస్సేపు ఆపాను" అంది విసుగ్గా.

"ఇలాంటి జులాయి వెధవ కారు తప్ప మరో వాహనం నీకు దొరక్క పోయిందా? పోనీ నాకు ఫోన్‌చేసి వెళ్ళలేకపోయావా, కారు పంపే వాణ్ణి."

"ఇప్పుడేం కొంప మునిగిందనీ మీకీ కోపం?"

"అలా గౌరవించటానికీ ఇంట్లో అడుగు పెట్టనివ్వటానికీ కూడా ఆ మనిషికి ఓఅర్హతంటూ వుండాలి కల్యాణీ! 'కనకపు సింహాసనమున' అన్నట్లు చెయ్యకూడ దెప్పుడూ."

మరేదో చెప్పబోయిన ఉపేంద్ర కంఠం పెగలలేదు. గోడ వారగా మంగమ్మ చీరె చెరగు కన్పించింది. ఎంత సేపట్నుంచి ఈ పుర్ర ణావిడ వింటోందో అన్న అనుమానం ఇద్దరినీ వేధించింది ఆ క్షణంలో.

"ఎవరో మీకోసం వచ్చారు బాబుగారూ!" అంది మంగమ్మ గది గుమ్మంవార నిల్చుని....

ఉపేంద్ర కిందికి వెళ్ళిపోయాడు.

కాస్సేపట్లో వచ్చిన మనిషిని మాట్లాడి పంపించి మేడమీదకు వచ్చాడు ఉపేంద్ర. తను కోపపడటంతో చిన్నబుచ్చుకుని, అలిగి కిటికీలోంచి బయటికి చూస్తూ నిల్చునివున్న కల్యాణిని చూడగా జాలి ముంచుకు వచ్చిందతగాడికి. ఇద్దరూ కలిసి సినిమాకు వెళ్ళాలను కుంటూ త్వరగా ఇంటికి వచ్చాడు తను. మనోహర్‌ను చూడటంతో రెచ్చిపోయాడు. మెల్లిగా నచ్చచెబితే పోయే భాగ్యానికి అనవసరంగా కేకలువేసి, వాతావరణం తనే పాడుచేశాడు.

మెల్లిగావెళ్ళి కల్యాణి భుజంమీద చెయ్యివేశాడు....కల్యాణి తిరిగి చూడలేదు.

"అప్పుడే కోపం? మరింత అందంగా వున్నావు సుమా!" అంటూ ఆమెను బలవంతంగా తనవేపు తిప్పుకున్నాడు.

కల్యాణి మాట్లాడలేదు. "నేను రాగానే, నువ్వు అలుగుతావు. నీ అలక తీరేసరికి నాకు ఫోన్‌కాల్ వస్తుంది. ఇక మనిద్దరి మూడ్స్ సరిగా వుండే దెప్పుడో?" ఉపేంద్ర మాటలకు కల్యాణి కోపం ఇట్టే ఎగిరిపోయింది

"నేనీరోజు మహిళామండలి మీటింగులో అద్భుతంగా మాట్లాడానని అందరూ ప్రశంసించారు" అంది ఆ రాత్రి కల్యాణి, ఉపేంద్ర పక్కన కూర్చుంటూ.

"వెరీగుడ్! టాపిక్ ఏమిటి? పురుషజాతి మీద దండయాత్రేనా?" నవ్వుతూ పట్టుకుచ్చులాటి ఆమె జడ కొసలు గుప్పెట్లోకి తీసుకు అడిగాడు ఉపేంద్ర.

"అవును—అర్థంలేని సిద్ధాంతాలతో పురుషుల కాళ్ళ కింద పురుగుల్లా నలిగిపోవద్దని హెచ్చరించాను. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు నిలుపుకోమని ప్రబోధించాను!"

కల్యాణివేపు స్మితనయనాలతో చూశాడు ఉపేంద్ర. మనోహరమైన రంగుతో వెలిగిపోతోంది కల్యాణి ముఖం.

"ఇంకేం! ఒక్కసారిగా, నీ నాయకత్వంలో, మహిళలంతా, తమ భర్తల మీద-పురుషజాతి మీద-ఓ చిన్నసైజు సిపాయికలహంలాటి విప్లవమేదో లేవదీస్తారన్నమాట!"

ఆమె చుట్టూరా తన చేతులు పెనవేస్తూ నవ్వాడు ఉపేంద్ర. "బంగారు కల్యాణీ! ఉపన్యాసాలతో, వ్యాసాలతో స్త్రీ స్వరూపాన్నీ, స్వభావాన్నీ మార్చగలవా? పురుషునిలా మారాలని ఏవో వెర్రిమొర్రి వూహలు పెట్టుకుని, సహజమైన స్త్రీత్వాన్నీ, విలువలనూ పోగొట్టుకుంటున్నారు చాలామంది స్త్రీలీనాడు. కొత్తగా మార్పు చెందుతున్న ఈ స్త్రీల స్వరూపం, మీసాలు మొలచిన స్త్రీ ముఖంలా వికృతంగా తయారౌతోందన్న నగ్న సత్యం చాలామంది గుర్తించటంలేదు. నిజానికి పురుషునికంటె స్త్రీ సృష్ట్యాదినుంచీ ఉన్నతస్థానంలోనే వుంది. అందుకే పరమపవిత్రమైన సృష్టిబాధ్యత ఆమెపై వుంచాడు సృష్టికర్త. కాని అర్థంచేసుకోలేక అనవసరంగా ఆవేశపడి, ఏవో హక్కులనీ, స్వాతంత్ర్యమనీ వెర్రెత్తిపోతున్నారు స్త్రీలు. దురహంకారంతో ఆ ఉన్నతస్థానంనుండి తమంత తాముగా దిగజారిపోతున్నారు—"

"అయితే ఈనాడు స్త్రీలందరూ పురుషులతో సమానమైన హక్కులు అనుభవిస్తున్నారంటారా?"

'అదే పొరబాటు కల్యాణీ! హక్కులూ, నినాదాలతో సృష్టి వడవదు. కాలానుగుణంగా పరిస్థితుల్నిబట్టి, స్త్రీ పురుషులు ఒకరి కొకరు లొంగివుండటమూ, ఒకరినొకరు గౌరవించుకోవడమూ జరుగుతూంటుంది."

"లేదు....లేదు. అలా జరగటంలేదు ఏనాడూ! ప్రతి చోటా ప్రతివిషయంలోనూ పురుషుడే తన ఆధిక్యాన్ని,అధికారాన్ని చూపు కుంటున్నాడు...."కల్యాణి ఆవేశంగా తల విదిల్చింది."సాయంత్రం చూడండి. మీ రొచ్చేసరికి నేను మనోహర్‌తో మాట్లాడుతున్నానా? ఒకవేళ నేను ఇంట్లోలేని సమయంలో మీకోసం ఎవరేనా స్త్రీ వచ్చి, మీతో మాట్లాడుతుందనుకుందాం. సాయంత్రం మీరు నా విషయంలో చేసినంత యాగీ నేను చేయగలనంటారా? నేనే కాదు, యే స్త్రీ చేయలేదు. చేసినా పురుషుడు సహించడు. ఇది కాదంటారా?"

సాయంత్రం సంఘటనను గురించి కల్యాణి ఇంత తీవ్రంగా లోలోపల ఉడికిపోతోందని ఇప్పుడర్థమైంది ఉపేంద్రకు.జాలిగా ఆమె వేపు చూశాడు. "నిన్ను అనుమానించటంలేదు. నీ మీద అపనమ్మకమూ నాకు లేదు కల్యాణీ! మనోహర్ మంచివాడు కాడు. అతను జులాయి మనిషి. అతగాడు తరచూ మనయింటికి రావటం, నువ్వు అతనితో మాటలూ, స్నేహం పెంచుకోవటమూ మంచిది కాదని నా ఉద్దేశ్యం.

"నే నెలాగో సర్దుకుపోగలిగినా, చుట్టుప్రక్కలవారి దృష్టిలో నువ్వు చులకన కావటం, నీతో మనోహర్ గురించి కొంత చర్చ రేగటం నా కిష్టంలేదు. అలాటి అనవసరమైన, నిరాధారమైన నిందలకు మనంత మనంగా ఎందుకు అవకాశ మివ్వాలి? ఒక వ్యక్తి హృదయమూ, ప్రవర్తనా మంచిదైనంత మాత్రాన చాలదు. అలా నలుగురికీ రుజువు చేసుకో గలిగినప్పుడే ఆ వ్యక్తి సంఘంలో రాణిస్తాడు.

"ఇక అర్థం లేనిపోని వ్యాఖ్యానాలు చెయ్యకండి! అటు ఇటు తిరగా మరగా వేసి ఎన్నిమార్లు చెప్పినా, మీ మనోగత అభిప్రాయాలు నాకు కొత్తగాదు....బయటి ప్రపంచంతో, ముఖ్యంగా పరపురుషులతో నేను మాట్లాడడాన్ని మీరు సహించలేరు!" కోపంగా అంది కళ్యాణి.

"ఎలా అయినా అర్థం చేసుకో. కాని మనోహర్ లాటి షోకిలా వెధవ తరచూ మనింటికి రావటం. అతగాడితో నువ్వు బాతాఖానీ వేసుక్కూర్చోవటం నేను సహించలేను." అంటూ తనూ కోపంతో ఊగిపోయాడు ఉపేంద్ర.

"ఎలా సహించగలరూ! ఈ జన్మలో లేకపోయినా, క్రితం జన్మలో నయినా సంస్కారమూ, పై అంతస్తు మర్యాదలూ, వాటి వాసనేనా మీలో మచ్చుకైనా వుంటేగా? ఇలాటివారు విదేశాలకు వెళ్ళొచ్చినా, పుట్టిన గ్రామంలోనే జీవితాంతం వున్నా ఒక్కటే....!"

విసురుగా పక్క గదిలోకి వెళ్ళి తక్కున తలుపులు గడియ వేసుకుంది కల్యాణి.

ఉపేంద్ర గాఢంగా నిట్టూర్చాడు.

"మా కల్యాణికి ఆవేశం ఎక్కువ, ఆలోచన తక్కువ. ఎలా చూసుకుంటావో" అని రమేష్ ఆరోజు స్టేషన్‌లో తనతో చెప్పిన మాటలు పదేపదే గుర్తుకొచ్చాయి అతగాడి కా క్షణంలో.

# 15

చలిగాలికి మెల్లిగా తలలూపుతున్నాయి క్రోటన్స్. గులాబీల పరిమళం గాలిలో తేలి అలలు అలలుగా శరీరానికి తాకి గిలిగింతలు పెడుతోంది....సంధ్యారుణకాంతి చెవుల దుద్దులమీద పడి ప్రతిఫలిస్తోంది. రాధ తదేక ధ్యానంతో ఏదో వ్రాసుకొంటోంది.... ఐదారు నిముషాలుగా ఆమెనే గమనిస్తున్న రమేష్ మెల్లిగా చిరునవ్వు నవ్వుతూ, దగ్గరగా వచ్చాడు.

"ఏమిటి రాధా, వ్రాస్తున్నావ్?" అన్నాడు నవ్వుతూ.

భర్త కంఠస్వరం విని తలెత్తి చూసి, చప్పున కాగితాలూ "పెన్" పక్కనపెట్టి, సోఫాలో అతగాడికి చోటిచ్చింది రాధ.... "ఏదో కథ మొదలెట్టాను.........ఫేర్ వ్రాసుకుంటున్నాను!" అంది నవ్వుతూ.

"అబ్బ! ఇక వ్రాయటం ఆపెయ్యావోయ్. ఎంత అలసి పోయావో తెలుసా?" ఆప్యాయంగా ఆమె ముంగురులు సవరించాడు రమేష్.

రాధ నవ్వింది. వ్రాయటమైతే ఆపెయ్యగలనుగాని, బుర్ర ఆలోచించటంమాత్రం మానుకోదు. ఇక అలసటంటారా? ఆ అలసట పోగొట్టుకోవటానికి మీ సాన్నిధ్యాన్ని మించిన మాంచి టానిక్ మరోటిలేదు!"

"మీ రచయిత్రుల మాటలే తమాషాగా వుంటాయ్. పోనీ, ఒక టడుగుతాను చెప్పు రాధా! మన వివాహానికి ముందు, ఆర్థికంగా కొంత సాయంగా వుంటుందనే వుద్దేశ్యంతో రచనలు వ్రాసేదాని నంటూ చెప్పుకున్నావు, ఓసారి. గుర్తుందా? కాని ఇప్పుడు నీ కెలాటి ఇబ్బందీ లేదుగా? మరెందుకు వ్రాస్తున్నావ్? ఇంతగా కష్టపడు తున్నా వెందుకు?"

"అప్పుడలా వ్రాసేదాన్ని. కాని ఎప్పుడేనా, భావోద్వేగం లోపల అణుచుకోలేని స్త్రీ అయినా, పురుషుడయినా రచయితగా మారుతారు. నాకు మా పుట్టింట్లో చేతినిండా పని వుండేది. నౌకర్లు, చాకర్లు లేరు కాబట్టి, ఇంటిపనంతా అమ్మకు సాయంగా చూసుకొనే దాన్ని. ఎప్పుడో తీరిక చిక్కినపుడు గబ గబా రచనలు వ్రాసుకొనే దాన్ని....కాని ఇప్పుడు నేను శారీరకంగా ఎక్కువచేసే పనేముందీ? అస్తమానూ తీరికే. దాంతో మరింత ఎక్కువగా రచనల పని పెట్టు కున్నాను....చేతినిండా పనిలేని స్త్రీ అయినా, పురుషుడయినా, బద్ధ కస్తులుగా, అనవసరమైన ఆలోచనలు చేసేవారుగా తయారౌతారు."

"నువ్వు చెప్పింది నిజం రాధా! కాని నీ రచనల్లో, ఎక్కు

వగా, స్త్రీల హక్కులను గురించి పోరాడవేం? పురుషుని నీడలోనే స్త్రీ రాణిస్తుందనే విషయాన్ని పదే పదే చెబుతావేగాని. నువ్వూ స్త్రీ యుండీ స్త్రీ స్వాతంత్ర్యా న్నెందుకు ప్రోత్సహించవు? పురుషుల ందుకు నిరసించవు?" కుతూహలంగా అడిగాడు రమేష్.

రాధ నవ్వింది. "నేను స్త్రీ_నంత మాత్రాన, అనవసరంగా పురుష జాతిని దుయ్యబట్టాలని సిద్ధాంత ?? స్త్రీ పురుషు లిద్దరిలోనూ వారివారి స్వరూప, స్వభావ, వాతావరణాలనిబట్టి, క్రూరులూ, నియంతలూ, వ్యభిచారులూ, మంచివారూ వున్నారు. అలాంటప్పుడు ప్రత్యేకంగా ఒక జాతిని మరో జాతి దూషించటంలో అర్థముందంటారా? మన తరంలో స్త్రీల కేం? ఇంకా ఏం కోరాలి? విద్య, ఉద్యోగాలు, పౌరహక్కులూ, అన్ని విషయాలలో స్త్రీకి అన్నివిధాలా మంచిరోజులొచ్చాయి ఈనాడు! ఇంకా అవివేకంగా స్వాతంత్ర్యం అంటూ ప్రాకులాడడం తను కూర్చున్న చెట్టుకొమ్మను తానే నరికివేసుకోవటం లాంటిదే!

"ఇక పురుషుని నీడలో స్త్రీ రాణిస్తుందని నేను వ్రాస్తానని కదూ మీ ఆరోపణ? స్త్రీ స్వతస్సిద్ధంగా-శారీరకంగా, మానసికంగా-సుకుమారమైన లతలాంటిది. ఆ లత శోభాయమానంగా అల్లుకోవటానికి ఓ చేవగల ఆలంబన అవసరం. ఆ ఆలంబనే పురుషుడు. స్త్రీ పురుషు లిద్దరి ఆ చేరికలోనే సృష్టి అందం ఇమిడివుంది. ఇది అసహజమూ, అసంబద్ధమూ ఎలా అవుతుంది?

"తనను పెనవేసుకుని, తనను ప్రాణాధికంగా ప్రేమించే ప్రాణి ఒకటివుందని తెలుసుకున్న పురుషునిలోనే ఆత్మ విశ్వాసము ఏర్పడుతుంది. అంటే పురుషుని మనుగడకూ, మానసికమైన ప్రగతికీ స్త్రీ ఎంత అవసరమో చూడండి!

"ఇలా రెండువిధాలా స్త్రీ పురుషులు ఒకరిపరిధిలో మరొకరు రాణిస్తున్నారు. ఇదే యుగయుగాలుగా జరుగుతోంది, తరతరాలుగా సాగిపోతుంది కూడా."

రమేష్ ముగ్ధుడైపోయాడు. "ఊరికే నిన్ను కవ్వించటానికి

అడిగాను రాధా! కాని నీలో ఇంత విచక్షణ, విషయపరిశీలన ఉందని ఈనాడే కొత్తగా తెలుసుకున్నాను సుమా!"

"మీకు నా రచనలు నచ్చటంలేదా? లేక నేను వ్రాయటం ఇష్టంలేదా?" సూటిగా భర్త కళ్ళల్లోకి చూస్తూ అడిగింది రాధ.

రమేష్ బిగ్గరగా నవ్వాడు. "నా కెందు కిష్టంలేదు రాధా? హాయిగా అయాచితంగా అభినందనాలూ, ప్రశంసలూ నాకు లభిస్తుంటే? మొన్న నీమధ్య ప్రచురితమైన నీ రచన 'ఎండ మావులు'కు నేను ఊపిరితిప్పుకోలేనన్ని ప్రశంసలొచ్చాయంటే నమ్ము. అభినందనాలు తెలపటంతో ఆగక ప్రతిఒక్కరూ 'మీ ప్రోత్సాహం వుండబట్టే, మీ శ్రీమతిగారింత మంచి రచనలు వ్రాయ గలుగుతున్నారు' అంటూ నన్ను పొగిడేస్తున్నారు. కష్టం ఒకరిదీ, కీర్తి మరొకరిదీ కదూ?"

రాధ మెత్తగా నవ్వింది. భార్యాభర్తలు ఒకరి అభిరుచులను మరొకరు గుర్తించి, ప్రోత్సహించుకోకపోతే, ఇరువురిలోని కళా ప్రతిభా అడుగంటిపోతుంది త్వరలోనే. ఒక వ్యక్తిలో నిగూఢమై వున్న కళ ప్రక్కవారి ప్రోత్సాహంతోనే పైకివస్తుంది."

"నారాధా! కోటిజన్మల అదృష్టఫలం, భగవంతుడు నిన్ను నాకిచ్చిన వరం!"

ఆనందాతిశయంతో రాధను దగ్గరకు తీసుకున్నాడు రమేష్.

"నేనూ అలాగే అనుకుంటున్నాను." అతగాడి హృదయంలో ఒదిగిపోయిన రాధ పెదవులు అస్పష్టంగా గొణిగాయి.

*

ఉషఃకాంతి నలుదిశలా వ్యాపిస్తోంది. విడీవిడని మొగ్గలు కొన్ని ఏదో ఆతురతతో పూయడానికి సిద్ధపడుతున్నాయి. విరిసిన పూలనుంచి కమ్మని పరిమళం గాలిలో తేలివస్తోంది. ప్రభాత ప్రకృతి మనోజ్ఞ రూపమది. ఆనందించగల హృదయమున్నవారికి, హత్తుకు పోగల అపురూప వాతావరణమది.

"త్వమేవ మాతాచ, పితా త్వమేవ
త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ

త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవదేవః''

పూజామందిరంలోనుంచి సుశీల కంఠస్వరం కోమలంగా, మంద్ర మంద్రంగా, గాలిలో తేలితేలి వినిపిస్తోంది. సావిత్రమ్మ హృదయం బరువెక్కిపోయింది.

''త్వమేవ సర్వం మమ దేవదేవః''

ఎంతటి ఆత్మార్పణ! ఎంతటి నిశ్చల నిర్లిప్తత! ఎంతటి ప్రగాఢ విశ్వాసం!

సుశీల కంఠస్వరం మంద్ర మంద్రంగా వినిపిస్తున్నదల్లా ఠక్కున ఆగిపోయి, మరునిముషంలో, హారతిపళ్ళెం ఠంగున క్రింద పడిన చప్పుడయింది. త్రుళ్ళి పడింది సావిత్రమ్మ. కంగారుగా పూజా మందిరం దగ్గరకు పరుగెత్తి, లోపలికి చూచి నిశ్చేష్టురాలైంది.

ఎదరగా పూజాపీఠం మీద, అగరువత్తుల ధూపంలో, దీపారాధన వెలుగులో శ్రీ వేంకటేశ్వరుని చిత్రపటం దేదీప్యమానంగా వెలిగిపోతోంది. హారతిపళ్ళెం దూరంగాపడి దొర్లుతోంది. సుశీల అచేతనంగా బోర్లా పడివుంది.

సావిత్రమ్మ కేకతో నౌకర్లు పరుగెత్తుకు వచ్చారు. త్వరగా డాక్టర్ని పిలుచుకు రమ్మని పురమాయించింది, కర్తవ్యం బోధపడిన సావిత్రమ్మ.

''డాక్టర్! ఎవరో పేషెంటు ప్రమాదకర పరిస్థితిలో వుందిట. ఓ నౌకరు వచ్చాడు ... ఇంటి యజమాని ఇంట్లోలేడని, ముసలితల్లి, ఉన్నపళాన డాక్టర్ని పిల్చుకురమ్మని చెప్పి పంపిందిట. ఫీజు ఎంతయినా యిచ్చుకోగల స్తోమతు గలవారేనట.''

సిస్టర్ విజయమాటలకు,భాస్కర్‌తో మాట్లాడుతున్న ఉపేంద్ర కంగారుగా లేచాడు.

''నేనూ రావొచ్చా?'' అడిగాడు భాస్కర్.

''ఊఁ''

విజయ మెడికల్ చెస్ట్ పట్టుకు వచ్చి కారులో పెట్టింది....

ఉపేంద్ర, భాస్కర్, విజయలు కారెక్కారు. డ్రైవర్ పక్కన కూర్చుని నౌకరు త్రోవ చూపాడు.

రోగిని పరీక్షించి, తేలికగా ఊపిరి పీల్చుకున్నాడు ఉపేంద్ర ....దుఃఖిస్తున్న సావిత్రమ్మ వేపు తిరిగి "గాభరాపడకండి ...ఆవిడ కేమీ కాలేదు....హిస్టీరియా ఫిట్స్ ఇవి. ఇంతక్రితం మెప్పు డయినా ఇలా వచ్చిందామ్మా?" అని అడిగాడు.

సావిత్రమ్మ క్షణకాలం ఆలోచించి మెల్లిగా అంది: "ఆ: ఒక రెండు నెలల క్రితం కాబోలు....ఓ స్నేహితురాలితో మాట్లాడి, ఆ అమ్మాయిని పంపించేశాక, సోఫాలో జేరగిలబడి పోయింది....కాని త్వరలోనే తెలివి వచ్చింది. గాభరా పడుతున్న నన్నుచూచి.... 'ఏమిటో తలతిప్పినట్లయ్యిం దత్తయ్యా!' అంది....అంతే: మళ్లీ ఈరోజు...."

"విపరీతమైన మానసిక ఆందోళనవల్ల ఈ హిస్టీరియా వస్తుంది. సాధ్యమైనంతవరకూ, రోగి మనస్సు ప్రశాంతంగా వుండేలా చూసుకోవటమూ, అలాటి వాతావరణం కల్పించటమూ ముఖ్యం. మీకు ఇష్టమైతే, వీలుంటే, ఈ ప్రదేశం మార్చినా మంచిదే." డాక్టరుగా తను చెప్పవలసింది చెప్పి, మందులు వ్రాసి యిచ్చారు ఉపేంద్ర. సిస్టర్ విజయ సిరెంజిలోకి మందు ఎక్కించి ఇచ్చింది. ఉపేంద్ర ఇంజక్షన్ చేశాడు సుశీలకు.

"ఆహారం ఏ మివ్వమంటారు నాయనా?" అంది సావిత్రమ్మ.

"ఏ మిచ్చినా ఫర్వాలేదు. రోగి ఇష్టాన్నిబట్టి....అన్నట్లు మీ అబ్బాయిగారు రాగానే, ఓసారి నా డిస్పెన్సరీకి పంపండి... వారితో కాస్త మాట్లాడాలి" అన్నాడు ఉపేంద్ర, మెడికల్‌చెస్ట్ జిప్‌లాగి.

"ఆ: పంపిస్తాను ఫీజుకూడా అబ్బాయిచేతే పంపిస్తా న్నాయనా...."మరేదో చెప్పబోతున్న సావిత్రమ్మ మాటలకు అడ్డొ చ్చాడు ఉపేంద్ర...."బంధువుల దగ్గరకూడా ఫీజేమిటి పిన్నిగారూ!"

సావిత్రమ్మ ఆశ్చర్యపోయింది.

అందాకా మౌనంగావున్న భాస్కర్ నవ్వాడు. "అదేమిటి

పిన్నీ, అలా ఆశ్చర్యపడతావు? ఉపేంద్ర ఎవరని నీ ఉద్దేశ్యం?" భాస్కర్ బంధుత్వమంతా చెప్పాడు.

"అలాగా నాయనా? నాకు తెలీలేదు సుమా." అందావిడ నొచ్చుకుంటూ.

వరండాలోకి వచ్చిన ఉపేంద్ర,భాస్కర్‌లు ఎదురుగా వస్తున్న మనోహర్‌ను చూసి ఆగిపోయారు. ఎర్రని కళ్ళతో, బట్టలు నలిగి, రేగిన జుట్టుతో, నిర్లక్ష్యంగా వస్తున్న మనోహర్, ఎదురుగా డాక్టర్ ఉపేంద్రనూ, భాస్కర్‌నూ చూసి క్షణకాలం నివ్వెరపోయాడు. అంతలోనే చప్పున తన తడబాటును కప్పిపుచ్చుకుని నవ్వుతూ—

"అరె, డాక్టర్ ఉపేంద్ర! భాస్కర్! ఏదో త్రోవతప్పినట్టున్నారే. సుశీ! ఎక్కడున్నావ్? ఎవరొచ్చారో చూశావా? ఒరేయ్ శంభూ! త్వరగా పేము కుర్చీలు పట్రా." నానా హడావుడీ పడుతున్న మనోహర్ వేపు చిరాగ్గా చూశాడు ఉపేంద్ర.

"ఇప్పుడు మాకేం మర్యాదలవసరంలేదు మనోహర్! మీ మిసెస్‌కు హిస్టీరియా ఫిట్ వచ్చింది....మీ అమ్మగారు కబురంపిస్తే వచ్చాను."

మనోహర్ క్షణకాలం ధిమ్మెరపోయినట్లు చూశాడు.........వెంటనే కళ్ళల్లోకి నీళ్ళు రాకున్నా, ముఖానికి రుమాలు అడ్డుపెట్టుకుంటూ పెద్దగా ఏడ్చేశాడు. "మా సుశీకా? ఏమయింది? హిస్టీరియా ఫిట్ వచ్చిందా? ఎంచేత? డాక్టర్! ఎంత డబ్బయినా ఖర్చుచేస్తాను... నా సుశీకి పరిపూర్ణ ఆరోగ్యం ప్రసాదించండి....నా సుశీని నాకు దక్కనివ్వండి, డాక్టర్."

భాస్కర్, ఉపేంద్రా ముఖముఖాలు చూసుకున్నారు. కేవలం వంచనేగాక, ఆ వంచన తాలూకు నటనని ఇంత చక్కగా మనోహర్ అభినయిస్తుంటే, క్షణకాలం ఆ ఇద్దరికీ పాలుపోలేదు ఏం చెయ్యటానికీ.

"ఎక్కడుంది నా సుశీ?" విసురుగా లోపలి గదికేసి పరుగెత్తాడు మనోహర్.

గిరుక్కున తిరిగి మనోహర్‌ను వెంబడించాడు ఉపేంద్ర. చాంద్రీ మంచంమీద నీరసంగా పడుకుని వున్న సుశీల కొద్దిగా కనురెప్ప లెత్తి భర్తవేపు చూస్తోంది ...

"సుశీ! ఏమిటిది? ఏమయింది?" ఒక్క ఉదుటున సుశీల మంచం దగ్గరకు పరుగెత్తాడు మనోహర్.

గబుక్కున అతగాడి భుజంమీద చెయ్యివేసి ఆపాడు ఉపేంద్ర. "మిస్టర్ మనోహర్! ఆవిడ నిప్పు దేం గాభరాపెట్టకండి. ఆవిడకు ఎక్కువ విశ్రాంతి అవసరం. ముఖ్యంగా మానసికంగా ఆమె కెలాటి ఆందోళనా, అలసటా వుండకూడదు....వీలైతే, ఈ ప్రదేశమూ, వాతావరణమూ మార్చటం మంచిది." కటువుగా, మనోహర్ కళ్ళల్లోకి తీక్షణంగా చూస్తూ అన్నాడు ఉపేంద్ర.

క్షణకాలం, పట్టుబడిన దొంగలా,గిలగిలలాడాడు మనోహర్. మరు నిముషంలో సర్దుకుని "అలాగే డాక్టర్!"అన్నాడు.

కారు కదిలింది. "అప్రాచ్యుడు! వెధవనటనా, వీడూను" అస్పష్టంగా గొణుక్కున్నాడు భాస్కర్.

ఉపేంద్ర హృదయం కలతచెందింది. సర్వదుర్గుణ సంపన్నుడైన ఈ మనోహర్ భార్య ఆ సుశీల!ఇంద్రభవనంలాటి బంగళాలో, అత్యంత సౌఖ్యప్రదమైన జీవితం గడపటానికి కావాల్సిన అన్ని హంగులూ వుండికూడా, ఆమెకు మానసికంగా ఏలాటి శాంతీలేదు.

మనోహర్ లాటి భర్తను సహిస్తూ సంసారం చక్కదిద్దుకుంటున్న సుశీల సౌందర్యరాశి కాదా? ఆమెలో నిక్షిప్తమైయున్న అంతసౌందర్యాన్ని, మనోహర్ లాటి మూర్ఖుడు వెయ్యి జన్మలెత్తినా చూడలేడు.

"భగవాన్! ఆమె మనస్సుకు శాంతి చేకూర్చు!"

విశ్శబ్దంగా కళ్ళు మూసుకున్నాడు ఉపేంద్ర.

# 16

బట్టలబీరువా కర్టెన్ తొలగించిన కల్యాణి దృష్టి అనుకోకుండా ఎదర కన్పించిన దంతపు పెట్టెమీద పడింది. పెట్టెమూత తీయగానే, అందమయిన అందెలు ఆ కదలికకు ఘల్లుమన్నాయి. చాలారోజుల తర్వాత కల్యాణిలో నృత్యం చేయాలన్న కోరిక వువ్వెత్తుగా లేచింది కెరటంలా. అనుకోకుండా ఆనాడు ట్రెయిన్‌లో మనోహర్ నాట్యాన్ని, నృత్యకళను గురించి చేసిన సుదీర్ఘ చర్చ గుర్తుకు వచ్చింది. డ్రెస్ మార్చుకుని, కాళ్ళకు గజ్జలబెల్టు బిగిస్తుంటే, ఘల్లు ఘల్లు మంటున్న అందెలు ఆమె ఉత్సాహాన్ని యినుమడింప జేస్తున్నాయి. టేప్‌రికార్డర్ తెచ్చి, సరిజూసుకుంది....తిల్లానా వేసుకు చూసి, సంతృప్తిగా తిరిగి టేప్ సరిగా చుట్టేసింది. "వండ్రఫుల్! అందాలు చిందిస్తున్నావ్. అందాల నాట్యరాణి కల్యాణీ!" గది గుమ్మంలో నిల్చుని నవ్వుతున్న ఉపేంద్ర కంఠస్వరం విని తలెత్తి చూసిన కల్యాణి గాభరాపడిపోయింది. ఆమె కదలికకు కాలి అందెలు లయ కలిపాయి.

"మీ రెప్పుడొచ్చారు? చాలా త్వరగా పని అయిపోయిందే!" ఏమనాలో తోచక, కంగారు కణుచుకుంటూ అంది కల్యాణి.

"ఓ ఐదు నిముషాలక్రితం. ఒక్క ఆపరేషన్ కేసు మాత్రం వుందీరోజు. పేషెంటును ప్రిపేర్‌చేసి, ఆపరేషన్ థియేటర్‌లోకి తీసుకువచ్చారు సిస్టర్స్, మేల్ నర్సులూ. అతగాడు వుట్టినే గాభరా పడిపోయి, 'ఇప్పుడు ఆపరేషన్ చెయ్యొద్దు' అంటూ గోలమొదలెట్టాడు. భయంతో బ్లడ్‌ప్రషర్ కూడా ఎక్కువయిం దతగాడికి.

నేను ఆపరేషన్ విజయవంతంగా చేయగలిగినా, భయంతో అతగాడు కోలుకోలేడేమో అనిపించి, యీ రోజుకు మానేశాను.... పనితెమిలిపోయింది. అరె! అదేమిటి? గజ్జలు విప్పుతున్నా

"ఔనౌను!" తడబాటు అణుచుకుంటూ అన్నాడు మనోహర్ ....తర్వాత తేలిగ్గా నవ్వేస్తూ...."సుశీలకు మెంటల్ రెస్టు కేం లోటొచ్చిందో నాకు అంతుపట్టడంలేదు డాక్టర్! నిజానికి సాధారణస్త్రీ వూహకందనైనా అందని అన్నిరకాల అవకాశాలూ, ఆనందాలూ సమకూర్చాను. అయినా ఏవో లేనిపోని ఆలోచనలూ, ఆందోళనలూ పెట్టుకొని జబ్బు కొని తెచ్చుకొనే వారి నేమనాలి? అదోరకమైన మానసిక బలహీనత—ఊఁ, సర్లెండి! నాలుగైదు రోజుల్లో సుశీలను తిరుపతి తీసుకు వెళ్ళబోతున్నాం. ఈ మధ్యనే అక్కడో చిన్న బంగళా కొన్నాను, నా వ్యాపార సౌలభ్యం కోసం. కొద్ది రోజుల పాటు సుశీలనూ, మా అమ్మనూ అక్కడే ఉంచాలని నిశ్చయించుకున్నాను. మా శ్రీమతికి దేవుడి పిచ్చికూడా కాస్త హెచ్చుపాలులోనే వుంది లెండి. రోజూ ఆ దేవుడిని కళ్ళారా చూస్తుంటేనైనా కొంత ప్రశాంతత చిక్కుతుందేమో తనకని నా ఆశ."

"ఉఁహూఁ."

"ఈ గొడవలకేం గానీండి, చొరవచేసి చెబుతున్నందుకు మరోలా అనుకోకండి డాక్టర్! కల్యాణిగారు నాట్యం కోసమే పుట్టారో, లేక నాట్యమే వారి కోసం పుట్టిందో అనే సందేహం వస్తోంది నామట్టుకు నాకు. ఏదేనా ఓ కళలో ప్రావీణ్యం సంపాదించటం సామాన్యమైన విషయం కాదు. ఆ కళ ఒక్కొక్కరికి భగవంతుడు ప్రసాదించే దివ్యవరం, బర్త్‌గిఫ్ట్!" వింటూన్న ఉపేంద్ర ముఖంలో రేఖా మాత్రపు చిరునవ్వుకూడా వెలగలేదు. కాని కల్యాణి కళ్ళు ఆనందంతో మెరిసి పోవటం మనోహర్ గమనించకపోలేదు.

"ఇంత చక్కగా నాట్యం చేయగల మీరు ప్రదర్శన లెందుకివ్వరో నాకు బోధపడటంలేదు కల్యాణీగారూ! చదువుకున్నవారూ, ధైర్యం కలవారూ, ఆర్థికంగా ఉన్నత స్థాయిలో వున్నవారే ఇలా కళల్ని మరుగు పరిస్తే, ఇక సామాన్య మానవులు కళలను గుర్తించగలిగే దెప్పుడు? రోజురోజుకూ మన దేశంలో కళల విలువ తగ్గిపోతోంది డాక్టర్!"

"మనోహర్! తీవ్రంగా కంపించింది ఉపేంద్ర కంఠస్వరం.

"కేవలం కళ అనేది ప్రదర్శనా వస్తువనే దృష్టితో చూడటమే అర్థంలేని విషయం. ప్రదర్శన లిప్పిస్తేనే నాట్యకళను అర్థం చేసుకొన్నట్లనే క్రొత్త సిద్ధాంతం నేనిందాకా వినలేదు కూడా. కల్యాణీ! చీకటి పడబోతోంది....లోపలికి వెళదాం పద....మనోహర్! నే వ్రాసిచ్చిన మందులే వాడం డావిడకు....నామీద నమ్మకం లేకుంటే మరో డాక్టర్ దగ్గరకు తీసుకెళ్ళండి."

విసురుగా వెడుతున్న ఉపేంద్ర కేసి చూస్తూ, నిర్లక్ష్యంగా ఓ చిరునవ్వు విసరి, వెళ్ళిపోయాడు మనోహర్. ఉపేంద్రను అనుసరించింది కల్యాణి. మనోహర్‌మీద అతగాడికున్న అసహ్యానికి చిహ్నంగా శాండల్స్ చప్పుడు తీవ్రమైంది.

మేడమీదకు వచ్చీ రాగానే, గట్టిగా కేకలేశాడు ఉపేంద్ర.

"నీ ప్రవర్తన నాకేం బాగాలేదు కల్యాణీ! అలాటి సమయంలో వివేక రహితంగా వచ్చిన అతగాణ్ణి అంతగా ఆహ్వానించాల్సిన అవసర మే మొచ్చింది నీకు?"

"మీ ప్రవర్తన కూడా నాకేం నచ్చలేదు. ఎప్పుడతగాడు కంటబడినా ఎందుకలా రెచ్చిపోతారు? తన భార్య అనారోగ్య విషయం చెప్పటానికి వచ్చిన అతగాణ్ణెందుకలా కసురుకున్నారు?నా నాట్యాన్ని గురించి అతగాడు మెచ్చుకున్నాడని అసూయా? అవునా? ఇంటి కొచ్చిన మనిషిని గౌరవించేపాటి సభ్యత మీరెప్పు డలవరచు కొంటా రింక?" తీవ్రంగా అంది కల్యాణి, గజ్జలు విప్పి, సొరుగులో పడేస్తూ.

"రౌడీ వెధవలందర్నీ గౌరవించే పాటి సభ్యత నాలోలేదు. ఇకమీద రాదు....నీలా!"

"చివరి నీలా", అనే ఒక్కమాటా కల్యాణి హృదయానికి గాలమై తగిలింది. ఆమె అభిమానం ఒక్కసారిగా పొంగింది.

"ఇంత అర్థంలేని ఉద్దేశ్యాలున్నాయని, మన పెళ్ళికి ముందే మీరు మా అన్నయ్యతో చెప్పారు కారేం?"

"ఓ అన్నయ్యకు చెప్పలేదు. చెప్పాల్సిన అవసరమూ నాకు రాలేదు. వివాహం కాగానే నీతో చెప్పానుగా నా ఉద్దేశాల గురించి ....మరో తెలివి గల గృహిణే అయ్యుంటే నా భావాలు అర్థం చేసు కొని సంసారాన్ని స్వర్గం చేసుకొని వుండేది!" ఉపేంద్ర మాటలు కల్యాణికి చెంపలమీద ఛెళ్ళుమని కొట్టినట్లయింది.

"మరో తెలివిగల భర్త అయ్యుంటే ఇంత జుగుప్సాకరంగా ప్రవర్తించి, అపురూపంగా చూసుకోవలసిన భార్యను ఏదో ఓసాకుతో బాధించి, సంసారాన్ని చేజేతులా నరకం చేసుకోడు....నడుమంత్రపు సిరి అయితే వచ్చింది కాని, సభ్యతా, సంస్కారమూ ఎలా ఒంట పడతాయి!"

విసురుగా మేడదిగి వెళ్ళిపోయింది కల్యాణి. ఆమె నోటి నుంచి వచ్చిన చివరి శరాఘాతానికి తట్టుకోలేక నిశ్చేష్టుడై నిల్చుండి పోయాడు క్షణకాలం ఉపేంద్ర ..

రాత్రి పొద్దు పోయేంతవరకూ కనిపెట్టుకుని ఉండిన మంగమ్మ "ఓహ్! ప్రణయ కలహం అనుకున్నాను....కాని ఇద్దరికిద్దరూ తిండి తినకుండా పడుకున్నారే" అని సణుక్కుంటూ, అలాగే నడుం వాల్చింది.

# 17

ఉదయాన్నే నిద్రలేచిన కల్యాణికి, ఏదో అర్జంటు కేసు రావటంతో ఉపేంద్ర డిస్పెన్సరీకి వెళ్ళిపోయాడని తెలిసింది. ఆ మధ్యాహ్నమంతా మనోహర్ ఇచ్చిన నవలలు చదవటంతో గడిచి పోయింది.

రాత్రి ఉపేంద్రతో ఘర్షణపడిన తర్వాత మనస్సంతా చికా కుగా వుంది.

ఒక దాన్లోంచి మరో విషయంలోకి,కళ్ళెం వదిలిన గుర్రాల్లా ఆలోచనలు దూకిపోతున్నాయి.

టెలిఫోన్ గణగణ మోగింది. పక్కమీద పడుకునే, బద్ధకంగా రిసీవర్ అందుకుంది కల్యాణి.

"కల్యాణీ! ఓ కల్యాణీ దేవిగారూ! వినిపించటంలే?" ఉపేంద్ర గొంతు హుషారుగా పలుకుతోంది. ఆశ్చర్యంగా అలాగే క్షణకాలం వుండి పోయింది కల్యాణి.

"ఏం చేస్తున్నావ్ కల్యాణీ?" మళ్ళీ అలాగే అడిగాడు ఉపేంద్ర.

"డాన్స్ చేస్తున్నా! ఏమి టా హడావుడీ? ఇక్కడే వున్నానండీ!" నవ్వుతూ అంది కల్యాణి.

"త్వరగా తయారవు. నాకూ ఆట్టే పనిలేదు, స్టార్ థియేటర్‌లో కొత్త ఇంగ్లీష్ పిక్చర్. ఈ రోజే ఆఖరుట.... వెళ్దాం.... మరి చప్పున రెడీగా వుంటావు కదూ!"

"అబ్బో! ఇహప్రపంచంలోనే వున్నారన్నమాట! పేషెంట్లూ మందులూ, కత్తులూ, కటార్లేగాక. సినిమాలు. ఇల్లాలు, ఇల్లూ వగైరాలు కూడా ప్రపంచంలో వున్నాయనే సంగతి గుర్తుకొచ్చినట్లుంది డాక్టరుగారికి!" వేళా కోళంగా నవ్వుతూ అంది కల్యాణి.

"అదో! అలాటి నిష్ఠూరాలే వద్దన్నాను!" ఉపేంద్ర కంఠ స్వరాన్నిబట్టి. అతగాడి బుంగమూతి ఊహించుకో గలిగిన కల్యాణి కిలకిల నవ్వింది.

"రాణీగారికి ఆనందం ఎక్కువై పోతోందే? అరుగంటలకల్లా వచ్చేస్తాను....అదేదో కార్టూన్‌లోలా, నీ మేకప్ తెమలాలి ఆసరికి నీ బర్త్‌డేకు నేను బహుమతిగా తెచ్చిన గులాబి రంగు షిఫాన్ చీర అదే రంగు బ్లౌజు, కెంపుల నెక్‌చైన్...." ఉత్సాహంగా చెబుతున ఉపేంద్ర కంఠం తక్కున ఆగింది....అవతల రిసీవర్ పెట్టేసి చప్పుడూ తెలిసింది.

"భలేవారే! సగం మాట్లాడుతూనే మానేశారు."

కుంటూ, ఒళ్ళు విరుచుకుని, హుషారుగా లేచి కూర్చుంది కల్యాణి. ఒకోసారి తనకు భర్తమీద ఎందుకంత కోపం వస్తుందో అర్థం కాలేదు. అదేమిటో 'భర్త' అనే ఆ రెండక్షరాలలోనే, ఏదో తెలియని తియ్యదనం నిండివుంది. తను ఎన్ని ఉపన్యాసాలు చెప్పినా, ఎంత పట్టుదల కలిగివున్నా. సృష్టిలోని అర్థంకాని రహస్యాలలో ఇదీ ఒకటేమో!

ఆరుగంటలకు ఐదునిముషా లుండగానే, అలంకరణ పూర్తి చేసుకుని, వరండాలో పచార్లు చేస్తోంది కల్యాణి. చీరె, జాకెట్, గులాబి రంగువే ధరించింది. విడుపాటి కురుల్ని 'రింగ్' సాయంతో అందంగా చుట్టగా అమర్చి, ముత్యాల పిన్నులు పెట్టింది. జంటగా పూసిన రెండే రెండు గులాబీలు తలలో ఓ పక్కగా అలంకరించుకుంది. కెంపుల రింగులు, కెంపుల గాజులు, కెంపుల నెక్లెస్ ధరించింది....

ఆరుదాటినా ఉపేంద్ర జాడలేదు. ఉస్సురుమంటోంది హృదయం....

నిముషాలు గడిచేకొద్దీ నిరుత్సాహం ఆవరిస్తోంది. ఏదయినా అనుకోకుండానే వుండాలి—తీరా ప్రోగ్రాం వేసుకున్నాక మధ్యలో ఏదేనా ఆటంకం వస్తే మాత్రం తను సహించలేదు.

గణగణ మోగుతున్న టెలిఫోన్ కేసి క్షణకాలం చిరాగ్గా చూసి రిసీవర్ చేతిలోకి తీసుకుంది కల్యాణి.

"కల్యాణీ! వెరీ సారీ! తీరా డిస్పెన్సరీ బయటికి వచ్చానో లేదో, ఓ కాన్పు కేసు వచ్చింది....నీ ఉత్సాహాన్ని భంగం చేయాల్సి వచ్చినందుకు చాలా బాధగా వుంది నాకు. ప్లీజ్! నిరుత్సాహపడకు! ప్రస్తుతం రెండు ప్రాణాలతో, దైవసంకల్పంతో హోరా హోరి పోరాడుతున్నాను....నే నిప్పుడు రాలేను. వీలైతే సెకండ్ షోకు వెడదాం...." అవతలనుంచి ఉపేంద్ర కంఠం ప్రాధేయపూర్వకంగా వినిపిస్తోంది.

కోపంగా రిసీవర్ పెట్టేసింది కల్యాణి. ఒక్కసారిగా తన

అలంకరణంతా, తనకే వెగటుగా తోచిన ట్లనిపించిందామెకు. హఠాత్తుగా, ఆరోజు మహిళామండలిలో తను మాట్లాడిన వాక్యాలు చెవుల్లో ప్రతిధ్వనించటం మొదలెట్టాయి.

"ఉదాహరణకు సినిమాకు వెళ్ళాలని ఓ భార్యకు కోరిక కలుగుతుం దనుకుందాం. ఎంతో గారాబంగా 'సినిమాకు వెడదాం రాండి!' అంటుంది భర్తతో. 'నాకు తీరికలేదు నువ్వెళ్ళు!' అంటాడు భర్త.... అదోరకమైన సవాలు. 'మీకు తీరికుంటే మీరు వుండండి. నేను నా స్నేహితురాలితో వెళ్ళొస్తాను' అని బయల్దేరి వెళ్ళాలి స్త్రీ........"

ఆరోజు తనంతగా వాదించింది నిజమే. కాని ఈరోజు ఎందు కింతగా బాధ పడుతోంది? ఆయనగారికి అస్తమానూ కేసులూ, పేషంట్ల గొడవే! ఇంత డబ్బు వుంది. యింకా వస్తోంది. ఈ ఒక్క కేసూ మరో డాక్టర్ దగ్గరికి పంపిస్తే ఏం మునిగి పోయింది? ఇందులో తన పురుషాహంకారాన్ని చాటుకొనే ఉద్దేశం వుందేమో? ఏమో?

"ఈ దుస్తులలో, ఈ అలంకరణలో మీరెలా వున్నారో చెప్పటం దుస్సాహసమే అయినా, ఓ స్నేహితునిగా, ఆ చనువు తీసుకోవటం తప్పుకాదనే నమ్మకంతో చెప్పేస్తాను....అరుణ సంధ్యలో అర విరిసిన గులాబి పువ్వులా వున్నారు" అంటూ మనోహర్ వరండా మెట్లెక్కి వచ్చాడు.

నిస్పృహతో నిలుచునివున్న కల్యాణి అతగాడి మాటలకు నవ్వబోయినా, నిండుగా నవ్వలేకపోయింది.

"అదేం కల్యాణిగారూ, అలా వున్నారు? ఒంట్లో కులాసాగ లేదా యేమిటి?" ఆదుర్దాగా అడుగుతూ సోఫాలో కూర్చున్నాడ మనోహర్.

"బాగానే వుంది."

"మరి? మీ వాలకం చూస్తుంటే, ఏదో ప్రోగ్రాం పెట్టుకుని వున్నట్లున్నారు. నన్ను చూడగానే 'ఇదెక్కడి పీడరా బాబూ! ఇక

న్నాణ్ణి వదిలించుకోవట మెలా?' అనుకుంటున్నట్లున్నారు, అవునా?''

కల్యాణి నవ్వేసింది అతగాడి మాటలకు. "అబ్బే! అదేం కాదండీ. మీ రాకవల్ల ఆటంకం రాలేదు లెండి." అని నిర్లిప్తంగా అంది కల్యాణి...."వారికేవో ఓ అర్జంటుకేసు అనుక్షణమూ ఉంటూనే వుంటుంది! అంచేత ఆగిపోయింది. కొద్దిగా ఉపేంద్రమీది అక్కసు వెళ్ళగక్కింది కల్యాణి.

"సినిమాకేనా? ఏ థియేటర్‌కు? ఇప్పుడేం మునిగిపోయింది? ఆరుంబావయింది. అంతగా అయితే న్యూస్ రీల్ పోతుంది. అంతే కదా? తీరా ఇంతా తయారై మీ రెండుకు మానెయ్యటం? నే వస్తా పదండి....వెళదాం....!" ఓరగా ఆమెవేపు చూస్తూ అన్నాడు మనోహర్.

కల్యాణి మాట్లాడలేదు క్షణకాలం.

"ఏమిటాలోచిస్తున్నారు? ఉపేంద్రగారు ఏమైనా అనుకుంటారనీ, అంటారనీ భయంగావుందా?" మనోహర్ కంఠస్వరంలో కొద్దిగా హేళన మిళితమై యున్నట్లు తోచింది కల్యాణికి....

"అబ్బే! అదేంలేదు...."

"మీ రారోజు మహిళామండలి మీటింగ్‌లో మాట్లాడిన మాటలు మరిచిపోయారా? ఎంతయినా స్వవిషయమంటారా?"కల్యాణి కేసి పరీక్షగా చూస్తూ అన్నాడు మనోహర్.

కోపంలో, హద్దులు మీరిన చికాకులో, మనుషులు స్వత స్సిద్ధంగా యుక్తాయుక్త విచక్షణ జ్ఞానాన్ని కోల్పోతారు. అలాటి సమయాలలో ఒక్కోసారి ఇతరుల మాటలు వారిలోని బలహీనతల్ని మరింతగా రెచ్చకొడతాయి. అణిగివున్న అహంభావాన్ని, అభిమానాన్ని కెలికి మరీ పైకి తీస్తాయి. మనోహర్ మాటలు కల్యాణి విషయంలో అదే పనిచేశాయి.

"తను రాలేమన్నారేగాఫీ, నన్ను వెళ్ళవద్దని శాసించలేదు వారు.. అలాటి చనువు వారి కివ్వలేదు కూడా" అంది కల్యాణి లోలోపల అభిమానాన్ని అణుచుకుంటూ.

"వెరీగుడ్! అలా వుండాలి. చెప్పేదొకటీ, చేసేదొకటీ అయితే, ఇతరులకు చెప్పబూనటం హాస్యాస్పద మౌతుంది....ఆ సంగతి మీకు తెలుసుననుకోండి....పదండి వెడదాం!"

బుకింగ్‌కేసి వెళ్ళిన మనోహర్ నిస్పృహగా తిరిగొచ్చాడు. "ప్చ్! ఒక్క టిక్కెట్టే దొరికింది. అన్నీ ఫిలప్ అయిపోయాయట" అన్నాడు బాధగా.

బయల్దేరినప్పుడున్న పంతమూ, కోపమూ ఈ నిముషంలో లేవు కల్యాణిలో. ఏదో చేయరాని పనిచేస్తున్నట్టుగా మనస్సు పెలిక పెడుతోంది. ఊళ్ళో వాళ్ళని ఉల్లిపాయలు తినొద్దని గురువుగారు సెల విచ్చాడేగానీ, తను తిననని చెప్పాడా? అలాగే, ఉపన్యాస వేదిక ఎక్కాక, ఆ నిముషంలోవున్న మానసిక స్థితినిబట్టి, ఎన్నోమాటలు మాట్లాడుతారు ఎవరేనా. అవన్నీ చేసి చూపాలంటే సాధ్యమౌతుందా? ఉపేంద్ర రాకుంటేనేం, సెకండ్‌షోకు వెడదామని ఎంతో ఇదిగా చెప్పారుకదా? ఈలోగా తనెందు కిలా రెచ్చిపోయింది? మనోహర్‌లో వున్న ఏ ఆకర్షణ శక్తి తన నిలా లాక్కువచ్చింది? ఆలోచనా రహితంగా తనెందుకు బయల్దేరి వచ్చింది?

తీరా ఉపేంద్ర ఇంటికివచ్చి, తనొక్కత్తే పిక్చర్‌కు వెళ్ళిందని తెలిసి ఎంత బాధపడతారు? అవమానించినట్లు లోలోపల కుంగిపోరూ?

ఆలోచిస్తున్న కల్యాణికి మనోహర్ ఒక్కటిక్కెట్టే దొరికిందని రావటంతో, ఏదో పెద్ద బరువు దించినట్లయింది.

"పోన్లెండి! నాకూ అంత ఉత్సాహంగా లేదు, పిక్చరూ మొదలెట్టారల్లేవుంది. మీరు పిక్చర్ కెళ్ళండి నేనింటి కెడతాను"

"అదేమన్నమాట! ఇంతదూరంవచ్చి, వెనక్కు తిరిగి వెళ్ళటమా? ఉన్న ఒక్క సీట్లో మీరెళ్ళి కూర్చోండి—పిక్చర్ వదిలే సరికి నేను గేటు దగ్గర వుంటాను. గాభరా పడకండి!"

క్రిక్కిరిసివున్న హాలు మధ్య సీట్లో కూర్చునివున్న కల్యాణిలో స్త్రీసహజపు అభిమానమేదో తలెత్తింది: ఇంతమందిలోనూ తను ఏకాకిగా వున్నదన్న భావన ఆమెకు ఊపిరి సలపనివ్వలేదు.

పిక్చర్ సగంకూడా చూడ లేకపోయింది. గభాలున లేచి హాలు బయటికి వచ్చేసింది. టాక్సీలో కూలబడి "పోనియ్" అంది.

ఇంట్లో అడుగెట్టేసరికి, ఇంకా ఉపేంద్ర ఇంటికి రాలేదన్న కబురు తెలిసింది. 'అమ్మయ్య' అనుకుంది కల్యాణి....మరో ఐదు నిముషాలలో కారు హారన్ వినిపించటం, ఉపేంద్ర లోపలికి రావటం జరిగాయి.

ఉపేంద్ర గబగబ కల్యాణి దగ్గరికి వచ్చాడు.

"సారీ కల్యాణీ! నిన్ను నిరుత్సాహ పరచాను కదూ? ఏం చెయ్యను చెప్పు. కోపం వచ్చిందా?"

లాలిస్తూ కల్యాణి చుట్టూ చేతులు పెనవేసి, హృదయానికి హత్తుకున్నాడు ఉపేంద్ర.

ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో అర్థం కాలేదు కల్యాణికి, అతను హృదయానికి హత్తుకునివున్న ఆ సమయంలో మొదటి సారిగా ఆమెలో ఏదో తప్పుచేశానన్న భావం తలెత్తి. ఆమెను తలెత్త నీయకుండా చేసింది.

"ప్లీజ్! అలా మూగనోము పట్టకు. సెకండ్ షోకు టిక్కెట్లు రిజర్వ్ చేయించాను....ఊఁ" ప్రేమార్ద్ర కంఠస్వరంతో ఉపేంద్ర అలా తన కళ్ళల్లోకి చూస్తుంటే, జరిగిన సంగతి తన కళ్ళు అతగాడికి చెప్పేస్తాయేమో అన్న భయంతో కళ్ళు వాల్చేసింది కల్యాణి.

# 18

"అక్కయ్యా! నువ్వెప్పుడొచ్చావ్ యిక్కడికి?"

కుసుమ ఆశ్చర్యంగా అడిగింది. ఆలయంలోకి వెడుతున్న సుశీలా, కారులో వెడుతున్న కుసుమా అనుకోకుండా ఎదురయ్యారు.

"నాలుగు రోజులైంది కుసుమా! ఏ రోజుకారోజు నీ దగ్గ

రకు వద్దామనుకుంటూనే, బద్దకిస్తున్నాను. నీ ఒంట్లో కులాసాగా వుందా?'' నిండుగావున్న కుసుమకేసి చూస్తూ అడిగింది సుశీల.

''రా వెళదాం'' అంటూ బలవంతంగా కార్లోకూర్చోబెట్టుకుని ఇంటికి తీసుకెళ్ళింది కుసుమ.

''అమ్మా! నా స్నేహితురాలొకమ్మాయి వచ్చింది. మేమిద్దరం మేడమీదకు వెళ్తున్నాం.'' జవాబు ఆశించకుండా, మేడమీదకు తీసుకెళ్ళింది కుసుమ.

''ఏమిటక్కయ్యా! పూచిక పుల్లలా ఇలా తయారయ్యావ్?'' అంది కుసుమ సుశీలకేసి పరీక్షగా చూస్తూ.

''నీకళ్ళ కలా కనిపిస్తున్నానంతే!'' మెత్తగా నవ్వింది సుశీల.

''ఊహూఁ, లేదు. నిజంగానే చాలా చిక్కిపోయావు. జబ్బు చేసిందా?'

''ఊఁ. తరచూ హిస్టీరియా ఫిట్స్ వస్తున్నాయి, అందుకే వాతావరణం మార్చాలన్నారు డాక్టరుగారు....అంచేత ఇక్కడికి వచ్చాము నేను, అత్తయ్యగారు. మనసులో రాని మార్పు, వాతావరణం మార్చడంతో వస్తుందంటావా చెల్లాయ్?'' సుశీల కంఠస్వరం ఆర్ద్రంగా మారింది.

ఈ సంగతి ఉత్తరాలలో వ్రాస్తేనేం?'' నిష్ఠూరంగా అడిగింది కుసుమ.

సుశీల నవ్వింది....''ఓవేపు నీ సమస్యతో నువ్వు సతమతమౌతుంటే, నా అనారోగ్యం సంగతి వ్రాసి నీకు మరింత బాధ కల్గింది. జెయ్యమంటావా?''

చాలాసేపు మౌనంగా గడిచి పోయింది....

''డాక్టర్ ఉపేంద్ర నీకు తెలుసా అక్కయ్యా?'' ఏదో ఆః చిస్తూ అడిగింది కుసుమ.

''ఆహా! నాకు అక్కడ ట్రీట్‌మెంటు ఇచ్చింది వారే. ఏం....

కాస్సేపు మౌనంగా వుండి మెల్లిగా అంది కుసుమ: డాక్టర్ భార్య కల్యాణి ...ఆవిడ అన్న రమేష్, వదిన రాధ ఇక్క

వున్నారు. ఆ కల్యాణిగారు చాలా అందంగా వుంటుందట కదూ?"

"అవును."

"నువ్వెప్పుడు చూశావు?"

"ఓసారి సినిమాలో చూశాను" అబద్ధం ఆడేసింది సుశీల.... గత సంఘటన తాలూకు స్మృతులేవో ఆమె హృదయాన్ని తొలు స్తున్నాయి.

"ప్రస్తుతం మన శ్రీవారు ఆవిడ వేటలో వున్నారట గదా?" గొంతు తగ్గించి రహస్యంగా అంది కుసుమ. సుశీల క్షణకాలం కుసుమకేసి ఆశ్చర్యంగా చూసింది.

"ఏమిటి?"

"నిజంగా తెలీకే అడుగుతున్నావా అక్కయ్యా?"

"ఊఁ"

"నాకు పార్వతి ఉత్తరం వ్రాసింది."

"పార్వతెవరు?" చిత్రంగా చూస్తూ అడిగింది సుశీల.

"అక్కడి మహిళామండలి మెంబరు ...కాని ఉత్తమ గృహిణి....నా స్నేహితురాలు....ఆవిడ ఉత్తరం వ్రాసింది నాకు. ఇదిగో యీ పెడ చదువు."

రి

అ సుశీల ఉత్తరం అందుకుని చూసింది. కుసుమా! పాపం
గా|ల్యాణి స్వతహాగా మంచి మనసుగలదే. కాని, మనోహర్ అలాటి
"డని తెలియక ఏదో భ్రమలో, అతగాడిని ఓ స్నేహితునిగా స్వీకరిం
ంది....ఒకటి రెండుమార్లు నేను మెల్లిగా హెచ్చరించాను....కల్యాణి
రూ! మన మండలికి పేట్రన్ అని ఏదో ఓహో అంటే ఓహో అన
మీగాని అంత చనువుగా మెలగనివ్వవలసిన వ్యక్తికాదు మనోహర్
న్నాను. ఆవిడ నన్ను దులిపేసింది, మీరూ మీ బూజుపట్టిన భావా
"లూనూ అంటూ. పాపం ఏ అగాధాల్లో పడిపోతుందో అమాయికు
ం అని చనువు తీసుకున్నందుకు మాబాగా బుద్ధి చెప్పిందను
సుశీల ! లెంపలు వాయించుకున్నాను—కాని నా కీనాడూ జాలే ఆవిడను
స్తే. డాక్టరుగారికీ కల్యాణికీ మధ్య రోజురోజుకూ మనస్పర్ధలు

యెక్కువయి పోతున్నాయనీ, ఆనందంగా ఉండవలసిన ఆ చిన్న జంట మనోహర్‌ను గురించి అస్తమానమూ కీచులాడుకుంటున్నారనీ మా ఇంటి పక్కనే వుండే వాళ్ళ వంటమనిషి మంగమ్మ చెబుతోంది ....పోనిద్దూ....నాకెందుకీ గొడవలన్నీ....'

"ఏం వ్రాసిందో చూశావా అక్కయ్యా! ఇలా ఎందరి జీవితాలు నాశనం చేస్తారో శ్రీవారు!" అంది కుసుమ.

సుశీల చాలాసేపు మాట్లాడలేదు.

"అక్కయ్యా! శ్రీవారి నొక్కరినే తిట్టుకునీ లాభంలేదని పిస్తోంది నామటుకు నాకు. స్త్రీ విచక్షణ జ్ఞానం కోల్పోయి, అవకాశం ఇస్తే, ఉపయోగించుకోని పురుష దెవడుంటాడు? నూటికీ కోటికీ ఒకరో ఇద్దరో ఉంటారేమో. నామట్టుకు నేను ఏం చేశానో చూడు.... నమ్మి శరీరం అర్పించటం తప్పు కాదంటావా? అలాగే ఆ కల్యాణి కూడా...ఏదో భ్రమలో శలభంలా పడిపోబోతుంది....మనమేం చేసాం?"

చీకటి పడుతూండగా ఇంటికి తిరిగివచ్చిన సుశీల కిక భోజనం సహించలేదు....పక్కమీద పడుకుందేకాని కునుకు రాలేదు.

కల్యాణి....కల్యాణి...కల్యాణి,...

ఆమె చుట్టూరానే సుశీల ఆలోచనలు పరుగులు తీస్తున్నాయి. సరిగ్గా నెలరోజుల క్రితం...ఆరోజు మనోహర్ రూం చిందరవందరగా వుంటే, సర్దించాలని వెళ్ళింది తను,...టేబిల్‌మీద పుస్తకాలు నానా రభసగా పడివున్నాయి. ఒకటొకటిగా జాగ్రత్తగా సర్ది పెడుతోంది. హఠాత్తుగా ఓ ఫోటో జారి కిందపడింది...జాగ్రత్తగా తీసి చూసింది. డాన్స్‌పోజ్‌లో వున్న ఓ నర్తకీమణి...ఫోటో వెనక "అందాల నాట్యరాణి కల్యాణి" అని వ్రాసివుంది మనోహర్ దస్తూరితో. "ఎవరో ఈ నాట్యరాణి...." అని లోలోపల నవ్వుకుంటూ ఫోటో పుస్తకంలో పెట్టేసిన తన కళ్ళు, తెరచివున్న మనోహర్ డైరీమీద పడ్డాయి.... అనుకోకుండానే ఆమె కళ్ళు ఆ అక్షరాల వెంట పరుగులు తీశాయి........

"ట్రెయిన్‌లో డాక్టర్ ఉపేంద్ర భార్య కల్యాణితో మాట్లా వాను....ఆమెలోవున్న బలహీనతేదో నాకు ఒక్కసారిగా తెలిసి పోయింది...,అంత సౌందర్యరాశి అయిన స్త్రీని ఇంతవరకూ నేను కలుసుకోలేదు. ఒక్కసారి....ఒక్కసారి ఆమెను....తీవ్రవాంఛ నాలో చెలరేగుతోంది....కాని గౌరవ కుటుంబానికి చెందిన స్త్రీ.... నా కోర్కె ఇదని తెలిస్తే, పళ్ళు రాలగొడుతుందని నాకు తెలుసు.... అంచేత అపాయంలేని మార్గం తొక్కుతున్నాను...."

సుశీల నిట్టూర్చింది....

"నా విషయంలో డాక్టరుతో ఘర్షణ పడినట్లుంది కల్యాణి. ఫర్వాలేదు....నా మార్గం నిరాటంకంగా సాగుతోంది....ఈ రోజు ఫోటో ఆల్బం చూపించింది....ఆ ఆల్బంలో కుసుమ ఫోటోను చూసి హడలిపోయాను క్షణకాలం....నా గుట్టు బయటపడుతుందేమో అని బేజారెత్తిపోయాను...,కాని కల్యాణి కివేం తెలివు. ఉట్టి అమాయికు రాలు! నేకోరగానే తన ఫోటో-డాన్సు ఫోజులో వున్నది-ఇచ్చేసింది. ....ఎందుకైనా అక్కరకు వస్తుందని దగ్గరుంచాను....పిక్చరుకు వెళ్ళటానికి తయారై, డాక్టర్ రాకపోవడంతో,హతాశురాలై వుం దీ రోజు కల్యాణి నే వెళ్ళేసరికి. ఎలాగో ఆమెను రెచ్చగొట్టి, కారులో తీసుకువచ్చాను పిక్చరుకు....త్రోవలో కారు డ్రైవ్ చేస్తున్నంత సేపూ, మెదడు ఈ అవకాశం జారవిడుచుకోవద్దని హెచ్చరిస్తూనే వుంది....కాని నా దురదృష్టం! హాలు నిండిపోయి, ఒకేఒక సీటు ఖాళీగా వుంటంతో, ఆవిడను పిక్చర్లో కూర్చోబెట్టి వచ్చేయాల్సి వచ్చింది...."

సుశీల గాఢంగా నిట్టూర్చింది....

"ఏం సుశీ! నా డైరీ చదువుతున్నావా? అందువల్ల నీకు ఆనందంకంటే బాధే ఎక్కువగా కలిగివుండాలి? అవునా?"

గది గుమ్మందగ్గర నిల్చుని తనకేసి తీక్షణంగా చూస్తూ అంటున్న మనోహర్ మాటలతో త్రుళ్ళిపడింది సుశీల....

"డైరీ చదివితే చదివావ్! కాని నువ్వు చదివిన విషయాలు

పీ పెదవి దాటి పైటికి వచ్చాయో...."మనోహర్ బలిష్ఠమైన చేతులు ఆమె మెడచుట్టూ పరుచుకున్నాయి క్షణకాలం....

మొదటిసారిగా భర్త కళ్ళల్లో రాక్షసుని తాలూకు నీడలు కదలటం సుశీల గుర్తించింది....

"పెదవి కదిపి ప్రయోజనం లేదని నాకు తెలుసు....కాని.... అమాయకురాలని....అందునా ఓ గౌరవనీయురాలైన గృహిణి జీవితం అన్యాయం చెయ్యొద్దని మాత్రం ప్రార్థిస్తున్నాను....మీకు సరిపోయే స్త్రీ లెందరో వున్నారు....వారి విషయంలో నా కెలాంటి పెంగా లేదు....కాని కల్యాణి...."

"నోర్ముయ్...."

మనోహర్ చేతిదెబ్బకు చెంప పగిలిపోవటమేకాదు....ఆమెకు స్పృహ తప్పిపోయింది...

"సుశీలా! ఈరోజు మందులు మింగావా అమ్మా?"సావిత్రమ్మ కంఠస్వరం దగ్గరగా వినిపించటంతో త్రుళ్ళిపడింది సుశీల. గత స్మృతుల దృశ్యాలకు స్వస్తి చెప్పి, వాస్తవ ప్రపంచంలోకి వచ్చింది...

"ఆ; వేసుకున్నాను అత్తయ్యా!" అనేసి కళ్ళు మూసుకు పడుకుంది. పడుకుందేగానీ, మనోహర్ అనే ఓ మంట చుట్టూరా, అది నిప్పు అని తెలుసుకోలేక, ఏదో ఆకర్షణతో గిరగిరా తిరిగే శలభంలా కల్యాణి రూపం పదేపదే సాక్షాత్కరిస్తోం దామె కళ్ళ ముందు. మెల్లిగా ప్రారంభమైన గుండెనొప్పి, ఊపిరి సలపనంతగా ఎక్కువైంది....

గుండెనొప్పితోబాటు, మరోవిధమైన ఉద్రేకమూ, ఆమెలో అధికం కాసాగింది.

కుసుమ....కల్యాణి....ఇలా ఈ క్రమంలో మనోహర్ మరెందరు స్త్రీల జీవితాలతో చెలగాట మాడబోతున్నాడు? ఎందరి జీవితాలను బుగ్గిపాలు చేయబోతున్నాడు? అతగాడి పైశాచికమైన ఆటకూ వ్యామోహానికీ ఓ హద్దంటూ లేదా?

ఇక ఈ ఆట యిలా సాగనివ్వకూడదు...దీనికో అంతం తనే చూపాలి....ఆ ప్రయత్నంలో తను అంతమైపోయినా ఫర్వాలేదు...

"అతగాడు భర్త! భర్త నాశనం నువ్వే చేజేతులా తెచ్చి పెట్టుకుంటావా?" హఠాత్తుగా, తనలో దాగివున్న మరో సహనశీలి ఐన స్త్రీమూర్తి ప్రశ్నిస్తోంది...

సుశీల మనసు వికృతంగా నవ్వింది. "భర్త! అవును భర్తయితే? ఇలా, ఇంత వికృష్టంగా ప్రవర్తిస్తూ, ఎందరి జీవితాలనో బలిగొంటూంటే, తెలిసీ తెలియనట్లు ప్రవర్తించనా నేను? భర్త అనే స్వార్థచింతతో, నాతోటి స్త్రీల జీవితాలు భగభగ మండి పోతుంటే, ఈయనగారి విలాసాలను భరిస్తూ, సహనం చూపి క్షమించనా?"

"నీపట్ల అతగాడు నిర్లక్ష్యం వహించాడని పగదీర్చుకో దలుచుకుంటున్నావా? ప్రతీకార వాంఛతో, భర్తపట్ల స్త్రీకి సహజంగా ఉండవలసిన గౌరవభావాన్ని కోరి రూపుమాపుకుంటున్నావా?" ఆ లోపలి స్త్రీ ప్రశ్నిస్తోంది తిరిగీ.

"ఊహూ! కాదు...కాదు...నామీద వారు ప్రేమ చూపలేదనీ, నన్ను నిర్లక్ష్యం చేశారనీ నేను కక్ష సాధించదలుచుకోలేదు...కాని... కాని...ఇలా మితిమీరిన స్త్రీ వ్యామోహంతో వారు హాయిగా సాగు తున్న సంసారంలోకూడా నిప్పులు చల్లుతుంటే అరికట్టడం వారి భార్యగా నా బాధ్యత అని భావిస్తున్నాను....నా భర్తమీద నాకు గౌరవం వుంది. అయినా వారి నైతిక పతనాన్ని సహించలేను. పొరబాటు లెమ్మని సమర్థించలేను. నా విషయంలో పొరబాటు అని సమర్థించుకోగలను. కాని కుసుమ మా టేమిటి? ఆమె జీవితం వారి చేతుల్లో నలిగి నాశనమైపోలేదూ? ఈనాడు తిరిగీ "కల్యాణిమీద పట్టి స్తున్నారే!" సుశీల మనస్సు గిలగిలలాడుతోంది.

కల్యాణి! కల్యాణి స్త్రీ. తన హద్దులేవో ఆవిడ విస్మరించినపుడు, పురుషుడైన మనోహర్ చనువు తీసుకోవటంలో తప్పేముందీ?''

కల్యాణిఅమాయికురాలు...వంచనఅనేదిఇంతమనోహరంగా, సమ్మోహనకరంగా, మంచి మంచిగా వుంటుందని తెలియని, కలలో కూడా ఊహించని అమాయికురాలు....అలాటి అమాయికురాలిని విపరీత పరిస్థితులలోకి ఈడ్చి, ఆమె చుట్టూరా వ్యూహం నిర్మించి మరీ నాశనం చెయ్యడం నే సహించలేను...

''తన వ్యాపారం గుట్టు బయటపడుతుందని ఎందరో ఆఫీసర్లను ఎన్నో చిక్కులలో ఇరికించి, వారి పరువూ, ప్రాణమూ తన చేతుల్లో చిక్కించుకుని నిరాటంకంగా తన మోసం సాగిస్తున్నారు. అందుకు నేనడ్డురాలేదు....ఈనాడు దేశ వ్యాప్తంగావున్న ఎందరో ఘరానా వ్యక్తు లిలాటివన్ను శ్వాసపీల్చినంత తేలిగ్గా చేస్తున్నారు లెమ్మని సరిపెట్టుకోగలిగాను.

''నన్ను తన గృహిణిగా కాదు కదా, వొక మనిషిగా కూడా వారు గుర్తించలే దేనాడూ. అందుకూ బాధపడటంలేదు. ఎందరో గృహిణులు ఈనాడు నాలా, జీవచ్ఛవాల్లా బ్రతుకుతున్నారు....వారందరిలో నేనూ ఒక్కర్తెను.''అని సమాధాన పరచుకున్నాను....అయినా అదేపనిగా మర్యాదస్తులయిన కన్యల, గృహిణుల జీవితాలతో చెలగాటమాడుతూంటే నాభర్త అనే అభిమానంతో ఆయనగారిని క్షమించటం....ఊహుఁ నావల్ల కాదు....

''ఆయనగారి డైరీలు.....ఆ ఫొటోలు....నెగెటివ్స్....అన్నీ పూర్తిగా నాకు తెలుసు...అవసర మొచ్చినపుడు...నేను వారికి పాఠం నేర్పుతాను....వారి కళ్ళు తెరిపిస్తాను....''

సుశీల ఆలోచించి ఆలోచించి అలసిపోయింది. ఆమె మెత్తని హృదయం కఠిన పాషాణంగా మారిపోయిం దా క్షణంలో.

# 19

"ఈవారం అందరం కలిసి ఏదేనా పిక్నిక్ ప్రోగ్రాం వేసుకుందా మనుకుంటున్నారండీ సరదాగా. మీ రేమంటారు కల్యాణిగారూ?" వనజ అడిగింది ఉత్సాహంగా.

"మెంబర్స్ అంతా అంగీకరిస్తే నే నొక్కర్తెనూ కాదంటానా?" నవ్వుతూ అంది కల్యాణి.

"ఏమిటండోయ్? ఏదో ప్రోగ్రాం వేస్తున్నారల్లే వుందంతా? ఈరోజు చర్చనీయాంశం అంటూ ఏమీలేదా ఏమిటి?ఏదేనా వుందేమో అనీ, ముఖ్యంగా కల్యాణిగారి ఉపన్యాసమేదేనా వుందేమో అనీ బిజినెస్ కూడా చెడగొట్టుకుని వచ్చాను!" అప్పుడే మహిళామండలి హాల్లోకి అడుగెట్టిన మనోహర్ నవ్వుతూ అన్నాడు....

"పేట్రన్ అయితే కావచ్చుగానీ,ప్రతి మీటింగుకీ పనిగట్టుకుని ఆడాళ్ళ మధ్యకు రావటానికి ఇతగాడికి ఏమాత్రం సంకోచం లేనట్లుంది" అంది పార్వతి పక్కనున్న శ్రీ లక్ష్మితో.

శ్రీ లక్ష్మి నవ్వింది.... "ఇంత క్రితం ఇంత తరచూ వచ్చేవాడు కాదు....కాని కల్యాణిగారు మెంబర్‌గా చేరాక,ప్రతి మీటింగుకీ మనం వచ్చినా రాకున్నా, ఇతగాడు మాత్రం హాజరు....."

"ఆవిడకు తెలుసా ఈ సంగతి?" పార్వతి గొణిగింది.

"ఏమో! కాని ఆవిడ చూడటానికి అహంకారిలా కన్పిస్తుందే గానీ, ఆలోచనా పాలోచనా వున్న మనిషిలాలేదు. ఉంటే అతగాణ్ణి అంత చనువుగా తనతో మెలగనిస్తుందా?" అంది శ్రీ లక్ష్మి.

ఖంగుమంటూన్న విమ్మీ గొంతు వినపడ్డంతో ఇద్దరూ గుసగుసలు ఆపేశారు....

"ఇప్పుడేం మునిగిపోయిందన్నయ్యా? నువ్వు లేకుండా, సందడి లేకుండా మా పిక్నిక్ ప్రోగ్రాం కళగానే వుండదు తెలుసా?" అంటోంది విమ్మీ నవ్వుతూ.

"అదీగాక, కారియర్లూ, కెమెరాలూ, వాటర్ బాటిల్సూ, ఫ్లాస్కులూ వగైరాలు పట్టుకురావటానికి శారీరకంగా పురుషులే ఉపకరిస్తారు కాబట్టి, మా శ్రీవార్లను కూడా ఆహ్వానిస్తున్నాం!" అంది వనజ, చాలా విట్టీగా మాట్లాడాననుకుని, మురిసిపోతూ.

గుండె గతుక్కుమన్న మనోహర్ ఎలాగో సంబాళించుకున్నాడు....డాక్టర్ ఉపేంద్ర కూడా వస్తాడేమో!

వనజ చందాలు వసూలు చెయ్యటం మొదలెట్టింది....

"నేను చందామాత్రం ఇస్తాను...కాని పిక్నిక్ కి రాలేను" అంది నిక్కచ్చిగా పార్వతి, వెళ్ళటానికి ఉద్యుక్తురాలవుతూ.

"అదేం?" అని నిమ్మీ ఆదోరకంగా చూస్తూ అడిగింది.

"నాకు తీరికవుండదు." అని సమాధానం చెప్పింది పార్వతి." అసలు నెలకోసారి మీటింగుకు వచ్చేసరికే, తలప్రాణం తోకకు వస్తోంది....ఇల్లనీ, పిల్లలనీ, పనులనీ లేకుండా ఇక్కడికి వచ్చి మనం సాధిస్తున్నదేమిటో! ఊరికే గాలి కబుర్లు మినహా మనమేం చేస్తున్నాం?"

పార్వతి మాటలకు వనజకు బాగా కోపం వచ్చింది....మనల్ని మనమే ఇలా చులకన చేసుకోవటం బాగాలేదు పార్వతిగారూ! ఇల్లూ, పనులూ ఎప్పుడూ వుండేవేగా! పిక్నిక్ కి వెళ్ళొచ్చేసరికి అవేమై పోతాయి?"

"ఏమో ఇంటిదగ్గిర అసౌకర్యాన్ని కలిగించి, నేను పిక్నిక్ లో సరదా అనుభవించలేను. క్షమించండి—నేమాత్రంరాను!" చందా ఇచ్చి, పార్వతి వెళ్ళిపోయింది.

"ఓహ్! బి. సి. నాటి మనిషి." నిర్లక్ష్యంగా నవ్వింది వనజ.

"ఇలాటి వాళ్ళుండబట్టే స్త్రీని ముక్కుపట్టుకు ఆడిస్తున్నాడు పురుషుడు" అన్నాడు మనోహర్ వెటకారంగా.

"అదో స్టయిల్ లేద్దురూ! తనకే ఇల్లూ, పిల్లలూ వున్నట్లూ, మనకా బాధ్యతలు లేనట్లూ, సరదాగా పదిమందిమీ కలిసి కాలక్షేపం చెయ్యటం ఓఘాయిత్యమైనట్లూ మాట్లాడుతుంది....తనకు తవ

గృహమూ, భర్తా, పిల్లలూ తప్ప మరో లోకం లేనట్లూ, అక్కడికి తాను ప్రాచీన సాంప్రదాయాలని, సంస్కృతిని నిలబెడుతున్నట్లూ ఆవిడ భావం—అహంభావం!'' అంది నిమ్మి.

"కరెక్ట్!'' అని వూతం యిచ్చింది కల్యాణి.

"అయితే ఆదివారం ప్రయాణం.మూడు కార్లు.మన మెంబర్లు సామాన్లు....కాని ఒక్క షరతు...లెస్ లగేజ్, మోర్ కంఫర్ట్— మేక్ యువర్ ట్రావెల్ ఎ ప్లెజర్, నాట్ ప్రెషర్!''

నిమ్మి మాటలకు అంతా పకపక నవ్వి లేచారు.

"ఊహూ! నాకిష్టంలేదు కల్యాణీ!'' ఉపేంద్ర నవ్వుతూ అన్నాడు.

"ఏమిటి? నే వెళ్ళటమా, మీరు రావటమా?'' కల్యాణి కోపంగా అడిగింది.

"రెండూనూ!'' అలాగే మెత్తగా నవ్వుతూ ఆమె భుజం మీద గడ్డం ఆన్చి అన్నాడు ఉపేంద్ర.

"కారణం?"

"ఓ! బోలెడంత. అంతరద్దీలో అందరిలో మనం శిల్పకళను చూసి ఆనందించేమాట ఏమోగానీ...ఊరికే ఊకదంపుడు కబుర్లతో, వెకిలినవ్వులతో, కేవలం కాళ్ళరిగేలా మాత్రం తిరుగుతాము. అలాటి చక్కటి ప్రదేశాలకు మనిద్దరం వెళ్ళడంలోగల హాయి, అంత మందిలో ఏకాకిగా విల్చుని నేననుభవించలేను. అంచేత, మరోవారం రోజు లాగు...డాక్టర్ శ్రీనివాస్ నాకు అసిస్టెంటుగా నా నర్సింగ్ హోంలోనే వుండబోతున్నాడు. అతగాడి మీద కొన్నాళ్ళు నర్సింగ్ హోంలో వదిలి, హాయిగా మనిద్దరం అలా అలా తిరిగొద్దాం.సరా?''

"ఈ జన్మలో అయ్యేప్లాను కాదు ఇది'' అంటూ విసురుగా అతగాణ్ణి త్రోసివేసి, దూరంగా జరిగి కూర్చుంది కల్యాణి. "ఏ శ్రీనివాస్ వచ్చినా, మిమ్మల్ని మీ కేసులు వదలవు. మీకు తీరికా చిక్కదు. అదలా వుంచండి. పదిమందిలో కలిసి తిరగటం, మీ

కంత అయిష్టమా? ఆ సరదామే లేదా మీకు?'' అని గట్టిగా అడిగింది కల్యాణి.

"ఊహూ, లేదు. పదిమందితో కలిసి తిరగవలసిన సందర్భాలు వేరు. కాని ఇవి కావాలని పనిలేని స్త్రీ పురుషులు వెకిలిగా కల్పించుకొనే విశృంఖలమైన, నాగరికతముసుగు తొడుక్కున్న అనాగరికపు పనులు. అలాంటివంటే నా కసహ్యం!"

"మీ కసహ్యమైనవన్నీ నా కిష్టం ఎందుకు కావాలి?"

కల్యాణి ప్రశ్నకు సమాధానమేం చెప్పాలో పాలుపోలేదు ఉపేంద్రకు.

"అంచేత నే వెళతాను. ఆపైన మీ ఇష్టం."

జానపదగాథల్లో, పేదరాసి పెద్దమ్మ రాకుమారుడితో "నాయనా! ఆరుగదుల లోకీ వెళ్ళు. కాని ఆ ఏడవగదిలోకి మాత్రం వెళ్ళకు" అని చెబుతుంది.

కాని ఆ గదిలో ఏముందో చూడాలనే కోరికా పట్టుదలే ఎక్కువౌతాయి ఆ రాజకుమారునిలో!

సరిగ్గా అలాగేవుంది కల్యాణి మనస్థితి. అది తెలుసుకున్న ఉపేంద్ర అట్టే వాదన పెంచలేదు. పిక్నిక్‌కి మనోహర్ కూడా వస్తున్నాడనేవిషయం కల్యాణి అతగాడికి చెప్పనూలేదు. దానిని గురించి అతగాడు అడగనూలేదు.

"డాక్టర్! నన్ను సెలవుపెట్టి రమ్మని మా అమ్మా, నాన్నా ఉత్తరం వ్రాశారు...."

సిస్టర్ విజయ మెల్లిగా అంది:

"ఏం విషయం?" నవ్వుతూ అడిగాడు ఉపేంద్ర.

క్షణకాలం తటపటాయించి మెల్లిగా గొణిగింది విజయ: "నా వివాహం నిశ్చయమైంది...."

"నిజంగా? చాలా సంతోషం. ఇంతకూ అతగాడెవరు?"

"నేనేనోయ్ ఉపేంద్రా!" స్ప్రింగ్ డోర్స్ త్రోసుకువస్తున్న భాస్కర్ నవ్వుతూ అన్నాడు.

"వ్హాట్?" ఆశ్చర్యంగా భాస్కర్ వేపు చూశాడు ఉపేంద్ర.

ఏదో పనివున్నట్టు బయటికి వెళ్ళిపోయింది విజయ.

"మరి నాకు చెప్పలేదేం?"

కాస్త సస్పెన్స్‌లో పెడదామనుకున్నాను....విజయ నాకు నచ్చింది. ఆ విషయమే మా అమ్మతో చెప్పాను........వెంటనే విజయ తండ్రిగారితో సంప్రదించాను. ఆయన సంతోషంగా అంగీకరించారు...."

"మరి విజయ?"

"ఆవిడనే అడగలేకపోయావ్?"కొంటెగా అన్నాడు భాస్కర్.

"నేనా?" ఆశ్చర్యంగా చూశాడు ఉపేంద్ర.

"మరి నేనా?" నవ్వాడు భాస్కర్.

అర్థంగానట్లు చూశాడు ఉపేంద్ర.

"డాక్టరుగారూ!తమరి నర్సింగ్ హోంలో విజయ చేరకముందు నుంచే మాఇద్దరికీ పరిచయముంది.కాని తన కుటుంబ ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా అప్పట్లోవిజయ మా వివాహానికి వాయిదా వేయమని కోరింది ఆదీగాక.మారాధకు వివాహం కాకుండా నేను పెళ్లాడటం సబబుకాదని పించింది నాక్కూడా. అంచేత మా ప్రేమ మా మనసులు దాటి పోకుండా కట్టుదిట్టం చేసుకున్నాం. విజయ నాన్నగారికి కూడా, కట్నం లేకుండా అల్లుడు దొరుకుతాడనే ఆశ కలలోకూడా లేదట. విధిలేక విజయను ఉద్యోగంలో చేర్పించి, ఎంతగానో బాధ పెడు తున్నాడా పెద్ద మనిషి. ఇప్పుడు అందరి సమస్యలూ తీరి పోతాయి ఒక్కసారిగా! అర్థమయిందా?"

"అయ్యబాబోయ్!" భాస్కర్ జబ్బ చరిచాడు ఉపేంద్ర సంతోషంగా. "మిష్టరీ నవలల్లోనయినా కాస్త క్లూ దొరుకుతుందేమో గాని, మీ ప్రేమ వ్యవహారం మాత్రం మాకెవరికీ తెలియనంత రహ స్యంగా వుంచేశారన్నమాట!"

"అవును. ప్రేమ వ్యవహారాలు హద్దులు మీరినపుడే అందరికీ తెలియటం, హాస్యాస్పదం కావటం జరుగుతుంది ఉపేంద్రా! ఎవరి హద్దుల్లో వారుండి, పెద్దల ద్వారా సక్రమమైన మార్గంలో వెడితే ప్రేమలు ప్రాణాంతకాలుగా పరిణమించవు కాదూ?"

"కరెక్ట్! మరి మాకు డిన్నర్ ఎప్పుడు?" ఆనందంగా అడిగాడు ఉపేంద్ర.

"తిరుపతి దేవుని సాన్నిధ్యంలో పెళ్ళి... అదయ్యాక అక్కడే మీ అందరికీ విందు. నాలుగు రోజుల్లో శుభలేఖలు అచ్చువేయించి, ఏకంగా నిన్ను ఆశ్చర్యంలో ముంచెత్తుదామనుకున్నాను. ఊహూఁ! విజయ ఆ అవకాశం ఇస్తేనా?...

ఉపేంద్ర నవ్వాడు. భాస్కర్ మాటలకు అడ్డుగా వచ్చిన విజయ చెంపలమీద కెంపులు పూయటం భాస్కర్‌తోబాటు ఉపేంద్ర కూడా గమనించాడు.

## 20

అంత్రా తిరిగి తిరిగి అలసిపోయారు. కారియర్లన్నీ ఖాళీ అయిపోయాయి. కల్యాణికి బాగా అలసటగా వుంది.

"ఒక్క ఆట ఆడుదాం రాండి కల్యాణిగారూ!" పేక కలుపుతూ నిమ్మీ పిలిచింది.

"ఊహూఁ. నేను రాలేను. బాగా అలిసిపోయాను. కాస్సేపు అలా ఏ కాంతంగా కూర్చోవా లనిపిస్తోంది." అంటూ లేచి అందరికీ దూరంగా వెళ్ళింది కల్యాణి.

మనోహర్ కన్ను గీటడంతో అతగాడి మనోభావాన్ని పసిగట్టిన నిమ్మీ, మెల్లిగా కల్యాణిని అనుసరించింది.

బాగా దూరం వెళ్లాక, కల్యాణి స్తిమితంగా కూర్చుంది.

మెల్లిగా నిమ్మీ కల్యాణి దగ్గరికి వచ్చింది.

"నిమ్మీ, నిమ్మీ" అంటూ హడావిడిగా పరుగెత్తుకువచ్చాడు మనోహర్.

"ఏమిట్రా అన్నాయ్ ఆ హడావుడి?" అంది నిమ్మీ.

"ఇప్పుడే గుర్తుకొచ్చింది. నేనూ, కల్యాణిగారూ కలిపి ఫొటోలు తీయించుకుంటామని నువ్వు చెప్పావుగా? శిల్పాలన్నీ ఫోటోలుతీసి ఫిల్ముకీల్స్ అయిపోయాయి. ఇక నాలుగేవున్నాయి. ఈ సంగతి తెలిస్తే, ఆ వనజగారూ వగైరాలంతా బిలబిల వస్తారు. ఈ చుట్టూరా ప్రకృతి ఎంతో బావుంది. ఏమంటారు కల్యాణి గారూ?"

కల్యాణి విసుగ్గా అంది. "ఇప్పుడు మాకెందుకండీ ఫోటోలు?"

"ఊహూఁ అలా అనకండి. మరో పదిహేను రోజుల్లో మా వారికి ట్రాన్స్ఫర్ రాబోతోంది....ఎక్కడకు వెళ్ళినా, ఈ అందాల రాశి కల్యాణిగారు నా స్నేహితురాలు అంటూ గొప్పగా చెప్పుకోవాలని నా కోరిక. మీ పక్కన ఫోటోలో నిల్చోడానికి నాకు అర్హత లేదంటే మానేస్తాను" అంది నిమ్మీ గడుసుగా.

"అబ్బే! అదేంమాట? రండి మరి నిలబడదాం. తియ్యండి మనోహర్‌గారూ!" అంది కల్యాణి. నిమ్మీ, కల్యాణీ పక్కపక్కన నిల్చున్నారు. మనోహర్ ఓ స్నాప్ తీశాడు....మళ్ళీ కెమెరా సరి చేసుకుని "కల్యాణిగారూ, అలాగే నిలబడండి....మిమ్మల్నొక్కర్నీ తీస్తాను. తర్వాత తిరిగి నిమ్మీ....అరె అలా కదలకండి....స్టెడీ.... అరె....అరె...."

గబుక్కున కెమెరా నిమ్మీ చేతి కిచ్చి, కల్యాణి వెనుకగా వెళ్ళి నిల్చుని చటుక్కున ఆమె రెండు భుజాలూ పట్టుకున్నాడు.

అర్థం కాని కల్యాణి చప్పున మెడ పక్కకు తిప్పి మనోహర్‌కేసి చూసింది...."కంగారు పడకండి....సరిగా నిల్చోపెడుతున్నానంతే!" అని నవ్విన మనోహర్ పెదవులు తమాషాగా విచ్చుకున్నాయి. అతగాడి కళ్ళు ఏవో పరవశత్వంలో వున్నట్లు సగం చికిలించుకు పోయాయి.

అదే క్షణంలో విమ్మీ వరసగా మూడు స్నాప్స్ తీసిందని కల్యాణి కనిపెట్టలేకపోయింది.

విసురుగా "ఇకచాలు" అంది మనోహర్‌నుంచి దూరంగా జరుగుతూ.

"పోన్లెండి! మీ కిష్టం లేకుంటే నేనిక బలవంతం చేయను ....కాని అరె అదేమిటి? మీక్కోపం వచ్చిందా? నేనేం చేశాను కల్యాణి గారూ? ఓ! సారీ! విమ్మీని తాకినట్టుగా మిమ్మల్ని అప్రయత్నంగా చనువుగా స్పృశించాను....ప్లీజ్! మరో చెడుతలపు నాలోలేదు సుమండీ! నన్ను నమ్మలేరూ?"

నిర్మలంగా దీనంగావున్న మనోహర్ ముఖం చూసి జాలి పడింది కల్యాణి.

"అబ్బే! ఏమీ అనుకోలేదు లెండి" అనేసింది.

"కాకున్నా అన్నాయ్! నీకు తొందర ఎక్కువరా" అని వెనక నుంచి విమ్మీ మందలింపు.

నేను దూరం ఆలోచించలేదు విమ్మీ! ఆవిడగారేమనుకున్నారో ఏమో?"

కంపిస్తున్న మనోహర్ కంఠస్వరం విని కల్యాణి చిన్నగా నవ్వుకుంది.

* * *

"గురూ! కొంప మునిగింది" అంటూ హడావుడిగా పరు గెత్తుకు వచ్చాడు చలపతి.

"ఏమిటోయ్ సొద?" లిల్లీ గ్లాసు నింపుతోంది....కొద్దికొద్దిగా మైకం వస్తోంది మనోహర్‌కు.

"సొదకాదు గురూ! అలా మార్కెట్ వేపు రా. సి. ఐ. డి. ఇన్స్‌పెక్టర్స్ కొందరు మన లారీలను వెంబడించబోతున్నారు. వాళ్ళ కేమిటో అనుమానం వచ్చినట్లుంది. డి. ఎస్. పి. చంద్రశేఖర్ ఇక్కడే వున్నాడు. మరో అరగంటలో అతగాడు మన ఆఫీస్ చెక్ చెయ్యటానికి రాబోతున్నాడు...." గోలగోలగా అన్నాడు చలపతి.

మైకం పొక్కసారిగా వదిలినట్లయింది మనోహర్‌కి.

"ఓహో అలాగా!" క్షణకాలం ఆలోచించాడు.

"లిల్లీ! డ్రెస్ మార్చుకో....నా వెంట రా! చలపతీ! ఆఫీసులో ఆటొమేటిక్ కెమెరా యాంగిల్ చెయ్యి. టేప్ రికార్డర్ రెడీగా వుంచు....పద వెళదాం!"

"చంద్రశేఖర్‌చేత బాగా తాగించు లిల్లీ! ఈ దెబ్బతో అతగాడు తిరిగీ జన్మలో మనజోలికి రాకుండా నోరు నొక్కేయాలి.... చలపతీ! టేప్ రికార్డర్ పని నీది....వాగించేవంతు నాది!"

కారులో హుషారుగా ఎవరి పనులు వారికి పురమాయించాడు మనోహర్.

• చిత్తుగా తాగిన చంద్రశేఖర్ లిల్లీ ఒడిలో ఒరిగిపోయాడు.

"ఓహో! చిత్తయిపోయాడు డి. ఎస్. పి. గారు!" నెగెటివ్స్ అన్నీ భద్రపరుస్తూ చలపతి హుషారుగా అన్నాడు.

"ఆ నెగెటివ్స్ నా చేతికివ్వు చలపతీ! ఈ టేప్ రికార్డర్ తీసి దాచెయ్. గట్టి పిండం. మనకు పనికివచ్చే ఒక్క ఊసు చెప్పలేదు. పోనియ్! ఈ నెగెటివ్స్ చాలు పీడిపని పట్టడానికి....అన్నట్టు మన లారీలు దాటి వెళ్ళుంటాయనుకుంటాను.

వెళ్ళకున్నా, ఇన్‌స్పెక్టర్స్ పట్టుకున్నా ఫర్వాలేదు! డి. ఎస్. పి. గారి పిలక మన చేతిలో ఇరుక్కుంది. లిల్లీ! అద్భుతమైన పోజ్ లిచ్చావ్ డి. ఎస్. పి. గారితో కలిపి. ఇక వెడదాం పదండి! చంద్రశేఖర్‌గారూ! ఇక హాయిగా బజ్జోండి తండ్రీ!" అంటూ మనోహర్ లిల్లీ చలపతులతో బయటికి వచ్చేశాడు.

చంద్రశేఖర్ పెదవులు చిరునవ్వుతో సంతృప్తిగా విచ్చుకోవటం వాళ్ళ ముగ్గురికీ తెలియదు.

*　　　　*　　　　*

"కల్యాణీ!" అది పిలుపుకాదు గర్జన.

"ఏమిటి?" నిర్లక్ష్యంగా తల తిప్పి చూసింది కల్యాణి.

"నీ ప్రవర్తనతో నా పరు వెంతగా పోతోందో నీకు తెలుసా?,..."

పిక్నిక్ నుంచి వచ్చిన కల్యాణి ఎదుర్కొన్న మొదటి ప్రశ్న ఇది....

"ఊహూ!" కొంటెగా తల తిప్పింది కల్యాణి.

"అవును. నీ కేం తెలుస్తుంది....కళ్ళుండీ గుడ్డిదానివై పోయావ్! చెవులుండీ చెవిటిదానివై పోయావ్! నిన్నూ, మనోహర్‌ను గురించి లోకం రకరకాలుగా చెప్పుకొంటోంది."

"మీ దృష్టిలో లోకం అంటే భాస్కర్ ఒక్కడే కావొచ్చు-" వ్యంగ్యంగా అంది కల్యాణి.

ఉపేంద్ర నిట్టూర్చాడు.

"కల్యాణీ! నీ కెలా చెప్పాలో నాకు అర్థం కావటంలేదు. ప్రాణాధికంగా నిన్ను ప్రేమించాను. కాబట్టే, నువ్వు చేసే ప్రతి పొరబాటూ, నేను సహనంతో చక్కదిద్దటానికి ప్రయత్నిస్తూనే వున్నాను...."

కల్యాణి బుస్సుమంది. "సహనం కాదది—నేను తెచ్చిన డబ్బుమీది మమకారం!"

ఉపేంద్ర క్షణకాలం కల్యాణికేసి చూసి చిన్నగా చిరునవ్వు నవ్వాడు. "అది నీ మనసులో పేరుకుపోయిన మకిలిభావం. అహం. అంతే! కాని నువ్వు నా జీవితంలో అడుగెట్టిన లగాయితూ, నీ రెండు బంగళాలకూ నేను బాడుగ చెల్లించుకుంటున్నానని, కారు తాలూకు డబ్బు కూడా మొత్తంగా నీ పేరిట బ్యాంకిలో ఫిక్సెడ్ డిపాజిట్‌గా కట్టేశానని నీకు ఈ క్షణం వరకూ తెలిదు కదూ? బహుశా తెలిసివుంటే అనుక్షణం 'నడుమంత్రపు సిరి ఐతే వచ్చింది కాని...,' అంటూ నన్ను హేళన చేసేదానివి కాదేమో! నీ కా సంగతి తెలియజేయాల్సిన అవసరం వస్తుం దనుకోలేదు. కాని తప్పనిసరి అని తోస్తోంది." చెక్కు బుక్కు ఆమె ముందుకు తోశాడు ఉపేంద్ర....

క్షణకాలం నిరుత్తరురాలైంది కల్యాణి.

"అంతేకాదు కల్యాణీ! నేను మరో బంగళా కొనబోతున్నాను నా కోసం. నీ కిష్టమైతే నాతోబాటు వచ్చి ఆ బంగళాలో, నా సహచరిగా వుండు. లేకుంటే నే నెలాంటి అభ్యంతరమూ పెట్టను. విడిపోవలనుకుంటే స్నేహితులలా విడిపోవటమే మంచిదని నా ఉద్దేశ్యం."

ఉపేంద్ర ముఖంలోని ఆ గాంభీర్యం ఇదివర కెన్నడూ తను చూడనిది....క్షణకాలం ఏమనాలో పాలుపోలేదు కల్యాణికి. అంతలోనే ఆమె అభిమానం మేల్కొంది.

"బెదిరిస్తున్నారా?" అంది కోపంగా.

"ఊహూ! నిన్ను చూసి జాలిపడుతున్నాను. నువ్వేం నిర్ణయించుకుంటావో నీ యిష్టం. అందాకా రమేష్ దగ్గర వుండటం మంచిది. ఈలోగా మనిద్దరి మనసులూ ఎలా మారుతాయో? కొంత కాలం ఒకరికొకరం దూరంగా వుండటమే మే లనిపిస్తోంది నాకు."

కల్యాణి కోపంతో వణికిపోయింది క్షణకాలం. "అవును. నేనూ అదే చెప్పబోతున్నాను. రేపే నేను అన్నయ్యదగ్గరకు వెడతాను. అస్తమానూ ఒకరి నొకరు ద్వేషించుకుంటూ, ఈ చికాకులు నే పడలేను."

"అలాగే!"

# 21

"కల్యాణిగారూ! మీరా? ఎక్కడికి, హడావుడిగా ప్రయాణమైన ట్లున్నారు?" మనోహర్ ఆశ్చర్యంగా అడిగాడు, పైబెర్త్ మీదనుంచి తొంగిచూస్తూ....

కల్యాణి క్షణకాలం ఆశ్చర్యపోయింది. ఫస్ట్‌క్లాస్ కంపార్టుమెంటులో మరెవరూ లేరు.

"అవును....అనుకోకుండా బయలుదేరాల్సి వచ్చింది."

మనోహర్ పకపక నవ్వాడు...."భలేవారే! నా దగ్గరా దాస్తారు? ఉపేంద్రగారితో కాస్త ఘర్షణపడి, అలిగి, అన్నయ్య దగ్గరకు వెడుతున్నారు. అవునా?"

కల్యాణి నిర్ఘాంతపోయింది.

"మీరు దాచినా, మీ ముఖంలోని భావాలు దాగనివ్వటంలేదా రహస్యాన్ని! అయినా, నేనింత క్లోజ్‌గా వున్నానుకదా మీకు— నన్నింకా పరాయివాడిలానే ట్రీట్ చేస్తారెంచేత కల్యాణిగారూ?"

కల్యాణి చిరునవ్వే సమాధానంగా వచ్చింది.

"పోన్లెండి....మీ పర్సనల్ విషయాలలో జోక్యం కలుగజేసుకోను. మీకు ఇబ్బందిగా వుందల్లేవుంది." పై బెర్త్‌మీద నుంచి కిందికి దిగివచ్చి, కల్యాణికి ఎదురుగావున్న బెర్త్‌మీద కూర్చున్నాడు. "అన్నట్టు ఉపేంద్రగారు మరో బంగళా ఖరీదు చెయ్యబోతున్నారుట? మా బిజినెస్ పార్టనర్ ఒకతను చెప్పాడు."

"ఊఁ!"

"అవున్లెండి! పేమెంట్స్ ఎక్కువయ్యారల్లే వుంది. వాట్స్ కావాలిగా—" పరీక్షగా ఆమె ముఖంలోకి చూస్తూ అన్నాడు మనోహర్.

"ఇంతకూ మీ రెందాకా?"

"మీతోబాటే దిగుతాను స్టేషన్‌లో!" నవ్వాడు మనోహర్. "అక్కడ నా శ్రీమతి జబ్బుతో మందు తీసుకొంటోందని తెలుసుగా మీకు....నేను ఇంటికి చేరేసరికి, నిన్న సాయంత్రం. టెలిగ్రాం వచ్చింది, సుశీలకు చాలా సుస్తీగా వుందని, వెంటనే బయల్దేరి రావలసిందనీను...." సరే చచ్చిందేమో చూసి, తగలెట్టి వద్దామని వెళ్తున్నాను!"

కల్యాణి నిర్ఘాంతపోయిందా మాటలకి.

"నేనిలా అంటున్నానని మీకు ఆశ్చర్యంగా వుందికదూ!" మనోహర్ నవ్వాడు. "ఏం చెయ్యను చెప్పండి! జీవితాంతం విసిగించి చంపే భార్యగాని, భర్తగాని లేకపోవటమే హాయి."

ఎందుకో కల్యాణి మనస్సులో ఉపేంద్ర మెదిలాడు. అస్త

మానూ లేని కట్టుబాట్లు తన చుట్టూరా వలలా విసురుతా నంటూ, తన నో కీలుబొమ్మలా చేయాలని ఆశించిన ఉపేంద్రమీద మరింత కోపం పేరుకొందామె హృదయంలో.

"చాలామాట్లు మీ రడిగారు మా దాంపత్యం గురించి....ఈ రో జెందుకో చెప్పా లనిపిస్తోంది....చెబుతా వినండి....నా భార్య సుశీల చదువుకున్న మూర్ఖురాలు....సాధారణంగా ఏ అందమైన దృశ్యాన్ని చూసినా, ప్రకృతిని చూసినా, శిల్పాన్ని చూసినా నా హృదయం ఆనందంతో మైమరచిపోతుంది. అలాగే అందమైన వ్యక్తులు....వారు స్త్రీలు కానీండి, పురుషులు కానీండి....తటస్థిస్తే, వారితో స్నేహం చేస్తాను....వారిలోని ఆ సౌందర్యాన్ని ఆరాధిస్తాను. ఓసారి నా డైరీలు చదివింది నా భార్య. ఇలాగే నేను కొందర్ని గురించి ఆనందంతో వ్రాసుకున్న వాక్యాలు చదివి, కొంప నరకంగా మార్చేసిందంటే నమ్మండి!"

కల్యాణి కుతూహలంగా వింటోంది. "మీ డైరీలు అసలు ఆవిడ చదవాల్సిన అవసరం ఏం వచ్చింది?"

"అదే నేనూ అన్నాను. దాంతో రెచ్చిపోయి, నోటికి వచ్చినట్లు అసభ్యంగా మాట్లాడింది....సుశీలకు వంతపాడేందుకు మా అమ్మకూడా బ్రతికుంది. ఇంకేంవుంది—యిద్దరూ కలిపి నా భరతం పడతారు, యింట్లో అడుగెట్టగానే. సుశీల నా ప్రవర్తనవల్లే తనకు హిస్టీరియా ఫిట్స్ వచ్చాయని పదిమందితో చెప్పుకుంది. ఉపేంద్ర గారుకూడా అది నమ్మి నన్ను చీదరించుకుంటుంటారు. మీకు తెలుసో తెలియదో."

కల్యాణికి ఆరోజు తను డాన్స్ చేస్తున్నపుడు మనోహర్ రావటమూ, అతగాడు తనను అభినందించాడని ఉపేంద్ర ఉడికి పోవటమూ, ఆవిడకు మెంటల్ రెస్ట్ అవసరం అంటూ మనోహర్ భార్యను గురించి మనోహర్‌ను చీదరించుకోవటమూ ఒకటొకటిగా గుర్తొచ్చాయి.

"నిజానికి ఆ కొంపలో, ఆ అశాంతిమయ వాతావరణంలో హిస్టీరియా రావల్సింది నాకు! మానసికమైన అలసట భరించలేక,

నేను మీలాటి సంస్కారవతులతో కాస్త ఆత్మీయత పెంచుకుని, నా వ్యక్తిగత సమస్యలు మరిచిపోవటానికి ప్రయత్నిస్తాను....ఓసారి నా డైరీలో ఓ పేజు చూపించిట. అంతే! ఇక ఏం చెప్పమంటారు? అన రాని మాటలండి. చెవులు మూసుకున్నాను. భాస్కర్ సంగతి మీకు తెలుసుగా! ఇలాటి ఆరాలన్నీ తీసి అతగాడు ఉపేంద్రగారికి బాగా నూరిపోశాడు. ఉపేంద్రగారికి మీ మీద కోపంరావటానికి ఇదే కారణమై వుండవచ్చు."

కల్యాణిలో మార్పులను గమనిస్తున్న మనోహర్ తన వాగ్ధోరణి కొనసాగించాడు. అసలు నా కొకటి తోస్తోంది కల్యాణి గారూ! అన్ని విధాలా అపురూపమైన మీకు ముళ్ళకంచె అధారంలా, ఉపేంద్రగారు అలంబనయ్యారు! నా భార్య సుశీలా,మీ భర్త ఉపేంద్ర గారూ సరిగ్గా ఒక్కటిగా తూగుతారు. విసిగిపోయిన నేను సుశీలతో విడాకులు పుచ్చుకుందామని నిర్ణయించుకున్నాను. కాని ఈలోగా నాకు సుశీలను జతచేసిన దేవుడే-బహూశా తన పొరబాటు తాను తెలుసుకుని వుంటాడు—ఆమె మరణంతో, నాకు శాశ్వతంగా విడాకులు ఇప్పిం చేందుకు నిర్ణయించుకున్నా డల్లేవుంది, మీ పరిస్థితి తలుచుకుంటే నాకు జాలేస్తోంది. జీవితాంతం మీరు ఎలా నలిగిపోగలరో, ఎలా నిగ్రహించుకోగలరో మరి?"

మనోహర్ మాటలతో కల్యాణిలో ఉపేంద్రపట్ల మరింత ద్వేషం రగులుకోసాగింది.రైలు ఈలోగా గమ్యస్థానం చేరుకుంది...

రమేష్, రాధా కల్యాణిని చూసి క్షణకాలం ఆశ్చర్యపోయారు.

"ఇదేమిటి కల్యాణీ! ఓ వైరిస్తే నేను స్టేషనుకి కారుతీసుకు రాలేకపోయానా" అన్నాడు రమేష్ వాత్సల్యంగా....నవ్వింది కల్యాణి.

"వీరు మనోహర్‌గారని పెద్ద వ్యాపారస్థులు. నాకు బాగా స్నేహితులు."

మనోహర్‌ను రమేష్‌కు పరిచయం చేసింది కల్యాణి....

"చాలా సంతోషం!"

రమేష్ సగౌరవంగా మనోహర్‌ను ఆహ్వానించాడు. రాధ అందరికీ టిఫినూ, కాఫీ తెప్పించింది....

చాలాకాలం తర్వాత తిరిగి హాయిగా గాలి పీల్చుకుంది కల్యాణి.

"అప్పుడప్పుడు వస్తూంటాను లెండి" అని నవ్వి సెలవు చేసుకున్నాడు మనోహర్.

"తప్పకుండా!" రమేష్ సాదరంగా వీడ్కోలిచ్చాడు.

ఏవో శృంఖలాలు విడిపోయిన అనుభూతి కలిగింది కల్యాణికి.

ఆరోజు రాత్రి పడుకోబోతూ మనోహర్ డైరీలో హుషారుగా ఇలా వ్రాసుకున్నాడు: "కల్యాణి ఉపేంద్రతో ఘర్షణపడి తిరుపతి వచ్చేసింది. నే పన్నిన వలలోనే కోరినపిట్ట పడింది. ఇక దానిని సామదాన భేద దండోపాయాలతో త్రోవకు తెచ్చుకోవటం చాలా తేలికైన పని!"

* * *

రాత్రి చాలా పొద్దుపోతోంది. గదిలో పడుకునివున్న కల్యాణికి నిద్రపట్టలేదు...

ఇక్కడికి వచ్చాక ఎన్నో దృశ్యాలు ఆమెలో ఎన్నోరకాల ఆలోచనల్ని రేపుతున్నాయి.

రమేష్ అస్తమానూ 'రాధా! రాధా' అంటూ పలవరిస్తూ,ఆమె చుట్టూరా ప్రదక్షిణాలు చేస్తుండటం ఆమెకు అన్నిటికంటే ఆశ్చర్యకరమైన విషయంగా కనిపించింది. రాధ చెప్పుకోదగినంత సౌందర్యవతేం కాదు. కాని రమేష్‌ను అంతలా ఆకర్షించుకొనగల అయస్కాంత శక్తి ఏదో ఆవిడలో వుందనిపిస్తోంది.

వాళ్ళిద్దరి కిద్దరూ ఎంతో సంతృప్తిగా, ఎంతో హాయిగా అరమరిక లేని జీవితాన్ని గడుపుతున్నారు.

కాని తమ దాంపత్య జీవితం? అస్తమానూ చిరాకులతో, వాగ్వాదాలతో చికాకుగా గడిచిం దెందుకో? అది ఎవరి లోపం? ఉపేంద్రదా? తనదా?

ఇక్కడికి వచ్చాక మనోహార్ మూడుమార్లు వచ్చాడు తనతో మాట్లాడటానికి.

మారు అతగాడిపట్ల చూపలేదు...మూడోమారు అసలు మనోహర్‌ను చూపినట్లు కూడా కనిపించకుండా నిర్లక్ష్యం చేశాడు...ఆరోజు సాయంత్రం మనోహర్ చనువుగా "ఏదేనా షికారు వెళ్దాం రాండి కల్యాణిగారూ!" అన్నాడు.

తనకూ అలాగే అనిపించింది. రాధా, రమేష్ అస్తమానూ కిలకిల నవ్వుకుంటూ, ఏవో కబుర్లలో వుంటారు...వాళ్ళిద్దరి మధ్యా తను ప్రవేశించటం బొత్తిగా అసభ్యమనిపిస్తుంది తనకి. ఒంటరితనం తనకి బోర్ కొట్టేస్తోంది.

"అలాగే వెడదాం" అంది. అలా కాస్సేపు బయటికి వెళ్లిరా గలిగితే కొంత మనశ్శాంతి చేకూరుతుందనుకుంది.

తీరా డ్రెస్ చేసుకుందో లేదో, రమేష్ అన్నయ్య అడ్డొచ్చాడు "ఎక్కడికి కల్యాణీ?" అంటూ.

"అలా కాస్సేపు షికారు వెళ్దొస్తా అన్నయ్యా!" అంది.

"మనోహర్‌తోనా?" ఆ కంఠస్వరంలో కటుత్వం తాలూకు జీరలు పలుకుతున్నాయి.

"ఊఁ"

"వీల్లేదు! అతగాడితో వెళ్ళటమేమిటి నువ్వు?" అదిరిపడింది. ఎవరు? తన అన్నయ్యే ఇలా మాట్లాడుతున్నాడా? ఇంత సంకుచితత్వం తన కెప్పుడు వచ్చింది?

"అన్నయ్యా! నీకూ మీ బావగారి జాడ్యం పట్టుకుందా ఏమిటి?" అని అడిగింది ఆశ్చర్యం ప్రకటిస్తూ. అంత కోపంలోనూ చిరునవ్వు నవ్వాడు రమేష్.

"నాకే కాదు, ప్రతి మగాడికీ ఈ జాడ్యం వుండి తీరాలి"

"అంటే?"

"భర్తగా ఉపేంద్ర నిన్ను కాపాడు కోవాలి. అందుకే అతగాడు కటువుగా ప్రవర్తించక తప్పలేదు. నువ్వు కొంత అతగాడిని అర్థం చేసుకోగలిగి వుంటే, ఇంత దూరం వచ్చేదికాదు మీ వ్యవహారం...."

కల్యాణి నిశ్చేష్టురాలైంది....ఇవన్నీ రమేష్ కెలా తెలిశాయి?

ఆమె కళ్ళల్లోని ప్రశ్నను చదివిన వాడిలా రమేష్ నవ్వాడు.

"ఉపేంద్ర నాకంతా వివరంగా ఉత్తరం వ్రాశాడు.... ఈనాడు నీ అన్నయ్యగా నిన్ను కాపాడవలసిన బాధ్యత నామీద వుంది.... అంచేత—ఎవరి వెంటపడితే వారివెంట నువ్వు వెళ్ళటానికి నీల్లేదు!"

"నామీద నీకు విశ్వాసం లేదా అన్నయ్యా?" కల్యాణి అభిమానం దెబ్బతింది. ఆమెకు ఒక్కసారిగా కన్నీళ్ళు వచ్చాయి. ఉపేంద్ర తనని అనుమానించటం, తనమీద ఆంక్షలు విధించటమూ తనని అర్థం చేసుకోలేకపోవటం వల్లా, సంకుచిత మనస్తత్వంవల్లా అనుకుంది. కాని తనను చిన్న తనం నుంచీ ఎరిగిన అన్నయ్య, తన మనస్తత్వం ఎలాటిదో తెలిసిన రమేష్ తనని అనుమానిస్తున్నాడా?

గబుక్కున కల్యాణి భుజాలచుట్టూరా చేతులు వేశాడు రమేష్.

"నా బంగారు చెల్లాయ్! నీ మీద నాకు అపనమ్మకమా? కలలో కూడా అలాటిది లేదు! కాని ... మన మెంత పై అంతస్తు వాళ్ళ మయినా మనమూ కొన్ని కట్టు బాట్లు పాటించాలి. సరిగా ఇక్కడే నీకూ ఉపేంద్రకూ మనస్పర్థలు వచ్చాయి. మనోహర్ నీ దృష్టిలో ఓ మాంచి స్నేహితుడే కావచ్చు.... కాని లోకం అలా భావించదు. అతగాడు పురుషుడు. నువ్వు స్త్రీవి.

మిగతా కథంతా లోకమే అల్లి ప్రచారం చేస్తుంది. అలాటి అవకాశం ఎందుకివ్వాలి? అనవసర దూషణ కెందుకు ఎర కావాలి?"

ఓసారి ఉపేంద్రా ఇలాగే అన్నాడు. కల్యాణి తల గిర్రున తిరిగినట్లయింది క్షణకాలం.

"సాయంత్రం నువ్వూ, నేనూ, రాధా కలిసి ఏదేనా పిక్చర్‌కు వెడదాం.... మరోమాట.... తరచూ ఇక్కడికి రావద్దని మనోహర్‌ను హెచ్చరించబోతున్నాను రేపు."

విశ్రాంత పోతూ నిల్చుండి పోయిం దలాగే కల్యాణి. ఉపేంద్ర పేదరికంలో నుంచి వచ్చినందువల్ల అలాటి సంకుచిత భావాలు కలిగి వున్నాడని తను తలపోసింది. కాని రమేష్ అన్నయ్య కూడా అదే ధోరణిలో మాట్లాడుతున్నాడు!

పక్క గదిలో రాధ కిలకిల నవ్వుతోందెందుకో! రమేష్

కంఠస్వరం మంద్రస్థాయిలో మృదుమధురంగా స్పష్టాస్పష్టంగా విని పిస్తోంది.

ఏమిటో ఒంటరి తనం. ఏదో చికాకూ కల్యాణిని నిలువెల్లా బాధించసాగాయి.

# 22

"డాక్టర్ ఉపేంద్రగారికి,

నమస్కారం.... నేను కుసుమను. గుర్తువచ్చాననుకుంటాను ....నాకు తొమ్మిది నెలలు నిండాయి....బహుశా ఓ వారం రోజుల్లో పురుడు రావొచ్చని ఇక్కడి లేడీ డాక్టర్ చెప్పారు....

డాక్టర్! ఆరోజు....దిక్కుతోచని పరిస్థితుల్లో....మీరే నాకు ధైర్యం కలిగించి, బ్రతుకుమీద ఆశ కలిగించారు....కాని ..ఏమిటో భయం నన్నింకా వెంటాడుతూనే వుంది....ఈరోజు కేవలం నాసొద వెళ్ళబోసుకోవటానికి....నేను యీ వుత్తరం వ్రాయటంలేదు....

మీ శ్రీమతి,..కల్యాణిగారు....ఏదో విషవలయంలో చిక్కుకుని వున్నారనిపిస్తోంది నామటుకు నాకు...అందుకు మనోహరే కారణమని నాకు నా స్నేహితురాలు ఒకర్తె ద్వారా తెలిసింది. మీ భార్యాభర్తల మధ్య, ఆతగాడివల్ల, దూరం ఏర్పడిందని తెలిసింది.... ప్రస్తుతం, మనోహర్ ఇక్కడే వుంటున్నాడు. ఈ పరిస్థితుల్లో నేను కల్యాణిగారిని కలుసుకోవటానికి వీలులేక మానేశాను....కాని ఆవిడ అమాయికురాలని మాత్రం నాకు తెలుసు....అర్థంలేని ఆవేశంలో తనేమై పోతోందో ఆవిడకు బహుశా తెలిసి వుండదు....

డాక్టర్! నా దొక్కమనవి....మీరు ఓమారు ఇక్కడికిరాండి... వారం రోజులలో తప్పకరాండి..,కల్యాణిగారిని ఎలాగో...తిరిగి మీ మార్గానికి తెచ్చుకోండి.,.నేనూ మీతో నా పుట్టబోయే పాప విషయమై మాట్లాడాలి...దయచేసి వస్తారు కదూ? ఏమో వ్రాశాననుకోకండి.,.

మీ సోదరి

కుసుమ"

జాబు చదువుతూ ఆలోచనలో పడ్డాడు ఉపేంద్ర...మనోహర్ మీద ఈ మధ్య పోలీసులు నిఘావేసి వుంచారని, అందుచేత అతగాడు అలా అలా తిరుగుతున్నాడని తనకు తెలిసింది...కాని తిరిగి అక్క-డికే మనోహర్ చేరటంలో అతగాడి ఉద్దేశం?

"ఉపేంద్రా?"

పిలుపు విని తుళ్ళిపడ్డాడు ఉపేంద్ర.

"ఏమిటోయ్ అంత పరధ్యానంగా వున్నావు? ఓహో, కల్యాణి వదినగారిని గురించి చింతా?" అంటూ భాస్కర్ ఎదురుగా సోఫాలో కూర్చున్నాడు.

రాని నవ్వు నవ్వాడు ఉపేంద్ర....

"ఇదో శుభలేఖ...ఓ నాలుగు రోజులు ముందుగా, అందరం తిరుపతికి చేరుకోవాలని నా ఉద్దేశం..."

"అరె! ఇంక పదిహేను రోజులే వుంది ముహూర్తానికి" అన్నాడు ఉపేంద్ర శుభలేఖ చదువుకుంటూ.

"అవును."

"మంగళవారం అందరం బయలుదేరాలి.... మరి!"

"ఊ!"

"నువ్వు తప్పక ఆరోజు బయల్దేరాలి ఉపేంద్రా!"

"అలాగే!"

భాస్కర్ వెళ్ళిపోయాడు.

తిరిగి మరోమారు కుసుమ ఉత్తరం చదువుకున్నాడు ఉపేంద్ర. అతగాడి బుర్ర వేడెక్కిపోతోంది అంతకంతకూ!

* * *

చుట్టూరా విరగబూసిన రకరకాల చెట్లు చిరుగాలికి అందంగా తలలూపుతున్నాయి. గుట్టలుగుట్టలుగా వున్న రాళ్ళ తిప్పల మధ్య నుంచి మెల్లిగా నడుస్తోంది కల్యాణి. సాయం సంధ్యారుణ కిరణాలు ఎర్రగా నేలమీద పరుచుకుని వున్నాయి.

ఏదో అశాంతి, మరేదో బాధ ఆమెను నిలువెల్లా దహించి

నుంచి ఒంటరిగా బయల్దేరి త నిలా వచ్చేసింది. ఏకాంతాన్ని కోరు తున్న తన హృదయానికి వాతావరణం అనువుగా వున్నట్లు తోచింది....

విరగబూసివున్న మొక్కలమధ్య కూర్చుంది కళ్యాణి. ఆ చుట్టూ వలయాకారంలో కొండ లున్నాయ్. ఇంత చక్కటి ప్రకృతిని చూసుకొనే శ్రీనివాసుడు ఇక్కడ తన నివాసం స్థిరంగా ఏర్పరచు కొన్నాడు.

హఠాత్తుగా తన భుజాలను పట్టుకున్న బలిష్ఠమైన చేతుల స్పర్శకి తుళ్ళిపడి లేవబోయింది కల్యాణి.

"లేవకు కల్యాణీ!" మనోహర్ కంఠస్వరం చెవి దగ్గరగా వినిపించి ఆమె బ్రాన్పడింది.

"మనోహర్! మీరా?" గాభరాగా లేచి, అతగాడి ప్రవర్తనకు విస్తుపోయి దూరంగా జరిగింది కల్యాణి.

"అవును—నేనే కల్యాణీ! ఇంత చక్కటి వాతావరణం, ఏకాంతం లభ్యమయ్యాయి. ఇక నన్ను నేను నిగ్రహించుకోలేను... అలా బెదిరిపోతా వేం?...." మనోహర్ నవ్వుతూ దగ్గరగా వస్తున్నాడు.

ఆ ఏకవచన ప్రయోగంతో బాటు, అతగాడి కళ్ళల్లో కనిపి స్తున్న ఎర్రని జీరల్లో హృదయంలోని నీచభావం స్పష్టంగా కని పిస్తోంది.

"మనోహర్!" అని గట్టిగా అరిచింది. "నీ స్నేహంలో యింతటి నీచత్వం వుందా?" అంది ఏహ్యభావంతో.

మనోహర్ పకపక నవ్వాడు.

"నీ అందం ఎలాంటివాడికైనా నీచత్వాన్ని రేకెత్తిస్తుంది కల్యాణీ!"

"షటప్-యూ స్కౌండ్రల్!" అని గర్జించింది. కోపంతో ఎర్రబడిన ఆమె ముఖం మనోహర్‌ని మరింత కవ్విస్తోందని ఆమెకు తెలియదు.

"కోపంలో అందమైన ఆడాళ్ళు మరింత అందంగా వుంటారు

సుమా! కల్యాణీ, నా మాట విని—గొడవ చెయ్యకు. లేకపోతే నే నెలా మారుతానో నాకే తెలీదు!"

మరు నిముషంలో రమేష్ బలిష్ఠమైన చేతులు మనోహర్ ఒంటిని హూనం చేసి విడిచాయి.

"కల్యాణీ!

మీ రమేష్ నన్ను తన్ని తగిలేశాడని. నా పీడ విరగడైం దని నువ్వనుకొంటున్నావు కాబోలు. ఇదో యీ ఫోటో చూడు. నువ్వు నా చేతుల్లోంచి ఏనాటికీ తప్పించుకోలేవు. ఈ ఫోటో నెగెటివ్స్ నా దగ్గరే వున్నాయి. ఈ కాపీ మీ శ్రీవారికి పంపిస్తు న్నాను యీ రోజే!

అది చూశాక ఉపేంద్ర నిన్ను తిరిగి కలలోకూడా స్వీకరిస్తా డని వూహించ నక్కర లేదు. ఎలాగూ జీవితం ధ్వంసమైపోయిం దీ నాడు.

ఇప్పుడైనా మించిపోయిం దేమీ లేదు....యెన్నో ఘరానా కుటుంబాలలో యిలాటి లోపాయికారీ వ్యవహారాలు జరుగుతూనే వున్నాయి. అది గ్రహించుకుని నువ్వు నన్ను అంగీకరించావో, యే గొడవా వుండదు. లేకుంటే, ఆ నెగెటివ్ డెవలప్ చేసి అన్ని పేపర్లకూ పంపిస్తాను. నీ పరువు ప్రతిష్ఠలు బుగ్గిపాలు చేస్తాను. నే నెవరో నీకు తెలుసు—

నీ........"

ఉత్తరం చదువుకుని ఫోటోకేసి చూసిన కల్యాణి ముఖం ఒక్కసారిగా వివర్ణమైపోయింది.

ఫోటోలో తన వెనకగా నిల్చుని, మనోహర్, తన రెండు భుజాలూ పట్టుకుని మధురంగా, చిలిపిగా నవ్వుతూ తన ముఖంలోకి చూస్తున్నాడు....తన తల అతగాడి హృదయానికి దగ్గరగా వుంది. ఎలా వచ్చిం దీ ఫోటో.

చప్పున ఆరోజు పిక్నిక్ సందర్భంలో నిమ్మీ, తానూ, మనో హర్ ఒకచోట చేరిన దృశ్యం జ పికి వచ్చింది.

దాంతో అంతా గుర్తుకొచ్చింది కల్యాణికి.... అసహ్యంతో, భయంతో, ఆవేదనతో ఆమె హృదయస్పందన మరింత ఎక్కువై పోయింది. అసలు తనెంత మూర్ఖురాలు! ఉపేంద్ర చెబుతున్నకొద్దీ తను రెచ్చిపోయింది. అతగాడు ధనవంతు డయ్యాడని, జన్మతః అతను సంస్కారహీనుడు, సంకుచిత స్వభావుడు అని పదేపదే అంటూ వచ్చింది.

కాని ఉపేంద్ర ఎంత ఆలోచనా పరుడు!

"కళ్యాణీ! స్నేహితానిక్కూడా ఓ అర్థంతంటూ ఉండాలి!" అని అతను మందలిస్తుంటే, మనోహర్ అందగాడని అసూయ జెందుతున్నాడని, తన నేదో కట్టు దిట్టంలో పెట్టాలని చూస్తున్నాడని ఊహాగానాలు చేసి, నోటికి వచ్చినట్లల్లా వాగి అతడి హృదయాన్ని ఎంతగానో నొప్పించింది.... ఒకటొకటిగా తమ ముగ్గురి మధ్య జరిగిన ఎన్నో వాగ్వాదాలు, సంఘటనలూ సినిమా రీలులా గిరగిర తిరిగాయి, ఆమె మనోనేత్రంముందు.

తన కళను మనోహర్ మెచ్చుకుంటున్నాడని, అతగాడు కళా హృదయంగల ఓ పెద్ద మనిషని ఊహించిందేగాని, చివరకు ఇంతటి పాడు బుద్ధిగల నీచుడని తెలుసుకోలేకపోయింది. ఎంత సాహసం! "ఎన్నో ఘరానా కుటుంబాలలో ఇలాటివి జరుగుతూనే వున్నాయి" అంటూ వ్రాశాడు. అలాటి వారిలో తనూ ఒకర్తె అని భావించు కున్నాడన్నమాట. ఎంత కుసంస్కారి!

ఇంత నీచ మనస్తత్వంగల మనిషిని, తనేదో గొప్ప కళా కారుడని, మహామంచివాడని భావించి, స్నేహం పెంపొందించుకొంది. చివర కా పిక్నిక్ రోజున నిమ్మి మనోహర్‌లు పన్నిన వలలో కళ్ళు మూసుకుపోయింది తను!

ఆ రోజు ఉపేంద్ర హెచ్చరిక యింకా తన చెవుల్లో మారు మోగుతూనే వుంది. "కళ్యాణీ! కళ్ళున్న గ్రుడ్డిదానివి. చెవులున్న చెవిటిదానిగా మారిపోయావ్!"

అక్షరాలా నిజమే! అమృతభాండాన్ని చేతుల్లో వుంచుకొని కూడా గుర్తించలేక, దానిని బ్రద్దలు కొట్టుకుని, కాలకూట విషాన్ని

ఆహ్వానించి ఆప్యాయంగా చేతపెట్టుకొంది....కనీసం ఉపేంద్ర హెచ్చరిస్తున్నా తనెందుకు గమనించలేకపోయిందో!

ఈ ఫోటో ఉపేంద్ర చూస్తే? నిజంగా తను ఇలాటి పతనావస్థలో పడిందని భావించడా? తన గతేం కావాలి? ఈ ఫోటో చూశాక, ఇక ఈ జన్మలో ఉపేంద్ర తన ముఖం చూస్తాడా? జీవితాంతం తను భర్తృవిహీనలా బ్రతకాలా? ఎంత సిరి వున్నా, స్త్రీకి భర్త ఆలంబన ఎంత అవసరమో, ఆ భర్త సాన్నిధ్యంలో స్త్రీ పొందగల మానసిక తృప్తి ఎటువంటిదో తను ఇక్కడికి వచ్చాక, రాధ, రమేష్‌లను చూసి బాగా అర్థం చేసుకోగలిగింది....భగవాన్ ఏమిటి తన కింక దారి?

అలా ఆలోచిస్తున్న కల్యాణి కెవ్వున కేక వేయడం, ఆ కేక విని రమేష్ దబ్బున పరిగెత్తుకు రావటమూ జరిగాయి. సోఫాలో స్పృహ తప్పివున్న చెల్లెలిని, చెల్లెలిచేతిలో వున్న ఉత్తరాన్ని, ఫోటోనూ చూసి రమేష్ విభ్రాంతపోయాడు.

* * *

"సుశీలా! ఏమి టవి?"

గది గుమ్మంలో నిల్చుని గర్జించాడు మనోహర్. ఆ గర్జనకి సుశీల చేతిలోని నెగెటివ్స్ దభాలున కిందపడ్డాయి. మళ్ళీ వాటిని తీసుకుని గట్టిగా పట్టుకుంది.

జబ్బుతో పాలిపోయి, కళ్ళు గుంటలుపడి, కేవలం ఎముకల పోగులా తయారైన సుశీల కళ్ళల్లో జీవకళ మినుకు మినుకు మంటోంది. ఒక్కమాటు ఆ కళ్ళు అగ్నిగోళాల్లా, అతని దారుణాలకి మండిపడుతూ ప్రజ్వలించాయి.

సన్నగా గాలికి ఊగులాడుతున్న పూచికపుల్లలా వున్న సుశీల, వికృతంగా నవ్వింది...."ఏం పనో చెబుతాగా" అంది అలాగే నవ్వుతూ.

క్షణకాలం మనోహర్ విస్తుపోయాడు. తనముందు సుశీల ఎన్నడూ అలా నవ్వలేదు....అంత ధైర్యంగా మాట్లాడలేదు....ఈ మనిషి ఉన్మాది కాలేదుకదా?

"అరె....మళ్ళీ నా డైరీ తీశావ్?" అని ఉగ్రుడయాడు.

"ఊఁ, సాంతం చదివానుకూడా....కాని ఇది మీ డైరీ కాదు. మీ డైరీకి నకలు మాత్రమే—"

మరింత క్రోధంతో భార్యకేసి చూశాడు మనోహర్.

"శ్రీవారూ! ఏ ఆటకయినా ఓ అంతమంటూ వుంటుంది. ప్రతిసారీ ఒకేఆటగాడు గెలుపొందడు.మీ ఆటకూడా త్వరలో అంతం కాబోతుంది. కాని యీసారి గెలుపు మీదికాదు. బహుశా యీ ఆటను ప్రేక్షకురాలుగాచూస్తున్న నాది ఆ గెలుపు. ఇది నా తీర్పే! అయినా నిష్పాక్షికంగా చేశాను కదూ?"

మనోహర్ కేమీ అంతుబట్టలేదు. సుశీలకు మతిస్థిరం తప్పిందేమో అన్న ఆలోచన బలీయమైంది అతనిలో.

"పాపం! కల్యాణిని మోసంచేసి మీరూ, విమ్మీ కలిసి అప్రతిష్ఠపాలు చేసే సన్నివేశంలో ఆమెకు తెలియకుండా మరో ఫోటో తీసి....ఆ ఫోటోలు కల్యాణీ, ఉపేంద్రలకు పంపారా? ఇంకా ఆ నెగెటివ్స్ సాయంతో, వాళ్ళిద్దర్నీ బెదిరించదలుచుకున్నారా? అబ్బో! ఎంత పెద్ద ప్లాను! ఎంచక్కా వేసుకున్నారు! కాని ఈలోగా మీరే ....మీరు తవ్విన గోతిలో మీరే పడిపోతే ఏం చేస్తారు?"

మనోహర్‌కి బాగా కోపం వచ్చేసింది. కాని ఏమనాలో, ఏం చెయ్యాలో పాలు పోలేదతగాడికి.

"మీ డైరీ నేను చదవగలనని తెలిసికూడా మీరెందు కలా పడేశారు నిర్లక్ష్యంగా? బహుశా భార్య ఏం చెయ్యగలదనే భరోసా కావచ్చు....అవునా?"

"ఏం చేస్తా వేమిటి?" పెద్దగా అరిచాడు మనోహర్.

మళ్ళీ పిచ్చిగా నవ్వింది సుశీల—"ఏం చేస్తానో చూస్తారుగా? మీ డైరీ కుసుమ దగ్గరకు వెళ్ళింది....అది త్వరలో ఉపేంద్రకు చేరుతుంది...మీ ఆట కడుతుంది."

క్షణకాలం దిమ్మెరపోయాడు మనోహర్....మరుక్షణంలో హద్దు మీరిన కోపంతో కంపించిపోతూ పిడికిళ్లు బిగబట్టి, సుశీల దగ్గరగా వచ్చాడు.

చప్పున అతగాణ్ణి తప్పించుకు గది బయటికి వచ్చింది సుశీల....ఆమె చేతిలోని నెగెటివ్స్ ముక్కలు ముక్కలుగా మారి బాల్కనీలోంచి కిందికి పడిపోయాయి చెల్లాచెదురుగా!

"సుశీలా!"

గర్జిస్తూ దగ్గరగా వచ్చిన మనోహర్‌లో యుక్తాయుక్త విచక్షణ జ్ఞానం నశించింది....ఆమెను ఒక్కతోపు తోశాడు.

కెవ్వుమని అరుస్తూ, మేడమెట్లమీదనుంచి చాప బుట్టలా కిందకు దొర్లుతున్న కోడలిని చూసి నిశ్చేష్టురాలైంది సావిత్రమ్మ.

# 23

చేతిలోని ఫోటోలోకి తీవ్రంగా చూస్తున్న ఉపేంద్ర ముఖంలోకి శరీరంలోని రక్తమంతా పొంగివచ్చినట్లయింది.........ఫోటోలో మనోహర్ కల్యాణి వెనుకగా నిల్చుని, ఆమె భుజాలు పట్టుకుని నవ్వుతూ ఏదో చెబుతున్నట్టున్నాడు. కల్యాణి మెడ పక్కకు తిప్పి వుంది. ఇలాంటి సన్నివేశానికి కల్యాణి అంగీకరించిందా? ఇంతలా దిగజారిపోయిందా? ఉపేంద్ర హృదయం కుతకుత లాడిపోతోంది.

నిముషాలు భారంగా దొర్లుతున్నాయి. మెరుపుల్లా కుసుమ ఉత్తరంలోని మాటలు గుర్తుకొచ్చాయి. "మీ శ్రీమతి—కల్యాణి గారు ఏదో విషవలయంలో చిక్కుకుని వున్నారనిపిస్తోంది డాక్టర్, నాకు."

మళ్ళీ ఫోటో చూశాడు పరీక్షగా. ఇదేనా విషవలయం? చిక్కుకోడం ఎలా సంభవించిం దసలు?

ఫోటోలో కల్యాణి ముఖం నివ్వెరపోయినట్లు కనిపిస్తోంది. ఏమిటో అంతా అయోమయంగా, తన చుట్టూ వున్న భూమి గిరగిర తిరుగుతున్నట్టుంది ఉపేంద్రకు. సుమారు ఓ గంట తర్వాత హఠాత్తుగా హోల్డాల్, సూట్‌కేసూ సర్దుకుని. ఎక్కడికో, ఏమిటో

ఎవరికీ చెప్పకుండా కారులో వెడుతున్న ఉపేంద్రను చూస్తూ విభ్రాంతి వుండిపోయింది మంగమ్మ.

*　　　*　　　*

"మై డియర్ ఫ్రెండ్! మనోహర్! ఇదిగో నీకు చక్కటి బహుమతి...."

డి. యస్. పి. చంద్రశేఖర్ నవ్వుతూ మనోహర్ దగ్గిరగా వచ్చాడు. అతగాడి వెనకనే, ఇద్దరు కానిస్టేబిల్స్ వచ్చి మనోహర్ చేతులకు బేడీలు తగిలించబోయారు!

'వ్వాట్?' ఒకడుగు వెనక్కి వేస్తూ అన్నాడు మనోహర్ తెల్లబోయి. మరునిమిషంలో అతగాడి ముఖం కోపంతో ఎర్ర వారింది. "మీ పరువుప్రతిష్ఠలు మంటగలుపుకోవా లనుకుంటున్నారా? మీకు సంబంధించిన ఫోటోలు—నా దగ్గరున్నాయని మరచిపోతు న్నారా చలపతీ!"

కేకతోబాటు చలపతి ఓ చిన్నకవరు పట్టుకువచ్చాడు.

"చూడుకోండి" అంటూ నిర్లక్ష్యంగా కవరు చంద్రశేఖర్ ముందుకు తోశాడు మనోహర్.

చిరునవ్వుతో కవరు ప్యాంట్ జేబులో వేసుకున్నాడు చంద్ర శేఖర్.

"వాటి తాలూకు నెగెటివ్స్ నాదగ్గరే వున్నాయని మరిచిపోయా రల్లే వుంది. అవి అన్ని ప్రముఖ పత్రికలలో ప్రకటితం కావటమూ, తద్వారా మీ పరువు రచ్చకెక్కి, మిమ్మల్ని అధికారులు వుద్యో గంలో నుంచి లాగివేయటమూ—క్షణకాలం దృశ్యాలుగా ఊహిం చుకోండి మిస్టర్ చంద్రశేఖర్!" పెద్దగా నవ్వాడు మనోహర్.

మరింత పెద్దగా నవ్వాడు చంద్రశేఖర్....."అలాగేలే. ఆట్టే టైం లేదు....బేడీలు తగిలించండి...."

మరునిముషంలో చలపతికీ, మనోహర్‌కీ బేడీలు పడ్డాయి.

"డియర్ ఫ్రెండ్! ఎప్పుడూ మోసమూ, కపట నాటకాలే జయిస్తా యనుకోకు....నీ దగ్గరున్న నెగెటివ్స్, ఫోటోలు, టేప్ రికార్డరు సరంజామా అంతా ఓ కంట కనిపెడుతూనే వున్నాను.

సమయం కోసం వేచి వున్నాను....ఈనాటి కది లభ్యమయింది.... పదండి ముందస్తుగా హాస్పిటల్‌లో మీ శ్రీమతిగారు మరణ వాఙ్మూలం ఇవ్వబోతున్నారు. అక్కడికి వెళ్ళి ఆ తర్వాత నేరుగా శ్రీకృష్ణ జన్మస్థానం వేపు వెడదాం." వెటకారంగా అంటూ, అతగాడిని వాన్‌లోకి తోశాడు చంద్రశేఖర్.

కొన ఊపిరి కొట్టులాడుతోంది సుశీలలో....తల నిండా కట్టి వున్న కట్లతో ఆమె ముఖం మరింత వికృతంగా వుంది....సావిత్రమ్మ బిగ్గరగా ఏడుస్తోంది. "వాడు నా కొడుకు కాదు. యమకింకరుడు....వాడు పోయినా నా కింత బాధనిపించేది కాదు. భగవంతుడా ....ఎలాంటి పరీక్ష పెట్టావు తండ్రీ!"

"మీరు కాసేపు ఊరుకోండమ్మా! పేషెంటుకు కొద్దిగా తెలివి వస్తోంది....త్వరగా వాఙ్మూలం వ్రాసుకోవాలి."మేజస్ట్రేటూ, డాక్టరూ హెచ్చరించా రామెను.

సుశీల కళ్ళు కొద్దిగా విడివడ్డాయి. మేజస్ట్రేటు కాగితం, పెన్ రెడీగా వుంచుకున్నాడు.

డాక్టరు మెల్లగా అడిగాడు. "మీరేమయినా చెప్పదలుచుకున్నారా?"

సుశీల పేలవంగా నవ్వింది....మెల్లిగా మూలిగింది. అతి హీనస్వరంతో "ఊఁ" అంది.

రూం అంతా నిశ్శబ్దం తాండవం చేస్తోంది.

"వారి డైరీ కుసుమ దగ్గర వుంచాను. ఆ డైరీలో వారికి సంబంధించిన అన్ని వివరాలూ వున్నాయి. వారి ఆఫీసు రూంలో గాద్రేజ్ బీరువాలో, ఎందరి తాలూకువో ఫోటో నెగెటివ్స్ వున్నాయి. వాడు నా భర్త అని చెప్పుకోవటానికి కూడా సిగ్గుపడుతున్నాను, ఇలాటి భర్తను స్వార్థపరురాలినై, శిక్షనుంచి తప్పించి, దేశంలో నేరస్థులను పెంచడం నాకిష్టం లేదు.

డాక్టరు ఉపేంద్రగారి విషయంలో కూడా ఇలాటి ఫోటోలే ఏవో సృష్టించారు....డాక్టరు ఉపేంద్రగారికి, నా మాటగా, ఈ విషయాలు చెప్పగోరుతున్నాను...."

ఆపి ఆపి, హీనస్వరంతో చెబుతున్న సుశీల మాటలు తక్కున ఆగిపోయాయి....ఆమె శాశ్వతంగా కళ్ళు మూసింది.

* * *

"డాక్టర్!" చేతుల్లో ముఖం దాచుకుని ఏడుస్తూంది కుసుమ. ఎందుకో అర్థం కాలేదు డాక్టర్ ఉపేంద్రకి.....ఆమె ప్రక్కలో కళ్ళు తెరవని పసికందు వులిక్కి పడ్డాడు.

"నాకున్న ఒకే ఒక ఆశాకిరణం....కాస్తా మాయమయింది డాక్టర్!" అలాగే రోదిస్తోంది కుసుమ.

"ఏమిటి కుసుమా! ఏమిటమ్మా నువ్వంటున్నది?" ఆప్యాయంగా ఆమె తలమీద చేయివేస్తూ అడిగాడు ఉపేంద్ర.

"మీకు తెలీదా డాక్టర్?" ఆశ్చర్యంగా అడిగింది కుసుమ.

"ఏమిటి?"

"సుశీల....మనోహర్ భార్య సుశీల....నిన్న సాయంత్రం చనిపోయింది."

"ఆ!" నిశ్చేష్టుడయ్యాడు ఉపేంద్ర.

"నిన్న ఉదయంనుంచీ నాకు నొప్పులు ప్రారంభించాయి.... కాని ఆసరికే ఆమెను హాస్పిటల్‌కి తీసుకెళ్ళారు. ఆమె ఏవో నెగెటివ్స్ చింపి పారవేసిందనే కోపంతో, మనోహర్ ఆమెను మేడ మెట్లమీదినుంచి తోసివేశాడు. సుశీలకి బలమైన గాయాలుతగిలాయి. ఆ గాయాలవల్ల ఆమె చనిపోయింది."

కుసుమ ఆగింది....

తను కూర్చున్న కుర్చీ అధఃపాతాళానికి కుంగిపోతున్నట్లనిపించింది ఉపేంద్రకి.

"మొన్న నాకు మనోహర్ డైరీ పంపింది తను....ఇలాంటిదేదో ముందే వూహించింది కాబోలు. అది నా దగ్గరే వుంది..... డాక్టర్....ఆ డైరీలో మీ దంపతుల మధ్య వచ్చిన కలతల తాలూకు వివరాలన్నీ వున్నాయి...."

తలగడ కిందనుంచి డైరీ తీసి, ఉపేంద్ర చేతిలో వుంచింది కుసుమ.

"నిన్న రాత్రి వీడు పుట్టాడు...."

పసిబిడ్డకేసి క్షణకాలం చూశాడు ఉపేంద్ర....

"డాక్టర్! నేను నా భవిష్యత్తును నిర్ణయించుకున్నాను...." దృఢంగా అంది కుసుమ.

"మంచిది" అన్నాడు ఉపేంద్ర.

"నాకు మరో వివాహంచేసుకొనే వుద్దేశం లేదు....మీరంగీకరిస్తే, నర్స్ ట్రెయినింగ్ అయి మీదగ్గర నర్సుగా పని చేస్తాను."

"మరి చంటిపిల్లాడు?"

"మీకు తెలిసినవారిలో....వీడిని సాకే సహృదయు లెవరైనా వుంటే వారికి అప్పగిస్తాను...."

ఉపేంద్ర ఆశ్చర్యంగా చూశాడు కుసుమవేపు.

"అవును డాక్టర్! నా దగ్గరేవుంటే వీడిలో అనుక్షణం మనోహర్ పోలికలు నాకు కనిపిస్తుంటాయి. మనోహర్ దుర్మార్గం, ధూర్తత్వం జ్ఞాపకం వస్తూంటాయి. అతడినిలాగే వీడిని కూడా— ద్వేషిస్తానేమో అని నా భయం..."

"కాని సహృదయులు దొరకాలి కదా?" ఉపేంద్ర ఆలోచనలో పడ్డాడు. మెరుపులా ఎవరో తట్టారు.

"వస్తా కుసుమా! మనస్సు చికాకుగావుండి అలా అలా తిరిగి నువ్వు వ్రాసిన అడ్రస్ ప్రకారం ముందుగా నీ దగ్గరకి వచ్చాను. ఇక కల్యాణీ రమేష్‌ల దగ్గరకి వెళ్లాలి..."

కుసుమ ఇంకేమీ అనలేదు.

ఉపేంద్ర బయలుదేరాడు.

* * *

"ఉపేంద్రా, నువ్వా? రా! రా!"

రమేష్ తన కళ్ళని తానే నమ్మలేకపోయాడు. ప్రళయ కాల రుద్రునిలా మండిపడవలసిన ఉపేంద్ర...,ప్రశాంత గంభీరమూర్తిలా చిరునవ్వులు చిందిస్తున్నాడే! క్షణకాలం అది తన భ్రమేమో అన్న సంశయం కలిగింది రమేష్‌కి.

"ఏమిటి రమేష్! అలా కొయ్యబారిపోయావు?"

దగ్గరసావచ్చి, భుజంమీద చెయ్యివేసి ఉపేంద్ర అప్యాయంగా అలా అనడంతో తెప్పరిల్లాడు రమేష్.

"రాధా! రాధా! చప్పున రా బయటికి...ఎవరొచ్చారో చూడు. కల్యాణీ! ఓ కల్యాణీ!"

హడావుడి పడిపోతున్నాడు రమేష్...చేతిలోంచి జారి కింద పడిన గాజు గ్లాసు పగిలిపోయిందనీ, అందులోని అమృతము నేల పాలై పోయిందనీ అనుకుంటున్న వ్యక్తి ఆ గ్లాసు, అందులోని అమృతమూ చెక్కు చెదరకుండా వున్నాయని తెలియడంతో కలిగే ఆశ్చర్యం, ఆనందం రమేష్‌లో తొక్కులాడాయి.

మేడమీద గదిలో మంచంమీద ఉన్మాదినిలా పడుకుని వున్న కల్యాణికి రమేష్ మాటలూ, అతగాడి పిలుపూ వినిపించి ఒక్క సారిగా కొయ్యబారిపోయింది. ఉపేంద్ర వచ్చారా? ఆ ఫొటో చూపించి తనని నిలవేస్తారా? తనేం సమాధానం చెప్పాలి? ఏమని చెప్పినా నమ్ముతారా? తను నిర్దోషినని ఋజువు పరుచుకో గలదా? ఆమె కళ్ళూ, తలా గిరగిర తిరగటం ప్రారంభించాయి.

"అదుగో కల్యాణి! ఎలా తయారయిందో చూడు" కంఠంలో ఆర్ద్రత తొణికిస లాడింది. గది గుమ్మం దగ్గర నిల్చుని కళ్ళలో నీళ్ల కనిపించకుండా చెయ్యాలని వృథా ప్రయాస పడుతున్నాడు రమేష్.

ఉపేంద్ర కల్యాణి వేపు చూశాడు. కల్యాణి ఉపేంద్ర వేపు చూసింది. ఇరువురి కళ్ళూ క్షణకాలం కలుసుకున్నాయి.

ఏనాడూ, ఏ క్షణమూ కల్యాణి కళ్ళల్లో ఇంతటి దీనత్వం, ఇంతటి బేలతనం, ఇంతటి ఆర్ద్రత, గుండెలను కలచివేసే భయోత్పాతమూ కనిపించలేదు ఉపేంద్రకి. అగ్ని గోళాల్లా ఉంటాయని తనంతవరకూ ఊహిస్తున్న భర్త కళ్ళు అతి ప్రశాంతంగా, అప్యాయంగా తనను నిలువెల్లా పరికిస్తున్నాయని తెలుసుకున్న కల్యాణి హృదయం పశ్చాత్తాపంతో తనమీద తనకే ఏహ్యభావంతో నిండి పోయింది.

కల్యాణి కళ్ళలో తనకు కావలసిన మాటల్ని...చదువుకున్నాడు ఉపేంద్ర...ఉపేంద్ర కళ్ళలో తను ఆశించని సౌమ్యం, తనకు అంద

దనుకున్న, ఇంక దక్కదనుకున్న జీవిత సాఫల్యం స్పష్టంగా చూడ గలిగింది కల్యాణి.

రమేష్ వెనుదిరిగి వెళ్ళటం ఇద్దరూ గమనించలేదు.

"కల్యాణీ!"

పిలుపుతోబాటు ఉపేంద్ర చేతులు కల్యాణిని చుట్టవేశాయి. మనశ్శాంతి కోల్పోయి భయంతో, బాధతో వన్నె తరిగి, జుట్టురేగి బలహీనంగా తయారయిన కల్యాణిని ప్రేమార్ద్ర చిత్తంతో హృద యానికి హత్తుకున్నాడు.

"మీరు...మీరు..,నన్ను ద్వేషించటం లేదూ?"

ఇంకా నమ్మకం కలగని కల్యాణి మెడ కొద్దిగా పైకెత్తి, అతగాడి కళ్ళలోకిచూస్తూ అడిగింది. ఆమె కళ్ళనిండా నీళ్ళు సుడులు తిరుగుతున్నాయి.

"ప్రతి మగవాడూ చూసి విచలితుడయ్యే సన్నివేశమే ఆ ఫొటోలో కనిపించేది. కాని నీ ముఖంలో ప్రస్ఫుటంగా కనిపిస్తున్న ఆ కంగారు, ఆశ్చర్యమూ అదేదో మోసమని చెప్పక చెప్పు తున్నాయి."

విస్ఫారిన కళ్ళతో చూసింది కల్యాణి.

"నీ మనస్తత్వం నాకు తెలుసు కల్యాణీ! మేలిమి బంగారు లాటి నీ మనస్సులో అహం పాలు, ఆవేశం పాలు ఎక్కువ! అవి ఈనాడు నీలోంచి పూర్తిగా తొలగిపోయాయి అందుకే నీలో ఇందాకా నీవేపు చూసినపుడు, నాకేలాటి కళంకమూ కనిపించలేదు. నా బంగారు కల్యాణీ! మనుషులు వేరు, మనసులు వేరు. మనుషులు పైకి కని పించే తీరువేరు! లోపల చేసే ఆలోచనల దారివేరు. మనుషుల్నిచూసి మనసుల్ని పసికట్ట గలగటం నిజంగా చాలా కష్టమైన పనే!"

"నిజంగా ఆ ఫొటో ఎలా తీశాడో నా కిప్పటికీ అర్థంగావటం లేదు" అంది కల్యాణి. ఆమె హృదయంలో తుపాను అణగి, మబ్బు తెరలు తొలగి శాంతి, కాంతి ప్రవేశించాయి.

"ఇలా"

గుమ్మంలో రమేష్ మాట వినిపించి కల్యాణి దూరంగా జరిగింది.

"క్లిక్ మనిపించేశాను కెమెరా! ఇక చూసుకోండి. కల్యాణీ, ఉపేంద్రా, మీ ఇద్దరూ నేనూ, రాధా చెప్పినట్లు విని, మేము కోరి నన్ని రోజులా ఇక్కడ వుండక పోయారో—

ఈ ఫొటో నెగెటివ్ సాయంతో మిమ్మల్ని బ్లాక్ మెయిల్ చేసేస్తాం!"

రమేష్ తమాషా మాటలకు విరగబడి నవ్వాడు ఉపేంద్ర.

*　　*　　*

మంగళ వాద్యాల మంగళ రవాలతో విజయా భాస్కరుల వివాహం చాలా నిరాడంబరంగా జరిగింది. రమేష్, రాధ, ఉపేంద్ర కల్యాణి చాలా వుత్సాహంగా తిరిగారు. బాలింతరాలు కుసుమ వేడుక చూస్తూ ఓ సోఫాలో కూర్చుంది.

ఆ రోజు రాత్రి విజయా భాస్కర్‌ల కోసం మేడమీద గది అందంగా అలంకరింపబడింది. అదే గదిలో స్టాండ్ ఉయ్యాలలో నెల నిండబోతున్న కుసుమ బిడ్డ పడుకుని నిద్రపోతున్నాడు.

ముగ్గురు జంటలు ఆ గదిలోకి వచ్చారు.

ఆసరికి అక్కడికివచ్చి తన బాబును ఆప్యాయంగా చూసు కుంటున్న కుసుమ మెల్లిగా అంది: "ఈ పసివాడు నే నిచ్చిన పెళ్ళి కానుక. విజయా భాస్కర్‌ల చేతుల్లో ఎలా పెరుగుతాడో, ఎలాటి వాడుగా తయారౌతాడో?"

ఆమె హృదయంలోని బాధ వారందరినీ క్షణకాలం కలవర పరిచింది. భాస్కర్ చొరవ చేసుకు అన్నాడు: "మనసున్న మని షిగా, మంచి మనిషిగా—మీలాటి నిర్మల హృదయుడుగా—ధీరు డుగా తయారౌతాడు వదినా! మీరు నిశ్చింతగా వుండండి."

కుసుమ కళ్ళలో తృప్తి కనిపించింది.

"ఉపేంద్రన్నయ్యా! ఇక నేను నా చదువూ, వృత్తీ గురించి మాత్రమే ఆలోచిస్తాను. వాడు ఈ క్షణంనుంచీ వీరి బిడ్డ" అంది బయటికి నడుస్తూ.

ఉయ్యాల వేపు నడిచి పసికందువేపు చూస్తూ ఉపేంద్ర భాస్కర్‌ని ఉద్దేశించి అన్నాడు: "వివాహ మయ్యాక కొంతకాలానికి, ఇంత చక్కటి బహూమతి లభిస్తుంది అందరు దంపతులకూ. కాని మీ ఇద్దరికీ పెళ్ళితోపాటే ఏ కష్టమూ లేకుండా ఈ కానుకలభించింది!"

భాస్కర్ విజయవేపు చూపి నవ్వాడు. విజయ కళ్ళు దించి వేసుకుంది.

రాధ విజయకేసి చూస్తూ "వచ్చే ఏడాదికి మరో బాబు తయారై తే, యీ బాబును మరిచిపోదు గదా?" అని నవ్వింది.

"అమ్మ బాబోయ్! వచ్చే ఏటికి మరోబాబే? అదేం కుదరదు రాధా! దేశమంతా కుటుంబ నియంత్రణమో అంటూ ఘోష పెడుతుంటే, మేమేమంత మూర్ఖులమనుకున్నావా? మా కీ బాబొక్కడే చాలు."

"ఫుల్‌స్టాప్!" అన్నాడు భాస్కర్. నవ్వుల మధ్య "ఆదర్శం మంచిదే" అంది రాధ.

విజయా భాస్కరులను వదిలి అంతా బయటికి వచ్చేశారు.

ఆగది తలుపులు మెల్లిగా మూసుకున్నాయి.

కింద కుసుమ గదిలోంచి మంద్రస్థాయిలో ఆమె కంఠం వినవచ్చింది.

"అహం దూరత స్తే పదాంభోజయుగ్మ
ప్రణామేచ్ఛయాగత్య సేవాం కరోమి
సకృత్సేవయా నిత్య సేవా ఫలం త్వం
ప్రయచ్ఛ ప్రయచ్ఛ ప్రభో వెంకటేశ."



పవని నిర్మల ప్రభావతి

మనుషులు వేరు, మనసులు వేరు. మనిషి - పైకి కనిపించే తీరు వేరు; మనసు - లోపల ఆలోచించే దారి వేరు. మనిషినిచూసి మనస్సు ఎటువంటిదో తెలుసుకోవడం కష్టమే. అందులో కల్యాణివంటివారికి ఆ విషయం మరీ కష్టం. ఆగర్భ శ్రీమంతురాలు, అనుభవశూన్యురాలు కల్యాణి. దురహంకారానికి, దురభిప్రాయాలకి నెలవు. బంగారంవంటి భర్తను పరిభవిస్తుంది; పయోముఖవిషకుంభానికి చనువిస్తుంది; పండంటి కాపురానికి ముప్పు తెచ్చుకొంటుంది.

కల్యాణికి కనువిప్పు కలుగుతుందా? కాపురం నిలబడుతుందా?

యం. శేషాచలం అండ్ కో

